# అది నా అదృష్టం

## -ఫరా కరిమాయి

**దక్షిణాదిన బాలీవుడ్ భామల హవానే కాదు, విదేశీ భామల హవా కూడా సాగుతోంది. నిన్న అమీజాక్సన్, నేడు ఫరా కరిమాయి. ఎక్కడో పుట్టి పెరిగి, మన దేశానికి వచ్చి సినీరంగంలో స్థిరపడింది ఈ బ్యూటీ. దక్షిణాదిన ఏ హీరోయిన్‌కూ అంత త్వరగా దక్కని అదృష్టం ఫరాను వరించింది. అదీ ఇద్దరు స్టార్ హీరోల సినిమాల్లో నటించడం! పాత్రలు చిన్నవే అయినా అవి చేయడం నా అదృష్టం అంటున్న ఫరాతో...**

### మీ గురించి...

పుట్టిందీ, పెరిగిందీ అంతా నెదర్లాండ్‌లోనే. నా చదువంతా కూడా అక్కడే! చదువు అయిన తరువాత ఇంటర్న్‌షిప్ కోసం దక్షిణాఫ్రికా వెళ్లాను. అక్కడ అనుకోకుండా సినిమా అవకాశం వచ్చింది. ఆ సమయంలో అక్కడ ఓ సినిమా ఏజెన్సీ వారు నాతో ఒప్పందం కుదుర్చుకున్నారు. దాంతో కొన్నినెలల పాటు అక్కడే ఉండిపోయాను.

### ఇండియాకి ఎప్పుడు వచ్చారు?

చదువూ, దానికి తగిన ఉద్యోగం అని కాకుండా నటనే ప్రొఫెషన్‌గా తీసుకుందామని అనిపించింది. దక్షిణాఫ్రికాలో ఉన్న సమయంలోనే బాలీవుడ్ గురించి విన్నాను. దాంతో నా అదృష్టం పరీక్షించుకుందామని 2013లో ఇండియాకి వచ్చాను. రాగానే ముందుగా యాడ్స్‌లో అవకాశాలు వచ్చాయి. రెండు సంవత్సరాల పాటు యాడ్స్ చేస్తూ బిజీ అయ్యాను. మోడల్‌గా సక్సెస్ అయిన తరువాత సినిమాల మీద దృష్టి పెట్టాను. ఇక్కడ నన్ను నేను నిరూపించుకోవాలనే ఉద్దేశంతో డ్యాన్స్, నటన, భాషలో శిక్షణ తీసుకున్నాను. 2015లో 'తేరా సురూర్'లో అవకాశం వచ్చింది. సినిమా పెద్దగా విజయం సాధించలేదు కానీ నా నటనకు మంచి మార్కులే పడ్డాయి.

### దక్షిణాదిన అవకాశం ఎలా వచ్చింది?

'తేరా సురూర్'లో చేస్తున్న సమయంలోనే 'ధృవ'లో ఛాన్స్ వచ్చింది. అరవింద్‌స్వామిగారి ప్రియురాలిగా నటించాను. విలన్ షేడ్స్ ఉన్న పాత్ర అది. చిన్న పాత్రే. కానీ గుర్తింపు తీసుకొచ్చింది. తెలుగులో ప్రారంభంలోనే ఇద్దరు స్టార్లతో చేయడం నా అదృష్టం. అరవింద్‌స్వామిగారిని చూస్తే సీరియస్‌గా కనిపిస్తారు కానీ, చాలా బాగా మాట్లాడతారు. ఆయనలో స్టార్ పవర్ చూడాలంటే తెర మీద చూడాల్సిందే! తక్కువ మాట్లాడతారు. ఎక్కువ పనిచేస్తారు.

### 'గౌతమిపుత్ర శాతకర్ణి' లో అవకాశం గురించి...

నా ఫీచర్సే కారణం అనుకుంటాను. నా ముఖంలో విదేశీ పోలికలు బాగా కనిపిస్తాయి. అందుకే ఈ సినిమాలో నాకు అవకాశం ఇచ్చారు. ఇందులో గ్రీకు రాకుమారిగా కనిపించాను. బాలకృష్ణగారి పక్కన నటించడానికి మొదట్లో భయపడ్డాను. బాలకృష్ణగారూ, క్రిష్ గారూ నాలో భయాన్ని పోగొట్టారు.

### శ్రియాతో నటించడం ఎలా ఉంది?

తను చాలా సీనియర్. తనకూ నాకూ పోలికే లేదు. తన గురించీ, తన సినిమాల గురించీ బాలీవుడ్‌లో ఉన్న సమయంలోనే విన్నాను. అక్కడ తనవి కొన్ని సినిమాలు కూడా చూశాను. చాలా ఫ్రెండ్లీగా ఉంటుంది. తనతో సీన్లు పెద్దగా లేకపోయినా, ఈ సినిమా ద్వారా మంచి స్నేహితురాలైపోయింది.

### తెలుగు ఇబ్బంది అనిపించలేదా?

కష్టంగానే అనిపించింది. చెప్పానుగా బాలకృష్ణగారు, క్రిష్‌గారి సపోర్ట్ వలన దాన్ని అధిగమించగలిగాను.

### తెలుగులో ఒప్పుకున్న సినిమాలు?

తెలుగులో ఎక్కువగా ఐటెంసాంగ్స్‌కి అడుగుతున్నారు. చిన్న పాత్ర అయినా చేస్తాను కానీ, ఐటెంసాంగ్స్ అంటే కష్టం. ఈ కారణంగా రెండు మూడు అవకాశాలు వదులుకున్నాను. మంచి పాత్ర, మంచి సినిమా కోసం కొంత కాలం వెయిట్ చేద్దామని అనుకుంటున్నాను.

### బాలీవుడ్‌లో చేస్తున్నారా?

అక్కడ కథలు వింటున్నాను. రెండు కథలు నచ్చాయి. వాటికి ఇంకా ఓకే చెప్పలేదు.

-కె. రామకృష్ణ



## సరదాగా....

### శాపం

మహిమలు ఉన్న ఒక వ్యక్తి ఓ పార్టీకి వెళ్లాడు. అక్కడ అంతా బాగా తాగి ఉన్నారు. అక్కడున్న వారంతా ఆవ్యక్తి వేషం చూసి అతడిని ఆటపట్టించసాగారు.

నాయనా! నేను మిమ్మల్ని ఏమీ అనలేదు, నాకు కోపం తెప్పించకండి... శపించగలను అన్నాడు.

వారు అతని మాటలు పట్టించుకోకుండా అరే పాగల్‌గా, శపిస్తవా? శపించరా చూద్దాం, బావురు గడ్డమూ, నువ్వూనూ అని నవ్వసాగారు.

ఆ వ్యక్తికి చాలా కోపం వచ్చింది. అకస్మాత్తుగా ఆ వ్యక్తిని చూసి నవ్విన వారందరి కళ్ళూ పోయాయి.

వారు తమ తప్పు తెలుసుకుని అతని కాళ్ల మీద పడి ఏడవసాగారు.

స్వామీ, మీ మహిమ తెలియక హేళన చేశాం. మాతప్పు మన్నించండి.. మా కళ్ళు మాకు ప్రసాదించండి అని వేడుకున్నారు. అప్పుడు ఆవ్యక్తి, అరేయ్ మీకు బాగా ఎక్కేసిందిరా! నేను మిమ్మల్ని శపించలేదు. మీ కళ్ళూ పోలేదు. కరెంటు పోయింది నాకూ కనపడట్లేదు, కింద పడేలా ఉన్నాను నాకాళ్లు వదలండిరా అంటూ మొత్తుకున్నాడు.

### ఒక ప్రశ్న?

ముగ్గురు స్నేహితులు కలిసి జ్యూస్ షాపుకి వెళ్లారు. ముగ్గురూ తమకు కావలసిన ఫ్లేవర్స్‌లో తమకు నచ్చిన జ్యూస్ ఆర్డర్ చేశారు. జ్యూస్‌లు వచ్చాయి. ముగ్గురూ సరదారాయుళ్లేమో సరదాగా ఓ పందెం వేసుకుందామా అనుకున్నారు. అనుకున్నాం కదా ఇంకెందుకు ఆలస్యం అంటూ పందెం గురించి చర్చించారు. జ్యూస్ షాపులో ఉన్నాం కదా జ్యూస్ మీదనే పందెం వేసుకుంటే పోలా అని కూడ బలుక్కున్నారు. మరో మూడు ఖాళీ గ్లాసులు తెప్పించారు. జ్యూస్ ఉన్న గ్లాసులు మూడు ఉన్నాయి. ఖాళీ గ్లాసులు మూడు ఉన్నాయి. మొత్తం ఆరు గ్లాసులు. గ్లాసులన్నింటినీ వరుసగా పేర్చారు. చుట్టూ కూర్చున్న వాళ్ళు ఆసక్తిగా వీళ్లనే గమనిస్తున్నారు. వరుసలో 1, 2, 3 గ్లాసులు జ్యూసు గ్లాసులు, 4, 5, 6 గ్లాసులు ఖాళీ గ్లాసులు. ఇంతకీ పందెం ఏమిటంటే ఒకే ఒక్క గ్లాసును కదిపి, జ్యూస్‌గ్లాసు, ఖాళీగ్లాసు ఒకదాని తరువాత ఒకటి వచ్చేట్టుగా అమర్చాలి. చుట్టూ ఉన్న వాళ్ల ఆసక్తి మరింత పెరిగింది. షాపులోని వెయిటర్లు కూడా వీళ్లనీ, గ్లాసులనే చూస్తున్నారు. వాళ్లూ ఆలోచిస్తున్నారు ఏ గ్లాసును స్థానభ్రంశం చెందించాలా అని. ముగ్గురూ వేళ్లమీద లెక్కలు వేస్తున్నారు ఏ గ్లాసును తీయాలా అని. చివరికి ముగ్గురిలో ఒకడు సాధించి పందెం గెలిచాడు. ఇంతకీ ఏ గ్లాసును కదిలించాడు? ఒకదాని తరువాత ఒకటి వచ్చాయా? వస్తే ఎలా? మరి మీరూ లెక్కలు వేసి పజిల్ పూరించండి.

**సమాధానం**

వరుసలో రెండో గ్లాసు కదిలిస్తే చాలు ప్రాబ్లమ్ సాల్వ్‌డ్. ఎలాగంటే వరుసలో రెండో గ్లాసులోని జ్యూసును, వరుసలో ఐదో స్థానంలో ఉన్న ఖాళీ గ్లాసులోకి వంపేస్తే సరి.













8

## జనం గుండెచప్పుడు రేడియో

ఎన్నితరాలు గడిచినా కొన్ని జ్ఞాపకాలు మన జీన్స్‌లో జీర్ణించుకుపోతాయి. రేడియో కూడా అంతే! రేడియో మన జీవితం! రేడియో మన బతుకు! మన విజ్ఞానం! కాలానుగుణంగా మార్పు చెంది నిలదొక్కుకుంది. 13 ఫిబ్రవరి వరల్డ్ రేడియో డే సందర్భంగా ఆ ముచ్చట్లు మీ కోసం....

**40**

### సాహస జంటలూ.. క్రేజీ పెళ్ళిళ్ళు

పెళ్ళంటే ఒకప్పుడు చుట్టుపక్కల పదిఊళ్ళు చెప్పుకునేలా చేసేవారు. కానీ ఇప్పుడో! ప్రపంచ దేశాల్లో ఆ వార్త మారుమోగిపోయేలా వింత వింత తరహాల్లో పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారు!

**72**

### ఇంటర్వ్యూ

మితభాషి, సహజ నటుడు శరత్‌బాబు. మీకెంతమంది పిల్లలు? అనడిగితే పాతికమంది అని ఠక్కున చెబుతారు! బాప్‌రే! అంతమందే! అదేంటో మీరూ తెలుసుకోండి!

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: ప్రగ్యా జైస్వాల్
ఫొటో: గోపీకృష్ణ


రచనలు, కథలు పంపవలసిన చిరునామా

నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com





### ఎంజాయ్

అమ్మాయి దొరికింది. పెళ్ళికాబోతోంది. ఆనందంగా, హడావుడిగా ఉన్నాడు రమేష్. అది గమనించి, అతన్ని క్యాబిన్‌లోనికి పిలిచాడు బాస్.

"కంగ్రాట్స్ రమేష్! నాకు పెళ్ళయి పాతికేళ్ళయింది. అయినా ఆ రోజును నేను మరచిపోలేకపోతున్నాను. నువ్వు కూడా పెళ్ళి చేసుకోబోతున్నావు. నాలాగే నువ్వు కూడా ఈ రోజు మరచిపోకు. గుర్తుంచుకో! ఎంజాయ్." అన్నాడు బాస్.

"మీరు పొరబడుతున్నార్సార్! నా పెళ్ళి ఇవాళ కాదు, రేపు." చెప్పాడు రమేష్.

"తెలుసయ్యా! నేనేం పొరబడలేదు." అన్నాడు బాస్.

### తప్పేం లేదు

ఓ పెద్ద కారులోంచి దిగిందామె. హుందాగా నడచి, మందులషాపులోనికి వచ్చింది. షాపతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగిందిలా.

"సైనైడ్ కావాలి. ఉందా?"

"ఎందుకు? ఏ దారుణానికి?"

"నా భర్తను చంపాలనుకుంటున్నాను."

ఆ మాటకి షాపతను ఆశ్చర్యపోయాడు. చెప్పాడిలా.

"దేవుని మీద ప్రమాణం చేసి చెబుతున్నాను, మీకు ఎట్టి పరిస్థితుల్లోనూ నేను సైనైడ్ అమ్మనుగాక అమ్మను. భర్తను చంపుతారా? అమ్మో! చట్టానికి అది వ్యతిరేకం. పైగా ఇందుకని చెప్పిన తర్వాత మీకు నేను సైనైడ్ అమ్మితే నా షాప్ లైసెన్సు పోతుంది. మనిద్దరినీ జైల్లో పెడతారు. అనేక చిక్కుల్లో పడతాం. వద్దుగాక వద్దు. నా దగ్గర ఎలాంటి సైనైడ్స్ లేవు. ఇక మీరు వెళ్లొచ్చు."

వెళ్లలేదామె. హ్యాండ్‌బ్యాగు తెరిచి, అందులోంచి ఓ ఫొటో తీసింది. చూపించడానికి. ఆమె భర్త బిగికౌగిలిలో అతని భార్య పరవశిస్తోంది. అప్పుడతను అన్నాడిలా.

"మీరు సైనైడ్ అడిగారు. ప్రిస్క్రిప్షన్ చూపించారు, ఇస్తాను, తప్పేం లేదు."

### పువ్వులు

అతను ఓ మతిమరుపు మాస్టర్. అయితే తన మతిమరుపును భార్య గుర్తించరాదని చక్కని ఆలోచన చేశాడతను. తమ పెళ్ళిరోజు, భార్య పుట్టినరోజు డేట్స్ ఫ్రెండ్ ఫ్లోరిస్ట్‌కి ఇచ్చాడు. తగిన డబ్బు పే చేశాడు. ఆయా డేట్స్‌లో పువ్వులు ఇంటికి పంపుతూ, 'యువర్ లవింగ్ హజ్బెండ్' అని కార్డ్ పెట్టడం మరిచిపోకు అని మరీ మరీ చెప్పాడు. సరేనన్నాడు ఫ్లోరిస్ట్. గుండెల మీద చేయి వేసుకుని పడుకున్నాడు మాస్టర్. వారం గడిచింది. ముందుగా వాళ్ళ పెళ్ళిరోజు వచ్చింది. సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటికొచ్చాడతను. తలుపు తీసిన భార్యను దగ్గరగా తీసుకున్నాడు. ముద్దుపెట్టుకున్నాడు. ఆమె పరవశించిపోతోంది. అంతలో అక్కడ ఉన్న పువ్వులను చూశాడతను.

"అరె పువ్వులు! బలే బాగున్నాయి, ఎక్కడ కొన్నావు?" అడిగాడు.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 13 సంచిక: 50

15-2-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజీ

## జీవితం

మంచి నిద్రలో ఉన్నది మానస. ఫోన్ రింగైంది. ఈవేళప్పుడు ఎవరబ్బా? అని లిఫ్ట్‌చేసి హలో అంది. నేన్రా! అమ్మను మాట్లాడుతున్నాను అన్నది అవతలి గొంతు. ఏంటమ్మా ఆందోళన చెందింది మానస. బెడ్‌రూంలోంచి బయటికిరా! నీకో సంగతి చెప్పాలి అన్నది తల్లి. వస్తున్నా అని, బయటికి, బాల్కనీలోనికి వచ్చింది మానస. ఏంవైందే? ఇంత రాత్రప్పుడు ఫోనేంటి? అడిగింది. నేను పెళ్ళి చేసుకోబోతున్నాన్రా! రేపు ఉదయం పదకొండుగంటల ఏడునిమిషాలకు ఓల్డేజ్‌హోంలోనే నా పెళ్ళి. నువ్వు తప్పకుండా రావాలి అన్నది తల్లి. అయోమయంగా అమ్మా అన్నది మానస. నువ్వు విన్నది నిజమే! రేపు పదకొండుగంటల ఏడునిమిషాలకు నా పెళ్ళి. నువ్వు వస్తావని ఆశిస్తాను, ఉంటాన్రా! గుడ్‌నైట్ అన్నది తల్లి. ఫోన్ పెట్టేసింది. చేతిలోని ఫోన్‌ని ఓసారి చూసి, ఆలోచిస్తూ నిల్చుంది మానస.

తండ్రి కారు యాక్సిడెంట్‌లో పోయాడు. తల్లి ఒంటరిదైపోయింది. వచ్చే పెన్షన్‌తో తల్లి హాయిగా బతకగలదు. అయితే బతకనీయలేదు. అమ్మకి అన్నీ మనమే! వేరే దిక్కు లేదు. తెచ్చి ఇంట్లో పెట్టుకుందాం అంటే...అత్తగారి పెన్షన్‌కి ఆశపడ్డాడో, లేకపోతే వంటమనిషీ, పనిమనిషీ అక్కర్లేదని లెక్కలేశాడో, ఏ కళనున్నాడో అల్లుడు అందుకు ఒప్పుకున్నాడు. తీసుకువచ్చి తల్లిని ఇంట్లో పెట్టింది. ముందు మూడునెలలూ బాగానే గడిచాయి. అమ్మమ్మా అని పిల్లలూ, అత్తగారూ అంటూ భర్తా తల్లితో బాగానే ఉన్నారు. నాలుగో నెల నుంచే సమస్యలు ప్రారంభమయ్యాయి. ఏంటమ్మా ఇంత లేటు? కాలేజీ మధ్యాహ్నం నాలుగ్గంటలకే అయిపోతే రాత్రి ఎనిమిదింటికా నువ్వు ఇంటికొచ్చేది అని మనవరాలిని నిలదీస్తే ఒప్పుకోలేదది. నీకెందుకే ముసలీ! వెళ్ళి నీ పనేదో నువ్వు చూసుకో అన్నది. ఏంట్రా నీ దగ్గర సిగరెట్టు వాసన. సిగరెట్లు తాగుతున్నావా? మనవణ్ణి అడిగింది ఓసారి. సిగరెట్లే కాదు, మందూ తాగుతాను, నీకెందుకు? వెళ్ళి పడుకో అన్నాడు మనవడు. అల్లుడు సంగతి చెప్పనవసరం లేదు. ఓ రాత్రివేళ ఆయన వేసిన వీరంగం అంతా ఇంతా కాదు. మందుకొట్టి వచ్చారాయన. అమ్మ తలుపు తీసింది. తీయకూడదట! భార్యే తియ్యాలట! పెద్ద గొడవ పెట్టుకున్నారు. ఇక ఒక్కక్షణం కూడా అమ్మ ఇంట్లో ఉండడానికి వీల్లేదన్నారు. పొమ్మన్నారు. ఎక్కడికిపోతుంది? ఇప్పటికిప్పుడు వేరింటికాపురం అంటే ఓల్డేజ్‌హోమే దిక్కు అన్నది తల్లి. వెళ్ళి ఓల్డేజ్‌హోంలో చేరింది.



చేరి సంవత్సరం దాటింది. ఈ సంవత్సరకాలంలోనూ రెండుసార్లు తల్లిని చూడగలిగింది తను. మదర్స్‌డే నాడు ఒకసారి, ఇంకోసారి ఆమె పుట్టినరోజు నాడు. కలిసిన రెండుసార్లూ ఎలాంటి సమస్యలూ ఏకరువు పెట్టలేదు తల్లి. పైగా నువ్వు ఎలా ఉన్నావురా? అంటూ తన గురించే అడిగింది. ఏంటమ్మా నువ్వూ, నీ జీవితం అని బాధపడితే... ఒకొక్కసారి ప్రశ్నలే కష్టంగా ఉంటాయిరా, జవాబులు చాలా సులభంగా ఉంటాయి. నాకేం? నేను చాలా హాయిగా ఉన్నాను. మంచిస్నేహితులూ, మంచిపుస్తకాలూ, పట్టీ పట్టించుకోనితనమే జీవితం అని నవ్వింది.

రాత్రి అంతా ఆలోచిస్తూనే గడిపింది మానస. తెల్లారిందో లేదో ఓల్డేజ్‌హోంకి చేరుకుంది. ముస్తాబు అయి ఉన్న తల్లిని కలిసింది. నాన్నగారు ఏం చేస్తారే? అడిగింది. ఏం చేస్తారు? అరవై ఏడేళ్ళు. రిటైరై నాలాగే ఇక్కడ ఉంటున్నారు. కాకపోతే నాకు ఇష్టమైన హిందీ సినిమా పాటలు బాగా పాడతారు. ఏ రాతే, ఏ మౌసం, నదీకాకినార, ఏ చంచల్ హవా...పాటలోని రెండుగొంతులూ తానే పాడతారు. మిమిక్రీ అద్భుతంగా చేస్తారు. అలాగే నాకిష్టమైన పుస్తకాలే అతనికీ ఇష్టం. బాగా చదువుతారు. మామిడిపళ్ళు కూడా నాలాగే తెగిష్టం అని నవ్వింది తల్లి. పెళ్ళి అయిన తర్వాత ఇక్కడే ఉందామనుకుంటున్నారా? అడిగింది మానస. ఉండొచ్చుట! కాకపోతే ఇల్లు అద్దెకు తీసుకుని బయట ఉందామంటున్నారాయన. ఇదేనా జీవితం? అడిగింది మానస. ఇంతకంటే ఇంకేం ఉంటుందిరా? జీవితం అంటే సైకిల్ తొక్కడంలాంటిది. బ్యాలెన్స్ చేసుకుంటే చాలు, ముందుకుపోతాం అంది తల్లి. ఒక్కటి గుర్తుంచుకోరా! అయినవాళ్ళూ స్నేహితులూ కాదంటారు. పరిస్థితులు మారిపోతూ ఉంటాయి. అయినా జీవితం ఆగదు. జీవితం అంటే బతకడం కాదురా, జీవించడం అంది తల్లి. మానస బుగ్గ మీద సున్నితంగా చరిచింది. పద! పెళ్ళికి టైమైంది అని లేచింది. మూర్తీభవించిన ధైర్యంలా ఉన్న తల్లిని చూసి చేతులు జోడించి నమస్కరించింది మానస.

నవ్య




### దయ గల గోడ

ఏదయినా రహస్యం చెప్పుకోవాలంటే గోడలకు చెవులుంటాయి అని మెల్లగా చెప్పుకుంటారు. అపార్థాలు, అసూయలు మనుషుల మధ్య అడ్డుగోడలు కడుతున్నాయి అంటారు. ఇలా అడ్డుగోడలు, చెవుల గోడలతోపాటు మానవత్వపు గోడలు కూడా ఉన్నాయి. అవి పేదవాళ్లకోసం, ఒంటినిండా సరిగ్గా బట్టల్లేని వారికోసం, అనాథలు, అభాగ్యుల కోసం ఏర్పాటు చేసినవి. వాల్స్ ఆఫ్ కైండ్‌నెస్!

జైపూర్, అలహాబాద్, డెహ్రాడూన్ వంటి అనేక నగరాల్లో నెక్కీ కీ దీవార్ పేరుతో ఈ గోడలు ఏర్పాటుచేశారు. గోడలకు అందమైన పెయింట్స్ వేసి, మనసుని హత్తుకునేలా, "మీకు అవసరం లేనిదేదయినా సరే ఇచ్చేయండి... కావాలంటే సంతోషంగా తీసుకోండి" అనే కొటేషన్స్ రాస్తారు.

పబ్లిక్ ప్రదేశాల్లో, జనసంచారం ఉన్నచోట, కమ్యూనిటీ సెంటర్ల దగ్గర ఈ వాల్ ఆఫ్ కైండ్‌నెస్ పెడతారు. దానికి కొన్ని హ్యాంగర్లు ఉంటాయి. దాతలు తమకు ఉపయోగపడని బట్టలు అక్కడ తగిలించి వెళతారు. అవి ఎవరికి అవసరం ఉన్నా నిరభ్యంతరంగా వాటిని తీసుకెళ్లొచ్చు. టవల్ దగ్గర్నుంచి ప్యాంటు, షర్టు, బ్లాంకెట్...ఇలా అభాగ్యులకు పనికొస్తుంది అనే ప్రతీదీ గోడకు హ్యాంగ్ చేసి వెళ్తారు. పుస్తకాలు, బొమ్మలు, చెప్పులు ఇలా




ఎవరికి ఏది దానం చేయాలనిపిస్తే దాన్ని ఈ గోడలకు తగిలించేసి వెళతారు.

ఇరాన్‌లో మొదలైన ఈ సేవాతత్పరత మెల్లిగా దేశమంతా పాకింది. పాకిస్థాన్ లాంటి దేశంలో కూడా మంచి ఫలితాన్నిచ్చింది. రోడ్డు పక్కన నివసించే వారికి ఇవి ఎంతగానో ఉపయోగపడుతున్నాయి. ఆ స్ఫూర్తితోనే భోపాల్‌లో మహేష్ అగర్వాల్ నెక్కీకే దీవార్ పేరుతో ఈ సాయం చేస్తున్నాడు. కావల్సిన బట్టలు దొరికినప్పుడు వాళ్ల కళ్లలో ఆనందాన్ని చూసి మహేష్ పొంగిపోతున్నాడు. ఊరూ పేరూ లేని దాతలకు ఆయన మనసులో నిత్యం కృతజ్ఞతలు తెలుపుకుంటూనే ఉంటాడు. వాళ్లే లేకపోతే ఈ కాన్సెప్టే అర్థం లేదంటాడాయన. రాబోయే రోజుల్లో మరిన్ని నగరాల్లో ఇలాంటి వాల్ ఆఫ్ కైండ్‌నెస్ ఏర్పాటు చేయాలనే ప్రణాళికలో ఉన్నాడు.

దీనికోసం అడ్మినిస్ట్రేషన్, రిజిస్ట్రేషన్ వంటివి అవసరం లేదు. అందంగా పెయింట్ చేసిన చిన్న గోడ, దానికి కొన్ని హ్యాంగర్లు ఉంటే చాలు. దానం ఇచ్చేవాళ్లు ఇస్తారు. అవసరం ఉండి తీసుకునేవాళ్లు తీసుకుంటారు. ఇది నిరంతర ప్రక్రియ. ఈ గోడలపై ఎప్పుడూ మానవత్వం పరిమళిస్తూనే ఉంటుంది.

# మెయిల్ బాక్స్

### బాబాయ్ రావాలి

నా జీవితంలో 'హరివంశం' చదివే అవకాశం ఇచ్చినందుకు నవ్య వీక్లీకి ధన్యవాదాలు. రామాయణం చదివి ఆస్వాదించాం. 'మొదటిపేజీ' పుస్తకంగా తెచ్చినందుకు ధన్యవాదాలు. మొదటిపేజీలో మళ్ళీ బాబాయి రావాలి, మా బోటోళ్లకు దిగులు తీసెయ్యాలి. మమ్మల్ని నవ్వించాలి. అదే మా కోరిక. రావూరి భరద్వాజగారి పాకుడురాళ్ళు నవల డైలీసీరియల్‌గా వచ్చిన 50 ఏళ్ళకి ఇప్పుడు ఆ తరహాలో ప్రభాకర్‌జైనిగారి సినీవాలి సీరియల్ నవ్య వీక్లీలో వస్తోంది. ఒక స్త్రీ హృదయాన్ని ఆవిష్కరించడంలో అద్భుత ప్రతిభ చూపించిన జైని అభినందనీయులు.

*-రంగా, హైదరాబాద్*

### వెలుగుచూడని సంగతుల సినీవాలి

సినీవాలి సీరియల్ ఉత్కంఠగా సాగుతోంది. ఒక రచయిత దర్శకుడైతే, ఒక దర్శకుడు రచయితైతే ఆ రచన ఎంత అద్భుతంగా ఉంటుందో అనడానికి ఈ సీరియల్ ప్రతిబింబం. తెరవెనుక వెలుగు చూడని సంగతులు, చీకటికోణాలు కళ్ళకు కట్టినట్టు ఆవిష్కరిస్తున్న జైని అభినందనీయులు. ఈ సీరియల్ మరిన్ని అవార్డులు అందుకోవాలని, పాఠకాదరణగల నవలగా ఇది గుర్తుండిపోతుందనీ ఆశిస్తున్నాను. హరివంశం ఆరంభం ఉత్సాహాన్నిచ్చింది.

*-ఎం.వెంకటేశ్వరరావు, సికింద్రాబాద్*

### పోటాపోటీ సీరియల్స్

వెట్టి, సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు సీరియల్స్ రెండూ విభిన్నకథనాలతో పోటాపోటీగా కొనసాగుతున్నాయి. మార్నింగ్ కాఫీలో సులువు బిట్ సూపర్ హిట్. మొదటిపేజీ హృద్యంగా ఉంది. 'వింతైన వంతెనలు' గమ్మత్తుగా ఉన్నాయి. ఇవన్నీ నిజాలే కాలమ్ అద్భుతం.

*-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

### స్వీట్ మెమొరీ

శ్రియ ముఖచిత్రం ముగ్ధమనోహరం. పి.ఎస్.నారాయణగారి 'నిష్ఠాతుడు' కథ ఒక స్వీట్ మెమొరీకి నమూనా. పరాన్నభుక్కులు కథ చాలాబాగుంది. పిల్లలజాడ తెలిపే ఐటిటి స్టార్టప్ పేరెంట్స్‌కు గొప్పవరం. కాఫీజోక్స్, సరదా ముచ్చట్లూ నవ్వించాయి. రెగ్యులర్ ఆహారపదార్థాలు అతిగా తీసుకుంటే వచ్చే సమస్యలు వివరంగా తెలియజేశారు నివేదిత. మనసున మనసై నేస్తం, టూరిజం డే స్పెషల్స్ అన్నీ వ్యక్తి వివేకానికీ, వికాసానికీ తోడ్పడేవే.

*-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం*

### హేతువేదం కథ ఆసక్తికరం

గంధం యాజ్ఞవల్క్య శర్మగారి హేతువేదం కథ ఆసక్తిదాయకంగా ఉంది. హేతువాదికైనా, హేతువేదానికైనా హృదయస్పందనలుంటాయి. అవి సరిగా స్పందించడమే అందరూ కోరుకునే శుభకామనలు.

*-టి.ఉమామహేష్, హైదరాబాద్*

### వింతైన వంతెనలు భలే

వింతైన వంతెనలు వ్యాసం భలే ఉంది. ఈ జన్మలో మేం అలాంటి వంతెనలు చూడలేంగానీ వాటి గురించి చదివి చూసిన అనుభూతిపొందాం. హేతువేదం కథలో పాత్రలు రివర్స్ అయ్యాయి. కథలో భావన అద్భుతంగా ఉంది.

వంతెనల వ్యాసం వింతగా ఉంది. రోలర్ కోస్టర్ వంతెన, వృక్షాలతో నిర్మితమైన వంతెన, వేలాడే వంతెన, గోల్డెన్‌గేట్ బ్రిడ్జ్ ఇలా ఇవన్నీ ఎంతో ఆశ్చర్యపరిచాయి. పత్రికలో ప్రతిపేజీ బాగుంటోంది.




*-ప్రవీణ్, కాకినాడ,*
*వల్లి, హైదరాబాద్*

### మనోధైర్యమిచ్చిన వ్యాసం

'గెలవాలంటే వదిలేయాలి' కథనం ఎంతో ధైర్యాన్నిస్తోంది. మానసికంగా కుంగిపోకుండా డీలా పడకుండా విజయం దిశగా పయనించేందుకు ఇలాంటి కథనాలు ఉపయుక్తంగా ఉంటాయి. యువత చదివితీరాలి. వింతైన వంతెనలు ఆశ్చర్యం కలిగించాయి. ఇంజనీర్ల సాంకేతికత, వారి నైపుణ్యం అద్భుతం. నటి ఇంద్రజ ఇంటర్వ్యూలో ఎన్నెన్నో విషయాలు తెలుసుకోగలిగాం. సీరియల్స్ కథలు ఆకట్టుకున్నాయి. వారం వారం మొదటిపేజీ చదివి తీరాల్సిందే.

*-నీలిమ సబ్బిసెట్టి, రాజానగరం.తూ.గో.జిల్లా*

### ఉపయుక్తమైన శీర్షిక 'ఆరోగ్యమే మహాభాగ్యం'

ఉపయుక్తమైన శీర్షిక ఆరోగ్యమే మహాభాగ్యం. దీనివల్ల ఆరోగ్యం మెరుగుపడుతుంది. సురభిలో కొండచిలువల సాక్షిగా పెళ్ళి, ఒంటె, గుర్రం విడదీయరాని బంధం విశేషాలు ఆకట్టుకున్నాయి.

ఫిబ్రవరి ఒకటవతేదీ నవ్య వీక్లీ ముఖచిత్రం చాలా బాగుంది. ఇవన్నీ నిజాలే చాలా బాగున్నాయి. కోట శ్రీనివాసరావుగారి జీవిత కథ ఆసక్తికరంగా ఉంది. ఆరోగ్యమే మహాభాగ్యం శీర్షిక చాలా ఉపయోగకరంగా ఉంది. వెట్టి ఇంట్రెస్టింగ్‌గా ఉంది. 'గెలవాలంటే వదులుకోవాలి' చాలా బాగుంది.

*-కె.సుభాష్, శ్రీనగర్, తూ.గో.జిల్లా*
*-రాపర్ల లోకబాంధవ, మచిలీపట్నం*

### ఆకట్టుకుంటున్న శీర్షికలు

వీక్లీలో వారం వారం వస్తున్న రివ్యూ, మార్నింగ్ కాఫీ, సరదాగా ఒక ప్రశ్న, సురభి, మొదటిపేజీ బాగుంటాయి. వీటిల్లో నేను మొదటిపేజీకి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాను. వీటిని చదివిన తర్వాతే మిగిలిన కథలు చదువుతాను. మొత్తానికి అన్ని శీర్షికలూ ఆకట్టుకుంటున్నాయి.

*-టి.బాల్‌ముకుంద్‌సింగ్, అమరచింత*

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్



డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959

# ఏసీఎల్ గాయాలకు సురక్షితమైన చికిత్సా విధానాలు

## ఆర్థోస్కోపిక్ విధానంలో కొత్త లిగమెంట్ పునర్నిర్మాణం

ఆటలు ఆడే సమయంలో లేదా ద్విచక్రవాహనం నడుపుతున్నప్పుడు రోడ్డు ప్రమాదాలకు గురైతే ఎక్కువగా మోకాళ్లకు గాయాలవుతుంటాయి. మోకాలికి గాయం అయినప్పుడు దాని చుట్టూ చాలా చోట్ల నొప్పి కలుగుతుంది. కొన్ని రకాల గాయాలు తగ్గినట్టు అనిపించినా దీర్ఘకాలికంగా అవి చాలా ఇబ్బంది పెడుతుంటాయి. ఈ కోవకు చెందినవే యాంటీరియర్ క్రూషియేట్ లిగమెంట్ (ఏసీఎల్) గాయాలు. మోకాలికి తగిలే దెబ్బల్లో ఏసీఎల్ గాయాలే ఎక్కువ. ఈ సమస్యకు సకాలంలో సరైన చికిత్స తీసుకోవడం అవసరం.

### ఏసీఎల్ గాయాలంటే :

మోకాలి కీలు మూడు రకాల ఎముకలతో నిర్మితమై ఉంటుంది. కాలికి చిప్ప, తొడ ఎముక కింది భాగం, కాలి ఎముక పైభాగం. ఈ మూడు ఎముకలు నిలకడగా ఉండడానికి దారం లాగా కట్టిన నాలుగు కీలకమైన లిగమెంట్స్ ఉంటాయి. దాంట్లో మోకాలు పక్కభాగంలో రెండు, మోకాలి మధ్య భాగంలో రెండు ఉంటాయి. మధ్యలో ఉండే వాటినే క్రూషియేట్ లిగమెంట్స్ అంటాం. వైద్య పరిభాషలో ముందుండే లిగమెంట్‌ను యాంటీరియర్ అని, వెనుక ఉండే దానిని పోస్టీరియర్ అని అంటారు. ఇవి మోకాలు ఎముకలు అటు ఇటు జారకుండా స్థిరంగా ఉండేందుకు దోహదపడతాయి. ఇవి పూర్తిగా తెగిపోతే దానంతట అదే మానదు. ఒక సారి ఇది గాయపడితే దీనికి రక్తసరఫరా జరగదు కాబట్టి ఇది శాశ్వత నష్టం చేకూర్చే ప్రమాదంగా పరిణమిస్తుంది. మోకాలి లోపల రక్తం గడ్డకట్టదు. రక్తం గడ్డ కట్టకపోతే ఏ గాయం కూడా మానదు. కాబట్టి సర్జరీ ద్వారా దీనికి పునర్నిర్మాణం చేయాల్సి ఉంటుంది.

### ఎవరిలో ఎక్కువ :

పాశ్చాత్య దేశాలలో ఎక్కువగా ఫుట్‌బాల్, జంపింగ్ వంటి ఆటలాడే సమయంలో ఏసీఎల్ గాయాలకు లోనవుతుంటారు. ఆ దేశాలలో ఈ సమస్యను స్పోర్ట్స్ ఇంజూరిగానే పరిగణిస్తారు. కానీ మనదేశంలో సాధారణంగా ఎక్కువగా ద్విచక్ర వాహనాలు నడిపేవారు ప్రమాదాలకు గురైనప్పుడు ఈ లిగమెంట్ దెబ్బతింటుంది.

### వైద్యులను ఎప్పుడు కలవాలి :




- గాయంతో పాటు మోకాలి స్థిరత్వం పోయినట్లుగా అనిపిస్తుంది.
- హఠాత్తుగా పక్కకు తిరగాల్సి వచ్చినప్పుడు పడిపోయినట్లు అనిపించడం.
- ఎగుడు దిగుడు ప్రాంతాలలో నడుస్తున్నప్పుడు ఎక్కువగా ఇబ్బందిగా అనిపించడం.
- వంపుగా ఉన్న ప్రాంతంలో దిగుతున్నప్పుడు మోకాళ్ళు జారిపోతున్నట్లు అనిపించడం.
- గాయమైన చోట తీవ్రమైన నొప్పి వాపు ఉంటూ రెండు మూడు వారాలైనా తగ్గకపోవడం.



*Right Knee (Side View)*

### నిర్ధారణ పరీక్షలు :

వైద్యులు రోగిని పరీక్షించడం ద్వారా సమస్యను గుర్తించగలుగుతారు. ఇది కణజాలానికి సంబంధించిన సమస్య కాబట్టి ఎక్స్ రేలో కనిపించదు. ఎంఆర్ఐ స్కాన్ ద్వారా లిగమెంట్ తెగింది, లేనిదీ నిర్ధారించగలుగుతారు.

### సర్జరీ ఎవరికి అవసరం....!

యుక్తవయసులో ఉండి చలాకీగా తిరుగుతూ ఉండే వారికి ఏసీఎల్ గాయాలైతే శస్త్రచికిత్స సూచిస్తారు. ఈ గాయాలైన వారికి కొత్త లిగమెంట్ పునర్నిర్మిస్తారు. కాబట్టి సర్జరీ తర్వాత మళ్ళీ చలాకీగా తిరుగగలుగుతారు. అయితే వయసు పైబడిన వారిలో ఏఈసీఎల్ గాయాలైతే సంప్రదాయ చికిత్స అందిస్తూ, మోకాలి కదకలికలు తగ్గించుకోవాలని సూచిస్తారు. దాంతోపాటు ఇంట్లో చేసుకునేలా కొన్ని వ్యాయామాలు చేయాలని చెబుతారు. వీరికి సర్జరీ చేయకపోయినా ఏ ఇబ్బంది లేకుండా దైనందిన కార్యకలాపాలు చేసుకోగలుగుతారు.

### సర్జరీ ఎలా చేస్తారు...?

లిగమెంట్ తెగిన వారికి ఆర్థోస్కోపీ విధానంలో సర్జరీ నిర్వహిస్తారు. ఇది చిన్న కోతతో చేసే ఒక కీహోల్ సర్జరీ. 2-3 మిల్లీ మీటర్ల రంధ్రం చేసి, కెమెరాలతో కూడిన పరికరాలతో సర్జరీ నిర్వహిస్తారు. ఆర్థోస్కోపీ సురక్షితమైన ప్రక్రియ. ఈ సర్జరీలో కొత్త లిగమెంట్‌ను పునర్నిర్మాణం చేస్తారు. లిగమెంట్ పునర్నిర్మాణం చేయాల్సిన చోట శరీరంలో వేరే చోట నుంచి తొలగించిన లిగమెంట్‌ను పెడతారు. సాధారణంగా మోకాలి పక్కభాగంలో ఉన్న లిగమెంట్లను తొలగించి అమర్చుతారు. తొలగించిన భాగంలో మళ్లీ అక్కడ లిగమెంట్ పెరుగుతుంది. తక్కువ కోతతో ఆర్థోస్కోపీ విధానంలో సర్జరీ నిర్వహిస్తారు కాబట్టి నొప్పి తక్కువగా ఉంటుంది. వేగంగా నయమవుతుంది. ఇన్‌ఫెక్షన్ వచ్చే అవకాశం చాలా తక్కువ.

### సర్జరీ తర్వాత :

ఏసీఎల్ గాయాలైన వారికి సర్జరీ చేసిన మరుసటి రోజే నడిపిస్తారు. అయితే సర్జరీ అయిన నాలుగు నెలలపాటు ఫిజియోథెరఫీ, వ్యాయామాలు అవసరమవుతాయి. మూడు వారాల తర్వాత కారు డ్రైవింగ్ చేయవచ్చు. ద్విచక్రవాహనం మాత్రం సర్జరీ జరిగిన నాలుగు నెలల తర్వాతనే నడపాలి. నాలుగు నెలల పాటు కచ్చితంగా వైద్యుల సూచించిన సలహాలు, సూచనలు పాటించాలి.

# జనం గుండెచప్పుడు

# రేడియో









**కృష్ణా, గోదావరీ...**
**అమ్మ, ఆవకాయ..**
**రేగడిమట్టి, రేడియోపాట...!**
**ఇదీ మన అసలైన జీవితం!**
**ఎన్నితరాలు గడిచినా కొన్ని జ్ఞాపకాలు మన జీన్స్‌లో జీర్ణించుకుపోతాయి.**
**రేడియో కూడా అంతే!**
**రేడియో మన జీవితం!**
**రేడియో మన బతుకు!**
**రేడియో మనకు విజ్ఞానం!**
**ఇంకా చెప్పాలంటే రేడియో మన సంప్రదాయం.**

అది మనలో ఒక భాగం. తల్లిదండ్రులు, గురువు, దైవం మనల్ని ఎలా చేయిపట్టి నడిపిస్తారో ఆ కోవలో నాలుగోస్థానం ఆక్రమించిందే రేడియో! రాజ్యాంగం వ్యవస్థలు మూడేమూడు. కానీ వాటితోపాటు భావప్రకటనా స్వేచ్ఛ (ఆర్టికల్ 19-22) ప్రజాస్వామ్యంలో నాలుగో స్థంభంలా ఎలా స్థానం సంపాదించుకుందో అలాగే తల్లిదండ్రులు, గురువు, దైవం తర్వాత నాలుగోస్థానం సంపాదించుకుంది రేడియో! ఒకప్పుడు అందరూ రేడియో జీవులే. దాని వైభవ ప్రాభవం ఎప్పటికీ అమృతనంలాంటిదే.

రేడియో ప్రస్థానంలో నాటి, నేటి వైభవాన్ని మరోసారి గుర్తుచేసుకుందాం. **ఫిబ్రవరి 13న వరల్డ్ రేడియో డే** సందర్భంగా ప్రత్యేక వ్యాసం మీకోసం...

ఆకాశవాణి వార్తలు చదువుతున్నది....

అంటూ రేడియోలో మాటలు వినబడిన వెంటనే ఒకప్పుడు ఇంట్లో ఎక్కడికక్కడ నిశ్శబ్దం. ఆరోజు ఏం జరిగిందో తెలుసుకోవాలన్న ఉత్సుకత ప్రతి ఇంట్లోనూ కనబడేది. ఇక ఉదయం ఐదుగంటలైందంటే చాలు కోడికూతకి నిద్ర లేచేవారో కాదోగానీ కమ్మనైన సంగీతం వినేందుకు మాత్రం తప్పకుండా నిద్రలేచేవారు. పొద్దున్నే శ్రావ్యమైన రేడియో సిగ్నేచర్ ట్యూన్ నేటికీ ఆకర్షణే.

చిరుచీకట్లు తొలగేవేళ పక్షుల కిలకిలారావాల వెంట రేడియోలో మంగళవాద్యం, దేశభక్తి గీతం, వందేమాతరం, భక్తిరంజని ఇలా ఎన్నో వినడం చక్కటి అనుభవం. పనీ, పాట మొదలు రాజకీయాలు, సినిమా విశేషాలదాకా విజ్ఞాన, వినోదాలు అందిస్తూనే ఉంది రేడియో!

టీవీ, ఇంటర్నెట్ వంటి అధునాతన ప్రసార మాధ్యమాల తాకిడి తట్టుకుని కాలానుగుణంగా రూపు మార్చుకున్న రేడియో ఒక వారసత్వ సంపద. ఆధునిక మార్పుల్లో కనుమరుగైపోతుందనుకున్నారంతా! కానీ ఎఫ్ఎం కేంద్రాలతో ఊపిరి పోసుకుంది. ట్రాఫిక్‌లో ఉన్నా, బెడ్‌రూంలోఉన్నా పరిమితిలేని విజ్ఞాన వినోదాలు పంచుతోంది.

దేశంలో అత్యున్నతమైన రాష్ట్రపతి పదవి, అత్యున్నత భారతరత్న పౌరపురస్కారం పొందిన నిరాడంబర జీవి అబ్దుల్ కలామ్. ఆయన ఇంట్లో టీవీ కూడా ఉండేదికాదు. కేవలం రేడియోవిని వార్తలు, విశేషాలు తెలుసుకునేవారట కలామ్! అదీ రేడియో గొప్ప!

ఇక నరేంద్రమోదీ 'మన్ కీ బాత్' తెలుసుగా! ఈ దెబ్బతో రేడియో కొత్త తరం శ్రోతల్ని సంపాదించుకుని అధిక మొత్తంలో లాభాలు చేకూర్చుకుంది. ఇలా పల్లె నుంచి పట్టణం వరకు ప్రతి ఒక్కరూ ఇప్పటికీ రేడియో ఉపయోగిస్తున్నారు.

### ఇదీ రేడియో చరిత్ర

జాతిపిత మహాత్మాగాంధీ ఢిల్లీ ఆకాశవాణి కేంద్రం సందర్శించిన చరిత్రాత్మకమైన రోజును ఏటా 'పబ్లిక్ సర్వీస్ బ్రాడ్‌కాస్టింగ్ డే'గా పాటిస్తారు. టీ.వీ. ఇంత ముమ్మరంగా లేనిరోజుల్లో దేశ ప్రజలకు ప్రతి ఉదయం మేలుకొలుపు రేడియోనే. అలా శ్రోతల నరనరాల్లో ఇంకిపోయింది ఆకాశవాణి సిగ్నేచర్ ట్యూన్. భూపాల రాగంలా ప్రాచుర్యం పొందిన ఈ ట్యూన్ రూపకర్త జాన్ ఫౌల్డ్స్. దేశంలో తొలిసారి 1927 జులై 23న శ్రీరమ్మ తుల్లా ఛైర్మన్‌గా బొంబాయిలో ఇండియన్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ (ఐ.బి.సి) ఏర్పడింది. 1930లో ప్రసార వ్యవస్థ జాతీయకరణతో ఆ ఏడాది ఏప్రిల్ 1న ఐ.బి.సి పేరు ఇండియన్ స్టేట్ బ్రాడ్‌కాస్టింగ్ కంపెనీ (ఐ.ఎస్.బి.సి)గా మారింది.

భారతీయ ప్రసార వ్యవస్థ చరిత్రలో 1935 ఓ ముఖ్యఘట్టం. బ్రిటీష్ పాలనలో ఆలిండియా



రేడియో అని పేరు పెట్టిన వ్యక్తి లియోనల్ ఫీల్డెన్. 1936 జనవరి 1న ఢిల్లీ రేడియో కేంద్రం ఏర్పడింది. 1937-38లో విదేశీ ప్రసార, వార్తావిభాగాలు ఏర్పడ్డాయి. దక్షిణ భారతాన 1938లో తొలి రేడియో కేంద్రం మద్రాసులో ఏర్పడింది. దేశవిభజన నాటికి ఉన్న తొమ్మిది ప్రసార కేంద్రాల్లో విభజన తర్వాత మనకు ఆరు కేంద్రాలు మిగిలాయి. ఇక తర్వాత సమాచార ప్రసారశాఖ పేరు ఇన్ఫర్మేషన్ అండ్ ఆర్ట్స్‌గా మారింది.

తొలి ప్రసార సమాచార శాఖామంత్రి వల్లభాయ్ పటేల్. 1957 నుంచి రేడియోకు 'ఆకాశవాణి' పేరు స్థిరపడిపోయింది. మెల్లగా 1951 నాటికి దేశంలో ప్రసార కేంద్రాలు 21కి పెరగడమే కాదు, జాతీయస్థాయిలో ఆంగ్ల ప్రసంగాలు, రూపకాలు 1952-56 నడుమ ప్రారంభం కాగా, 1957లో వివిధ భారతి, 1966లో వాణిజ్య విభాగం, 1984 నుంచి డిస్ట్రిక్ట్ లోకల్ రేడియో పేరిట ఎఫ్ఎం స్థానిక కేంద్రాలు దేశమంతా విస్తరించాయి. 1975 తర్వాత నుంచి ప్రజల్ని చైతన్యపరిచే ప్రయోజనాత్మక ప్రచారాత్మక కార్యక్రమాలవైపు ప్రసార శాఖ దృష్టిపెట్టింది.

## ఆదరణ తగ్గలేదు

ఊహాశక్తికి ప్రాణంపోసేది రేడియో. ఒక విషయాన్ని మనం ఒక్కసారి వింటే ఎప్పటికీ మర్చిపోలేం. అలా కేవలం వినిపించడం ద్వారానే మనకు తెలియని అనేక విషయాలను రేడియో చెప్తోంది. ఇప్పుడు అనేక ప్రైవేట్ ఎఫ్ఎమ్ ఛానళ్లు వచ్చినా ఆలిండియా రేడియోకి ఉన్న ఆదరణ ఇప్పటివరకూ తగ్గలేదు. ఇప్పుడున్న సామాజిక మాధ్యమాలన్నీ కేవలం వార్తలకో లేదా వినోదభరిత కార్యక్రమాలకో పరిమితమై ఉంటే వాటిని కూడా అందిస్తూనే సంగీతం, సాహిత్యం, నాటకరంగం, జానపదం లాంటి కళలను రేడియో పోషిస్తోంది. ఇవన్నీ ఏ ప్రైవేటు రేడియో ఛానళ్ళు ఇవ్వలేవు. అంతేకాదు సంస్కృతం, హిందీ, తెలుగు, ఉర్దూ, ఇంగ్లీష్, మరాఠీ, కన్నడ.. ఇలా ఐదు భాషల్లో మనం ఆల్ ఇండియా రేడియోలో వార్తలు వినగలం. మారుతున్న కాలంతో పాటు రేడియోలో కొత్త తరహా ప్రసారాలు, ప్రసార కార్యక్రమాల్లో మార్పులు వచ్చిన మాట వాస్తవమే అయినప్పటికీ, పాతపద్ధతులు వాడుతూనే, కొత్త తరహాలో ఆకాశవాణి ప్రసారాలు ప్రారంభమవుతున్నాయి. మహిళల కోసం, యువత కోసం, పిల్లల కోసం ఇలా ఏ ఏజ్ గ్రూప్ వారికి అవసరమైన కార్యక్రమాలు మన ఆకాశవాణిలో ప్రసారమవుతున్నాయి. పట్టణాలతో పోల్చుకుంటే గ్రామీణ ప్రాంతాల్లో ఇప్పటికీ ఆకాశవాణికి ఆదరణ తగ్గలేదు. చాలామంది వింటున్నారు. కేవలం కార్యక్రమాలే కాదు, సమాజానికి మేలు చేసే ఉద్దేశంతో ఆకాశవాణి వివిధ రకాల కార్యక్రమాలు నిర్వహిస్తోంది. దేశభవిష్యత్తు యువత చేతుల్లోనే ఉంది. కానీ టెక్నాలజీ ముసుగులో యువత టార్గెట్ అనేది పెడధోరణి పడుతోంది. వారిని మోటివేట్ చేసేవిధంగా, వారిలో స్కిల్ డెవలప్‌మెంట్ కలిగించడానికి పాఠశాలలకు, కళాశాలలకు వెళ్లి ప్రముఖ వ్యక్తులతో మోటివేషనల్ క్లాసులు, అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. పల్లె ప్రాంతాల్లోకి వెళ్లి అక్కడివారిని కలిసి వారితో జానపద పాటలు పాడించి వినిపిస్తున్నాం. ముఖ్యంగా యువత, జానపదం, హాస్యం ఈ మూడు ముఖ్య అంశాలూ తీసుకుని వాటిపై వివిధ రకాల కార్యక్రమాలను మరిన్ని చేయడానికి కృషి చేస్తున్నాం.



**-వి. ఉదయ్ శంకర్**
**ప్రోగ్రాం హెడ్, ఆల్ ఇండియా రేడియో హైదరాబాద్**

### కళల కాణాచి

1948 డిసెంబర్ 1న విజయవాడ ఆకాశవాణి కేంద్రం ఏర్పడింది. తెలుగు రేడియో ప్రసారాల వైభవాన్ని మద్రాసు నుంచి అందిపుచ్చుకుని కెపిఎస్ నాయర్, శంకరన్, పింగళి లక్ష్మీకాంతం, శ్రీవాత్సవ, బుచ్చిబాబు, నండూరి సుబ్బారావు, రామ్మోహనరావు, ఓలేటి, బాలమురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం, వింజమూరి లక్ష్మి, ఉషశ్రీ, జివి కృష్ణారావులాంటి ఎందరో వ్యక్తులు సాహిత్య, సంగీత, నాటక కార్యక్రమాలను అత్యున్నత స్థాయిలో రూపొందించారు. కూచిపూడి నృత్యానికి జాతీయ నృత్యకళగా గుర్తింపు తేవడంలో విజయవాడ కేంద్రం మరువలేని కృషి చేసింది.

ప్రతిష్టాత్మక హైదరాబాద్ కేంద్రం అప్పట్లో అంటే 1933 నాటికి ప్రైవేట్ ప్రసారవ్యవస్థ. 1935లో నైజాంనవాబు అజమాయిషీలోకి వచ్చి, 1939 నాటికి రేడియో దక్కన్‌గా స్థిరపడి 1950 నాటికి ఆలిండియా రేడియో వ్యవస్థలో విలీనమైంది. హైదరాబాద్ కేంద్రంలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, స్థానం నరసింహారావు, మంచాలా జగన్నాథరావు, పాలగుమ్మి విశ్వనాథం, చిరంజీవి, గోపీచంద్, దాశరథి లాంటి ఉద్దండులు అపురూప కార్యక్రమాలు రూపొందించారు. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ 17 రేడియో స్టేషన్లు, 13 రిలే ట్రాన్స్‌మీటర్ స్టేషన్లు ఉన్నాయి.

### మరిన్ని విశేషాలు

- దక్షిణాదిన మద్రాసు నుంచి తెలుగు, తమిళ భాషల్లో రేడియో కార్యక్రమాలు 1938 జూన్ 16 నుంచే వెలువడ్డాయి. ఎయిర్ చెన్నై తెలుగు మొట్టమొదటి వ్యాఖ్యాత ఉమామహేశ్వరరావు.
- ఎయిర్ చెన్నైలో మొట్టమొదటి తెలుగు కార్యక్రమం అనార్కలి. దీని వ్యాఖ్యాతగా భానుమతి వ్యవహరించారు.
- 1947 నాటికి ఇండియాలో రెండు లక్షల 75 వేల రేడియో సెట్లు అందుబాటులోకి వచ్చాయి. అప్పట్లో వీటికి లైసెన్స్ తప్పనిసరిగా ఉండేవి.
- అత్యంత ప్రజాదరణ పొందిన వివిధభారతి కార్యక్రమాలు 1957లో ప్రారంభమయ్యాయి.
- ఆలిండియా రేడియో పేరు 1956లో ఆకాశవాణిగా మారింది.
- ఇండియాలో మొట్టమొదటి ప్రైవేట్ ఛానల్ 'రేడియో సిటి'.2001 జులై 3న ప్రారంభమైంది.
- చైనాలో ఉన్న రేడియో స్టేషన్ల కన్నా మన దేశంలో ఉన్న రేడియో స్టేషన్ల సంఖ్యే ఎక్కువ.

**- సంతోషలక్ష్మి దహగాం**

## మొబైల్‌లో రేడియో యాప్

మారుతున్న టెక్నాలజీకి అనుగుణంగా ఆకాశవాణి కార్యక్రమాల్లో కూడా మార్పులు వచ్చాయి. ఎఫ్ఎమ్, డీటీహెచ్‌లలో కూడా ఆకాశవాణి ప్రసారాలు వినొచ్చు. మొబైల్‌ఫోన్లలో త్వరగా రేడియో వినేందుకు వీలుగా ఆల్‌ఇండియా రేడియో లైవ్ అనే ఒక యాప్ కూడా ఉంది. దీన్ని గూగుల్ ప్లే స్టోర్ ద్వారా డౌన్లోడ్ చేసుకోవచ్చు. అంతేకాదు, వెబ్ స్ట్రీమింగ్ ద్వారా కంప్యూటర్లో మీ పని చేసుకుంటూనే ఆకాశవాణి ప్రసారాలు వినొచ్చు. డీటీహెచ్‌లో రాగం అనే ఛానల్ ద్వారా మంచి సంగీతం శ్రోతలకు అందిస్తున్నాం. ఇది అన్ని డీటీహెచ్ సర్వీసుల్లో ఫ్రీగా లభ్యమవుతుంది. సెట్ అప్ బాక్స్ ద్వారా ఆడియో మోడ్ పెట్టుకుని వింటే సరిపోతుంది. భవిష్యత్తులో మరింతగా ఆకాశవాణి ప్రసారాలు చాలామంది వింటారనడంలో సందేహమేమీ అక్కర్లేదు.



**- సి.యస్. రాంబాబు,**
**ఆల్ ఇండియా రేడియో, హైదరాబాద్**




**రేరాజు కనపడడం లేదని చుక్కలన్నీ ఏడుస్తూ నేల రాలాయి. తోటలో పారిజాత పుష్పాల్లా ఒక్కొక్కటే కూలిపోతున్నాయి. నీహారకన్య విడిచిన భాష్పకణాలు చెట్లమీదుగా జారిపోతున్నాయి. దినకర దర్శనం పూలబాలలకి ఇష్టం లేనట్టుంది.**

**ఆ పూలవనంలో ప్రియాంక ఎవరికోసమో ఎదురుచూస్తూ ఉంది. హాస్టల్లో పనమ్మాయి ఒక ఉత్తరం ఇచ్చింది నాలుగు రోజుల క్రితం. 'నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి, వెంకటేశ్వరస్వామి కోవెల తోటలో నన్ను కలు. పొద్దునే రా! ఇట్లు రత్నం... నీ శ్రేయోభిలాషి' అని ఉందా ఉత్తరంలో.**

ప్రియాంక పట్టించుకోలేదు.

పొద్దునే లేచేవీలు లేదు. చేసేపని అటువంటిది. రాత్రీ, పగలూ లేదు. వేళప్రకారం ఆహారం, నిద్రాలేని ఉద్యోగం. అల్పాహారం ఎప్పుడో మధ్యాహ్నం. మధ్యాహ్న భోజనం సాయంత్రమో, రాత్రో! నిద్రలేచేది ఉదయం పది తర్వాతే.

ప్రియాంక ఒక సాఫ్ట్‌వేర్ ఎగ్జిక్యూటివ్. రాత్రీ పగలూ తేడా లేకుండా చేసే పనితో విసిగిపోయింది. ప్రియాంకకి పెళ్ళి చెయ్యాలని తండ్రి రాంబాబురావు, తల్లి వసుంధర ఒకటే ఆరాట పడుతున్నారు.

'నాన్నా! మేం మీకులాగా సూర్యోదయాలు చూసే భాగ్యం లేదు. నాకు మరో సాఫ్ట్‌వేర్ సంబంధం వద్దు. రిటైరైన తర్వాత పెన్షన్ వచ్చే ఉద్యోగం వున్న గవర్నమెంట్ ఉద్యోగినే చూడండి. ఏ గుడ్లగూబ ఉద్యోగస్థుడూ వద్దు' అంది.

కొంచెం శ్రమతో ప్రియాంకకి రాకేష్ సంబంధం కుదిరింది. రాకేష్ ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వశాఖలో యుడిసిగా పనిచేస్తున్నాడు. ప్రమోషన్ లిస్టులో వున్నాడు. రాకేష్ ఫొటో చూసి, 'బాగానే వున్నాడు, మిగిలిన విషయాలు మీరే చూడండి నాన్నా!' అని రాంబాబుమీదే బాధ్యత పెట్టింది ప్రియాంక.

'అన్ని విషయాలూ కనుక్కున్నాను. అబ్బాయి తాతగారి సంరక్షణలో పెరిగాడు. తండ్రి కూడా ప్రభుత్వ ఉద్యోగి. నార్త్ ఇండియాలో ఉంటున్నాడు. అక్కడ తెలుగు చదువు లేదని విద్యా ప్రమాణాలు సరిగా లేవని, తాతగారింట్లో ఉంచారు. తాతగారు ప్రముఖ న్యాయవాది శేషాద్రి. వాళ్ళింట్లో రాకేష్ ఒక్కడే! ఇల్లూ, వాకిలీ, పొలమూ, పుట్రా ఉన్న ఆసాములు!

'మా ఉద్యోగాల్లో మేం ఎన్నాళ్ళు పని చేయగలమో తెలియదు! ఎప్పటికప్పుడు కొత్త టెక్నాలజీ వస్తోంది. కొత్త గ్రాడ్యుయేట్లు సిటీల్లో డ్రైనేజీల్లా పొంగుకొస్తున్నారు! నిరంతర పోటీ! ఈ ఉరుకుల పరుగుల జీవితం వద్దు. విసిగిపోయాను. ఈ విషయాలన్నీ వివరంగా చెప్పండి. పెళ్ళైన తర్వాత నేను ఉద్యోగం ఎప్పుడైనా మానేస్తానని చెప్పండి'.

"అబ్బాయి తాత శేషాద్రిగారితో ఆ విషయాలన్నీ నేను మాట్లాడాను. ఆయన 'సరే' అన్నాడు. పెళ్ళి మన ఇంట్లో, మన ఊర్లో జరగాలని అన్నాడు. సిటీలో ఉండే సౌకర్యాలు ఈ ఊళ్ళో ఉండవేమో అన్నాను. దానికి ఆయన, 'ఇప్పుడు పూర్వపు పల్లెటూర్లు కావు. అక్కడా అన్నీ దొరుకుతాయి' అన్నాడు" అంటూ విషయాలన్నీ కూతురు ప్రియాంకకు వివరంగా చెప్పాడు రాంబాబు. కానీ ఒక విషయం మాత్రం చెప్పలేదు. ప్రియాంక ఒక్కతే తన ఆస్తికి వారసురాలన్న విషయం రూఢి పరచుకున్న తర్వాతే, శేషాద్రిగారు తమ సంబంధం ఖాయం చేసుకున్నట్టు. ఇంకా కట్నాల విషయాల్లో కరాఖండీగా ఉన్నాడనిన్నీ.

ఈ శ్రేయోభిలాషి రత్నం ఎవరో? ముఖ్యమైన విషయం మాట్లాడాలి అన్నాడు. ముందు తను పట్టించుకోలేదు. రెండు రోజుల తర్వాత, మరో ఉత్తరం వచ్చింది. 'ప్రియాంకా! నీ పెళ్ళి విషయం మాట్లాడాలి. ఇప్పుడు నా మాట వినకపోతే, తర్వాత విచారిస్తావు' అని రాశాడు రత్నం.

పొద్దునలేచి, స్నానంచేసి, సుప్రభాత సమయానికి దర్శనం చేసుకుని, కోవెలకి ఆనుకుని ఉన్న తోటలోకి వచ్చింది.

తూర్పు కన్ను తెరుచుకుంటోంది. వెచ్చటి ప్రభాత కిరణాలు, తుషార బిందువుల గుండా ప్రవేశించి, నేలను తాకుతున్నాయి.

ఈ రత్నం పుణ్యమా అని ఈ ప్రభాతవేళ దైవదర్శనం, సూర్యదర్శనం జరిగింది. ఇక ఈ శ్రేయోభిలాషి దర్శనం కూడా అయిపోతే, ఈ ఉదయం పనులన్నీ పూర్తవుతాయి. ఉదయమే అల్పాహారం తిని ఎన్నాళ్ళో అయింది. ఎండిపోయిన బ్రెడ్‌ముక్కల మధ్య కుళ్ళడానికి సిద్ధంగా ఉన్న




టొమాటో ముక్కలూ, కొంచెంగా వాసనవచ్చే చీజ్‌లతో మొక్కుబడి తిండేగా ఎప్పుడూ! మల్లె పువ్వుల్లా తెల్లగా ఉన్న ఇడ్లీలు, నెయ్యీ, కార ప్పొడీ, ఘుమఘుమలాడే సాంబార్! ఆ తర్వాత ఉల్లిపాయలు, అల్లం దట్టించిన వేడివేడి పెస రట్టు తినాలి. ఫ్రెష్‌గా ఉన్న అల్పాహారం!

రత్నం కనబడలేదు. దూరంగా సిమెంట్ బెంచ్‌మీద ఒక వృద్ధ స్త్రీ కూర్చుని ఉంది. మెల్లగా నడుచుకుంటూ వచ్చింది.

'నువ్వు ప్రియాంక కదూ!' అడిగింది.

'అవును, మీరు?'

'నిన్ను రమ్మని పిలిచింది నేనే! నా పేరు రత్నం. శేషారత్నం. రా! ఆ పొగడచెట్టు కింద బెంచీమీద కూర్చుందాం! అక్కడ జనం లేరు. ఎక్కువ రారు'.

బెంచీమీద కూర్చున్న తర్వాత, శేషారత్నం అంది. 'అమ్మా! ప్రియాంకా! నువ్వు ఆ రాకేష్ సంబంధం వదులుకో! ఆ సంబంధం మంచిది కాదు'.

'మీరెవరు? నాకెందుకు చెబుతున్నారు? మీలాంటి వాళ్ళు చెపితే మానేయడానికి కాదు ఒప్పుకున్నది, అన్నీ ఆలోచించే ఆ సంబంధం కుదుర్చుకున్నాం, మధ్యలో మీ ప్రమేయం ఏంటి?'.

'ప్రమేయం ఉంది, అది ఇప్పుడే చెప్పలేను. నువ్వు ఈ సంబంధం చేసుకుంటే, పశ్చాత్తాప పడవల్సి వస్తుంది'.

'ఈ రోజుల్లో మగ పిల్లలకి పెళ్ళిళ్ళు కావ డంలేదు. ముప్ఫైలు దాటి నలభైలు వస్తూన్నా, బ్రహ్మచారుల్లా మిగిలిపోతున్నారు. అలాంటి ఓ బ్రహ్మచారికి అమ్మమ్మో, బామ్మో అయి వుంటుందీ రత్నం' అనుకుంది ప్రియాంక.

'బామ్మగారూ! మీరెవరో, ఏమిటో నాకు తెలి యదు. మీరు చెప్పింది వినాలని, వింటానని ఎలా అనుకుంటున్నారు?'

'అది కుదరదు. పెద్ద మనుషులతో వ్యవ హారం. లాయర్ శేషాద్రిగారి మనవడు రాకేష్! ప్రియాంక గబుక్కున లేచి వెళ్ళిపోయింది. శేషా రత్నం అక్కడే చాలాసేపు కూర్చుని వుండి పోయింది. ఈ పిల్లకి చెప్పి ఉండాల్సింది ఆ రాకేష్ తన మనవడేననీ, లాయర్ శేషాద్రి తన భర్తేననీ! ఈ ప్రియాంక ఇకరాదు, దాని ఖర్మ! తన ఖర్మలాగే దీనిది కూడా తగలడుతుంది! అనుకుంది రత్నం.

ఆమె మనసు కొన్ని సంవత్సరాలు వెనక్కి వెళ్ళిపోయింది.

●●●

రావిపాడులో, తన ఇంట్లో అక్క వెంకటర మణ పెళ్ళి జరుగుతోంది. ఇల్లంతా సందడిగా ఉంది. ఇంటిముందు, కొబ్బరిమట్టలతో పందిళ్ళు వేశారు. మధ్యలో రంగు కాగితాలతో అలంకరిం చిన బుట్టలు, ఇంటి పెరట్లో గాడి పొయ్యిలు, నీటికోసం పెద్ద గంగాళాలు...ఇలా ఎన్నో ఏర్పాటు చేశారు. ఓ మూలగా గుట్టలు పోసిన కూరగా యలు, బస్తాలకొద్దీ బియ్యం, కందిపప్పు, తాటాకు బుట్టల్లో బూరుగుపల్లి బెల్లం, ఇతర దినుసులు... తనకి ఎంతో వేడుకగా ఉంది, సరదాగా ఉంది. కానీ, అమ్మా,నాన్న మాత్రం దిగులుగా ఉన్నారు. దానికి కారణం, వచ్చినప్పటినుంచీ మగపెళ్ళి వారు నానాగోలా చేస్తున్నారు. చలికాలంలో మామిడికాయ పచ్చడి, మెత్తని కందిపొడి, అంద రికీ జున్ను ముక్కలు కావాలట. ఇంకా బంగాళ దుంప కూర, పంచదారతో స్వీట్లట. వాళ్ళ బొందంట! బంగాళాదుంపలు, పంచదార ఊళ్ళో దొరకవు. అవి కావాలంటే పట్నం వెళ్ళాలి. ఇక్క డంతా దేశవాళీ కూరలే. బెల్లం ఉంది, పంచదార లేదు, వాళ్ళన్నీ లేనివే కావాలని అడుగుతారు. ఉన్నది అక్కరలేదు. ప్రతివాడూవచ్చి నాన్ననీ, అమ్మనీ ఏదో ఒకటి అనిపోవడం.... అమ్మ కొంగు చాటు చేసుకుని ఏడవడం.. నాన్న దిగులుగా దూళ్ళ పాకలో కూచోవడం తనకి నచ్చేదికాదు. ఎన్నో పెళ్ళిళ్ళకి వెళ్ళింది. ఏదీ ఇలా లేదు. పెళ్ళంటే ఇదికాదు.

నాగవెల్లి రోజున మగపెళ్ళివారు పెద్దయాగీ చేశారు. ఆస్తి విషయంగా కాబోలు స్టాంప్ పేపర్ మీద ఏవేవో రాయించుకున్నారు. పెళ్ళయింది. అందరూ వెళ్ళిపోయారు. చుట్టుపక్కల వాళ్ళు నాన్నని పరామర్శించేవారు. తర్వాత తెలిసింది. అక్క పెళ్ళికి సగం పొలం అమ్మేశారు. 'ఇల్లు తాకట్టులో ఉంది. పొలం పోయి, ఇల్లూ పోయి ఎలా బతుకు తారు బాబుగారూ! పైగా ఇంకో అమ్మాయి ఉంది. ఇంకో ఏడాదో, రెండేళ్ళకో పెళ్ళీడుకొస్తుంది. ఆ తర్వాత పరిస్థితి ఏమిటి? మావల్ల అయ్యే సాయం చెప్పండి. సేత్తాం!' అని బాధపడ్డారు.

అక్క అప్పుడప్పుడు వస్తూ ఉండేది. నవ్వుతూ చలాకీగా వుండే అక్క ఎప్పుడూ దిగులుగా ఉండేది. అక్క వచ్చినప్పుడల్లా, నాన్న భయపడుతూ ఉండే వాడు. ఎంతోకొంత డబ్బిస్తేగానీ వెళ్ళేది కాదు. తను వినకూడదని రహస్యంగా ఏవో మాట్లాడు కునేవారు. చూచాయగా తెలిసింది. అక్క అత్త గారువాళ్ళు అక్కని ప్రశాంతంగా బతకనీయడం లేదు. అక్కడ అక్కకు కనీస మర్యాదలేదు. పైగా, బావకికూడా అక్కంటే ప్రేమలేదు.

కొన్నాళ్ళకి అక్కకి బాబు పుట్టాడు. వాణ్ణి చూసేందుకు అత్తారింటి తరపు వాళ్ళెవరూ రాలేదు. ఐదో నెలలో నాన్నే అక్కని వాళ్ళింట్లో దింపి వచ్చాడు.

'అక్కడ పరిస్థితి ఎలా ఉంది?' అమ్మ అడిగింది.

'మామూలే! నాతో అంతా ముభావంగా ఉన్నారు. కట్నం ఇచ్చాం. తూర్పుపొలం నాలుగు ఎకరాలు రాసిచ్చాం. మా అమ్మ వడ్డాణం, కాసుల పేరు, పాపిటపేరూ ఇచ్చాం. ఆ నగలు వేసుకుని వియ్యపురాలు కులాసాగానే ఉంది. అది మన అమ్మాయికోసం అని ఇస్తే, ఆవిడ అలంకరించుకుంది. అందమైన ఆభరణాల వెనుక ఆమె రాతి మనసేంటో బైట పడింది. వాళ్ళ ధనదాహం తీర లేదు. వాళ్ళబ్బాయి పెద్ద లాయరట. ఇంకో సంబంధం చేసుకుని ఉంటే, ఇంకా ఎక్కువ కట్నం వచ్చేదిట. పట్నంలో ప్రాక్టీస్ పెడతాడట. దానికో ఇల్లు చూశారట. నన్ను పిలిచి వియ్యంకుడు మరీ మరీ చెప్పాడు'

'ఏమైనా ఆశిస్తున్నారేమో! ఏదో ఒకటి చేసి, కొంత సొమ్ము ఇవ్వండి' అంది అమ్మ.

'ఇంకా ఏముంది? మిగిలిన పొలం అమ్మకం పెట్టడమే!'

'అయ్యో! అది ఇచ్చేస్తే మన బతుకు? చిన్న దాని సంగతి?'

'అప్పటిమాట అప్పుడు చూద్దాం! ముందు పెద్దదాన్ని అత్తారింట్లో సరిగా చూడడంలేదు. ఇలా కొంతైనా ఇస్తే దాని కాపురం గాడిన పడుతుందేమో!' అన్నాడు నాన్న.

కొంద్ర కొంత అమ్మి, డబ్బు స్వయంగా తీసుకు వెళ్ళి ఇచ్చాడు నాన్న. అయినా, అక్కబాధలు తగ్గలేదు. నాన్న ఆశ నెరవేరలేదు. మూలకారణం మా బావే! అందుకే నాకు బావంటే ఏహ్య భావం, ఆ కుటుంబంమీద జుగుప్స కలిగింది. తాజా గులాబీలా ఉండే అక్క, ఎండిపోయి బలుసు పొదలా, కంపలా అయిపోయింది. ఇక్కడ ఉన్నప్పుడు చీకూ చింతా లేకుండా ఉండేది. ఆ ఇంట్లో ప్రవేశించినప్పటి నుండీ, అక్క జీవితం అథోగతి పాలైంది. ఈ కాలం పిల్లలకి ఇదో కథలా ఉండొచ్చు. ఆ వ్యథ చూసినవాళ్ళకీ, అనుభవించిన వాళ్ళకీ మాత్రమే తెలుస్తుంది. ఇప్పుడు ఇలాంటి బాధలు లేవట. శేషాద్రి పాతకాలపు వాడే. ఈ ప్రియాంకని మరోవిధంగా పీడిస్తాడు. అందుకే ఆమెను హెచ్చరించాలి అనుకుంది.

**ఆమె ఒక సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. యావదాస్తికీ ఒక్కతే వారసురాలు. ఇప్పటికి ఆమెకు రెండు ఉత్తరాలు వచ్చాయి నీకో నిజం చెప్పాలి, వచ్చినన్ను కలుసుకో, రాకపోతే నష్టపోతావ్ అనేదే ఆ హెచ్చరిక! ఆమెకు వెళ్ళాలనే ఆసక్తి లేదు. అయినా బయల్దేరింది. ఎన్నాళ్ళకో చూసిన ఉషోదయాన్ని, మార్నింగ్ బ్రేక్‌ఫాస్ట్‌నీ ఎంజాయ్‌చేస్తూ చాలా నాన్‌సీరియస్‌గా, కోవెలతోటలోకి ప్రవేశించింది. ఇంతకీ ఆ తోటలో ఎవరున్నారు? అక్కడేం జరిగింది?**

అక్క కాపురంలో కొన్నాళ్ళకి...

ఒక పిడుగులాంటి వార్త తెలిసింది. ఇంటి వెలుపల వేడినీళ్ళ బాయిలర్ వెలిగిస్తూ ఉంటే, అక్క అంటుకుపోయింది. ఆ వార్త విని అమ్మా నాన్నా హడావిడిగా పరుగెత్తారు. మూడో రోజు ఏడుస్తూ వచ్చారు. 'బంగారంలాంటి పిల్లనిచ్చాం. అత్తగారికి బంగారం ఇచ్చాం. భూమి ఇచ్చాం. అయినా, అన్యాయంగా అది కాల్చుకుని చనిపోయింది' అని కుమిలి కుమిలి ఏడ్చారు.

అప్పుడు... తన జీవితంలో అదే ఒకపెద్ద మలుపు!

'పెద్దపిల్ల అర్థాంతరంగా పోయింది. చిన్నపిల్లని చేసుకుంటాం. కట్నం అక్కరలేదు. ఆ మిగిలినభూమి ఇస్తేచాలు' అని రాయబారం పంపారు శేషాద్రి తండ్రి తరపువాళ్ళు.

బావతో పెళ్ళి! అతని పేరన్నా, ఆ ఇల్లన్నా అసహ్యం తనకి. ఆ ఇంటిమీద, ఇంట్లోవాళ్ళమీద కసి! అది ఎలా తీరుతుందో తెలియదు. అలా ఉండగా ఈ విపత్తు! విధివిలాపం వేరుగా ఉంది. ఆ కాలంలో ఆడపిల్లపెళ్ళి చేయడం గగనం. ఆడపిల్ల పెళ్ళి అంటే హడలిపోయేవారు తల్లిదండ్రులు!

పెళ్ళిలో తన ప్రమేయం ఏమీలేదు. ఈ సంబంధం వద్దని చెప్పలేదు. తన అభిప్రాయం చెప్పి అమ్మనీ, నాన్ననీ కష్టపెట్టదలుచుకోలేదు! ఇష్టం లేకపోయినా ఈ ఇంటికి రాక తప్పలేదు. అక్క కొడుకును సాకకా తప్పలేదు.

ఈ ఇల్లన్నా, మనుషులన్నా తనకుండే వ్యతిరేకత అలానే ఉండిపోయింది. కాలంతోపాటు అది పెరుగుతూ వచ్చింది.

పెళ్ళయిన కొత్తల్లో, అక్క కొడుకు కదా అని దగ్గరకు తీసుకుంటే సహించేవాళ్ళు కాదు. అక్కడ తన జీవితం ఖైదీ కన్నా అధ్వానంగా ఉండేది! ఇక్కడికి వచ్చిన తర్వాత అమ్మా, నాన్నా, అతీ గతీ తెలియలేదు. ఎన్నడూ పుట్టింటికి వెళ్ళనివ్వలేదు. వాళ్ళు గతించిన విషయం కూడా నాకు చెప్పలేదు. మనసులో మాట చెప్పుకోవాలన్నా కూడా ఎవరూ లేరు. ఉదాసీనంగా ఏళ్ళు గడిచిపోయాయి. నివురుకప్పిన నిప్పులా ప్రతీకారేచ్ఛ తనలో అలాగే ఉండిపోయింది. అక్క కొడుక్కి చదువు బాగానే చెప్పించాడు శేషాద్రి, కట్నం దండిగా కావాలిగా మరి! అనుకున్న కట్నంతో వాడి పెళ్ళయింది. ఇంట్లో ఇంకో మనిషి వచ్చినా తన బతుకులో ఏ మార్పూలేదు. ఆ కొత్త కోడలు మాట్లాడేది కాదు, ఆవిడ అప్పటికే పట్టా పుచ్చుకున్న విద్యాధికురాలు. ఆ అమ్మాయి కూడా ఇక్కడ ఉండేది కాదు.

ఇప్పుడు ప్రియాంక ఈ ఇంట్లో ప్రవేశించబోతోంది. కనీసం 'ఇక్కడికి రావడం అంటే మరో నరకమే' అనే నిజం ఈ పిల్లకైనా చెప్పాలనుకుంది. ఇంత కష్టపడి చెప్పినా, వినకుండా వెళ్ళిపోయింది ప్రియాంక.

'తీగలు తెగి, కన్నీటి కెరటాలమీద వేదనా భరితమైన, జీర్ణ పుష్పాలమధ్య తేలియాడే వీణలా, అంతులేని సంద్రంలో ఉక్కిరిబిక్కిరి అవుతావు ప్రియాంకా! అని చెప్పదలుచుకుంది తను. కానీ ఆమె వినలేదు. మౌనంగా మనసులోనే బాధ

## అనుపమ మార్పునకు కారణం అదా?



అనుపమ 'అతి' డిమాండే ఆమె అవకాశాలకు గండి కొడుతోంది అంటున్నారు టాలీవుడ్ జనాలు. 'శతమానంభవతి' సూపర్ హిట్ తరువాత అనుపమకి రెండు పెద్ద సినిమాల్లో అవకాశాలు వచ్చాయి. దాంతో అనుపమ రేంజ్ ఎక్కడికో వెళ్ళిపోతుందని అందరూ ఊహించారు. అంతలోనే అనుకోని పరిణామం. ఆ సినిమాల్లోంచి అనుపమను తప్పించి మరో హీరోయిన్‌కి ఛాన్స్ ఇచ్చారట! కారణం అనుపమ తన రేంజ్‌కి మించి రెమ్యునరేషన్ డిమాండ్ చేయడమేనట! తెలుగులో సోలో హీరోయిన్‌గా సక్సెస్ సాధించింది అంటే అది 'శతమానంభవతి' మాత్రమే! ఒక్క సినిమా హిట్ కొట్టగానే అనుపమ రెమ్యునరేషన్ అమాంతం పెంచేసిందట! అంత ఇచ్చి అనుపమను పెట్టుకునే బదులు మరికాస్త ఎక్కువ ఇచ్చి స్టార్ హీరోయిన్‌ని తీసుకుంటే మంచిదన్న ఆలోచనతోనే అనుపమను ఆయా సినిమాల్లోంచి తప్పించారన్న పుకార్లు వినపడుతున్నాయి. ఇప్పుడిప్పుడే కెరీర్ ఊపందుకుంటున్నప్పుడు ఇలా అక్కర్లేని డిమాండ్లతో సినిమాలు వదులుకోవడం తెలివితక్కువతనం అంటున్నారు.

పడింది శేషారత్నం. ప్రియాంక, సరస్సులో విరబూసిన తెల్లకలువ. నిప్పుల కుంపటిలాంటి ఈ ఇంట్లో ఆమెకు ఏమి కానున్నదో!

కోవెలకి వెళ్ళడం శేషారత్నం దినచర్యలో ఓ భాగం. ఆ ఇంట్లో ఉంటూ, ఆ మనుషులని చూస్తూ ఉంటే, ఎప్పుడో చనిపోయిన అక్క గుర్తుకు వస్తుంది. వీళ్ళ గొంతెమ్మకోర్కెలు తీర్చలేక ఆవిరైపోయిన అమ్మానాన్న గుర్తుకు వస్తూ ఉంటారు. మనసులో నిప్పు గుర్తుకు వస్తూ ఉంటుంది! ఎవరూ లేనివాళ్ళకి, నోరూ వాయీ లేని వారికి దేముడే సాయం.

మూడో రోజు ప్రియాంక కనబడింది. 'మామ్మగారూ!' అని పలకరించింది. 'నేను గుర్తున్నానా!' అంది నవ్వుతూ.

'లేకేం అమ్మా! బాగానే గుర్తున్నావు. మొన్ననే కదా మనం కలిసింది. నాకేం పదిమంది లేరు... ఏకాకిని. ఎక్కువమంది ఉంటే, మరచిపోవచ్చు. నాకు అలాటి అదృష్టం లేదు తల్లీ!' కటువుగా అంది శేషారత్నం. తన మాట వినలేదని కోపంగా ఉంది.

'సారీ! మామ్మా! నీకు ఎవరూ లేరనుకోవద్దు. నిన్న మా నాన్న చెప్పాడు. ఆ రోజు నువ్వు కలిసినప్పుడు సెల్‌లో నీ ఫొటో తీసి మా నాన్నకి పంపాను. ఆయనకి నువ్వు తెలుసట.'

శేషారత్నం ముఖంలో మార్పు చోటుచేసుకుంది. చిరునవ్వు మెదిలింది. 'ఎవరమ్మా? మీ నాన్న! చెప్పు. నిన్ను చూసినప్పుడు, నాకు తెలిసిన పిల్లలా అనిపించావు. మీ నాన్నకి నేను తెలుసా?' సంభ్రమంగా అడిగింది.

'మీకు ఒక బాబాయి ఉండేవాడు. మిలిటరీలో పనిచేసేవాడట. గుర్తుందా? ఆయన కొడుకే మా నాన్న. మీకన్నా చాలా చిన్నవాడు. మీ అక్క పెళ్ళి ఆయనకు బాగా తెలుసుట. వాళ్ళ పెదనాన్నని ఎవరో తిడుతూవుంటే, కోపం వచ్చి మగపెళ్ళి వారింట్లో ఇసుకపోసి వచ్చాడట. వాళ్ళ సామానులమీద, బట్టలమీద మట్టిపోశాడట. వాళ్ళు ఆయన్ని కొట్టారట. నీకు ఇవేవీ తెలియవు. నీ ఫొటో చూసి గుర్తు పట్టాడు. 'మా అక్క' అన్నాడు. అక్కా! నువ్విక్కడున్నావా? అని బాధపడ్డాడు. మా నాన్న కళ్ళలో నీళ్ళు చూడటం నాకిదే తొలిసారి. ఈ అక్కను చూడాలని, మాట్లాడాలని ఆరాటపడుతున్నాడు'.

ప్రియాంకని గట్టిగా పట్టుకుని 'తల్లీ! అమ్మా! నువ్వు రాంబాబు కూతురువా? రాంబాబు మరీ చిన్నవాడు. మరిచిపోయానమ్మా! ఈ శేషాద్రి పెట్టిన బాధలు తట్టుకోవడానికి చాలా శక్తి కావాలి. అలసిపోయిన శరీరంతోపాటు మెదడు మొద్దుబారిపోయింది. రాంబాబు సంగతే మరిచిపోయాను. నన్ను క్షమించమని నాన్నకి చెప్పు'.

ప్రియాంక నుదుటిమీద ముద్దుపెట్టి మళ్ళీ అంది.

'చాలా సంతోషంగా ఉంది. కానీ నీకు ఆ రాకేష్‌గాడు వద్దు. వాడూ తాతలాంటివాడే! నిన్ను మనిషిలా చూడడు. వాళ్ళింట్లో స్త్రీలకి గౌరవం లేదు. నాన్నకి చెప్పు. అక్క రమణ వాళ్ళు పెట్టే బాధలు తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుని చనిపోయిందని'.

'బామ్మా! ఇదివరకటిలా కాదు. ఇప్పుడు ఆ రాకేష్‌గాడి ఆటలు గాని, ముసలినక్క లాయర్ శేషాద్రి ఆటలుగానీ సాగవు. నాకు కొన్ని వివరాలు తెలిశాయి. నా రూమ్‌కి రా! అక్కడ వివరంగా చెబుతా!'

'ఇప్పుడు కాదు. నేను ఇంటికి రాకపోతే పెద్ద గొడవ చేస్తారు మీ తాత'!

'సరే! ఇక్కడే కలుసుకుందాం! ఆ తాత గురించి కొంత తెలిసింది. ఏదైనా దుష్కర్మ చేస్తే దాని ఫలితం ఎలా వుంటుందో, ఆ శేషాద్రికి తెలిసేటట్టు చేస్తా! మా నాన్న కూడా అదే కోరుకుంటున్నాడు. 'తన పెదనాన్నని, పెద్దమ్మనీ బతికుండగా చంపేసిన ఆ కుటుంబం అంటే, ఆయనకీ కోపం. ముందు ఎవరో తెలియక సంబంధం కలుపుకోవాలని అనుకున్నారు. ఇప్పుడు వద్దు అనుకుంటున్నారు' అన్నాడు.

నాలుగు రోజుల తర్వాత.

పెళ్ళికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రాకేష్, శేషాద్రి కుటుంబసభ్యులంతా రావిపాడు ప్రయాణమయ్యారు. శేషారత్నం ఆశ్చర్యపడుతూనే టాక్సీ ఎక్కింది.

ప్రియాంక ఇలా చేసిందేమిటి? వద్దు వద్దు అంటూనే, పెళ్ళికి ఎలా ఒప్పుకుంది? ఆ మాత్రం దానికి, 'ఏదైనా దుష్కర్మ చేస్తే దాని ఫలితం ఎలా ఉంటుందో అది శేషాద్రికి తెలిసేటట్టు చేస్తా' అన్న ప్రగల్భాలెందుకు?

ఎనిమిదిగంటల ప్రయాణం తర్వాత, టాక్సీ గమ్యం చేరింది. అది తన ఊరే! ఇప్పుడు రాంబాబు ఎలా ఉన్నాడో? బాబాయిని ఎప్పుడూ చూడలేదు. చిన్నప్పుడు అనుకునేవారు. ఆయన సైన్యంలో పని చేసేవాడని. ఇప్పుడున్నాడా? అయినా తన భ్రమ. ఇంకా ఉంటాడా?

ఎన్నో ఏళ్ళ తర్వాతవచ్చినా తన సొంత ఊళ్ళో, పెద్ద మార్పులేం లేవు. అవే పాత పెంకుటిళ్ళు. అవే మట్టిరోడ్లు. ఇక్కడో, ఎక్కడో 'తన' ఇల్లు ఉంది.

శేషారత్నం కళ్ళు వెతుకుతున్నాయి. ఇక్కడే అమ్మా, నాన్న ఆయుష్షు తీరకముందే పోయారు. శేషాద్రి చలువ. ప్రియాంక పెళ్ళిలో మహా అట్టహాసంగా ఉన్నాడు. తీసుకురావాలి కాబట్టి, తనను తీసుకువచ్చారు. ఏదో మూల కూర్చుని, ఈ శుభకార్యం అయిన తర్వాత, మళ్ళీ తన పాత జీవితంలో ప్రవేశించాలి! ఈ శేషాద్రికి తగినశాస్తి జరగాలి. ఆమె మనసు కుతకుతా ఉడికిపోతోంది. అది తీరని కోరికని తేలిపోయింది. ఎందుకో ప్రియాంక మనసు మార్చుకుంది. కాష్టంలా కాలుతున్న తన మనసుకు శాంతి లభిస్తుందని అనుకుంది. అది వట్టిదే అని తేటతెల్లమైపోయింది.

రాంబాబు విడిదికి వచ్చాడు. ప్రియాంక పోలికలలోనే ఉన్నాడు. చిన్నప్పుడు ఎప్పుడో చూసింది.

## త్రిష అవుట్.. బిందుమాధవి ఇన్



*సినిమాల్లో కాదులెండి. నిజజీవితంలో త్రిష వద్దనుకున్న వరుడితో బిందుమాధవి ప్రేమలో పడిందట! గతంలో వరుణ్ అనే వ్యక్తితో నిశ్చితార్థం చేసుకొని ఆ తరువాత అతగాడికి గుడ్‌బై చెప్పేసింది త్రిష. ఇప్పుడు అతగాడితో బిందుమాధవి ప్రేమలో పడిందట! వరుణ్‌తో కలిసి బిందుమాధవి దిగిన ఫొటోలు ఇప్పుడు బాగా వైరల్ అవుతున్నాయి. దీని మీద బిందుమాధవి నోరు విప్పడం లేదు కానీ, వరుణ్ మాత్రం బిందు తనకు సరైన జోడి అంటూ సన్నిహితుల వద్ద చెప్పుకుంటున్నాడట! గత అనుభవాల దృష్ట్యా పెళ్ళి అయ్యేంత వరకూ అన్నీ గోప్యంగా ఉంచాలని ఇద్దరూ అనుకుంటున్నారట! అందుకే బిందు ఈ విషయంలో నోరు మెదపడం లేదని అంటున్నారు.*

'అక్కా' అని తన చేతులు పట్టుకుని, కొంతసేపు ఉండి వెళ్ళిపోయాడు.

ఈ రాత్రికే పెళ్ళి. శేషాద్రిగారు అయిదురోజుల పెళ్ళి చేయాలన్నాడట. 'అలాగే' అన్నాడు రాంబాబు. ఊరేగింపులో రాకేష్, ఒక కోరిక కోరాడట.

తెల్లగుఱ్ఱం మీద, బ్యాండ్ మేళాలతో ఊరే గింపు చేస్తూ తీసుకురావాలన్నారు. అందుకు 'సరే!' అన్నాడు రాంబాబు.

ఆ రోజు సాయంత్రం పెళ్ళి పందిరిలో కల కలం రేగింది.

నిర్లిప్తంగా అంతా గమనిస్తున్న శేషారత్నం ఉలికిపడింది.

రాకేష్ ఎక్కి ఊరేగుతున్న గుఱ్ఱం బెదిరిపోయి, ఎక్కడికో పరుగెత్తిపోయింది. ఊరుచివర ఎక్కడో అతన్ని కింద పడేసి పారిపోయిందిట.

ఒళ్ళంతా దెబ్బలతో రాకేష్ ఆసుపత్రిలో చేరా డట. శేషాద్రి ఒక్కసారిగా కూలబడిపోయాడు. గుండెలు బాదుకుని ఏడుస్తున్నాడు. ఆసుపత్రికి వెళ్ళారు వాడి అమ్మా, నాన్నా. తెల్లవారితే పెళ్ళి. పెళ్ళికొడుకు పీటలమీద కూర్చోగలడా?

శేషారత్నం మనసు కలతపడింది. తనకోపం శేషాద్రిమీద! ఎంత చీదరించుకున్నా, వాడు పసి వెధవ. వాడికి ఇలా జరగాల్సిందికాదు. అసలు మంచాన పడాల్సింది శేషాద్రి. ఈ లోపే మరో సంఘటన జరిగింది. పోలీస్‌స్టేషన్‌నుంచి పోలీ సులు వచ్చారు. శేషాద్రికి సంకెళ్ళువేసి తీసుకుపో యారు. ఏం జరుగుతోందో అర్థం కాలేదు శేషార త్నానికి. ప్రియాంకని పక్కకు పిలిచి అడిగింది 'ఏమిటిదంతా? ఏం జరుగుతోంది?' అని.

'బామ్మా! చూస్తూ ఉండు, శేషాద్రి నీకూ, మీ కుటుంబానికీ చేసిన అన్యాయానికి తగిన శిక్ష అనుభవిస్తాడు. నీకో రహస్యం చెప్పాలి. బ్రహ్మాండం బద్దలయ్యే రహస్యం తర్వాత చెబుతా' అంది.

పెళ్ళి ఆగిపోయింది. పెళ్ళివారంతా తిరిగి వెళ్ళిపోయారు. రాకేష్‌ని సిటీకి తీసుకుపోయి పెద్ద హస్పిటల్‌లో చేర్పించారు.




•••

దేవాలయం కోవెలతోట. పొగడ చెట్టుకింద సిమెంట్ బెంచీమీద కూర్చుని శేషారత్నం ప్రియాంక కోసం ఎదురుచూస్తోంది. ఎన్నో ప్రశ్నలు? ఈ పిల్ల ఏం చేస్తోంది? ఇక దీనికి పెళ్ళవుతుందా? అని ఆలోచిస్తుండగానే, 'బామ్మా!' అనే పిలుపు వినిపించింది. దూరంనుంచే నవ్వుతూ పిలిచింది ప్రియాంక. సంతోషంగా కనబడింది. శేషారత్నాన్ని వాటేసుకుంది. 'అన్నీ అనుకున్నట్టే జరిగాయి. ఆ రాకేష్‌కి నువ్వంటే అభిమానంగానీ, ప్రేమ గానీ లేవు. ఇక వాడి తల్లీదండ్రీ డమ్మీలు. వాళ్ళకి నువ్వు మనిషిలాగా కూడా కనిపించడం లేదు. అటువం టివాళ్ళ గురించి నువ్వూ బాధపడనక్కరలేదు.'

'రాకేష్‌కి ఎలా ఉంది?'

'బాగానే ఉంది. రేపు డిశ్చార్జ్ చేస్తారు! అయినా నీకెందుకు వాళ్ళంటే ఇంకా పీకులాట. నువ్వు చచ్చినా, బతికినా వాళ్ళకి అక్కరలేదు' ప్రియాంక కోపంగా అంది.

'అసలు ఏం జరిగింది? ఆ గుఱ్ఱాలేమిటి? మన పెళ్ళిళ్ళలో గుఱ్ఱాలు ఉండవు కదా!'

'రాకేష్‌కి తెలుగువాళ్ళంటే పడదు. వాడు తననొక నార్త్ ఇండియన్ అనుకుంటాడు. మనం అంటే చిన్నచూపు. తెలుగంటే ఇంకా చిన్నచూపు. పెళ్ళి ఊరేగింపుకోసం గుఱ్ఱం స్వారీ కావాలని మొండిపట్టు పట్టాడు. అది ఉత్తరభారతదేశ సంప్ర దాయం. దీనిని అవకాశంగా తీసుకుని, వాడికి బుద్ధి చెప్పాలనుకున్నాను. మా వూరిలో జట్కా కుర్రాడికి వివరాలన్నీచెప్పి ఆ ఏర్పాట్లు చేశాను. మా ప్లాన్ ప్రకారమే, అది వాణ్ణి ఎత్తి కుది పేసింది. ఇక శేషాద్రి... తన పాతబుద్ధి బైటపెట్టు కున్నాడు. డబ్బు గురించి కొంచెం గట్టిగా మాట్లా డాడు. ఇంకా అదనపు మొత్తం కావాలట. 'మా అమ్మాయి ఉద్యోగం చేస్తోందికదా! నెల జీతం మీకే ఇస్తుంది' అని మా నాన్న చెప్పినా విన లేదు. ఇంకా ఈ కట్నం యావ ఏమిటి? ఆయన మాటలు రికార్డ్‌చేసి పోలీసులకి అందించా! ఇరుక్కు పోయాడు'

శేషారత్నం అయోమయంగా చూసి అడి గింది. 'మరి ఆయన ఇంటికి వచ్చేశాడు కదా!'

'బెయిలుమీద వచ్చాడు. నీకో రహస్యం చెప్పాలి. బ్రహ్మాండం బద్దలయ్యే రహస్యం! తర్వాత చెబుతా అన్నాను కదా! మీ అక్క ఆత్మహత్య చేసుకోలేదు. శేషాద్రి స్వయంగా నిప్పు అంటించి సజీవద హనం చేశాడు. అప్పట్లో అతనిమీద కేసు నమో దైంది. తనకున్న పలుకుబడితో, సాక్ష్యాల్ని మాయం చేసి, కేస్ మూయించేశాడు. ఆ కేసు అటకెక్కడా నికి, మీ అమ్మా, నాన్న కూడా ఓ కారణం! అవన్నీ ఇప్పుడు తవ్వి బైటకు తీస్తున్నాను. మా నాన్న చిన్ననాటి స్నేహితుడి తండ్రి అప్పట్లో పోలీస్ కానిస్టేబుల్. అన్ని సాక్ష్యాలూ, ఎఫ్ఐఆర్ కాపీలూ, జనం ఇచ్చిన స్టేట్‌మెంట్లూ, భద్రంగా ఆయన దగ్గర ఉన్నాయి. అవన్నీ తిరగదోడమని మేజిస్ట్రేట్‌గారికి పిటిషన్ దాఖలు చేశా! శేషాద్రి మీద 'కల్పబుల్ హోమిసైడ్' కేసు నమోదైంది. ఇంకా సాక్ష్యాలు తారుమారు చేసినందుకూ, సాక్షులను ప్రభావితం చేసినందుకూ అదనపు సెక్షన్లు. అప్పట్లో శేషాద్రికి సాయంచేసిన పాత పోలీసు సిబ్బందిమీద విచారణ జరుగుతోంది. రిటైరైనా ప్రభుత్వం అతన్ని వదిలిపెట్టదు. మంచి లాయర్‌కి ఈ కేసు అప్పగించాను. ఇక శేషాద్రి కటకటాలపాలే! అతన్ని ఎవరూ రక్షించలేరు! చేసుకున్నవారికి చేసుకున్నంత మహదేవా'

'మా అక్కది ఆత్మహత్యనే అనుకుంటూ వచ్చాను, శేషాద్రి చంపేశాడా? అంతటి ఘాతుకానికి ఒడి కట్టినప్పుడు, మా వాళ్ళు ఎందుకు మిన్నకుండి పోయారు?' ఆశ్చర్యంగా అడిగింది శేషారత్నం.

'దానికి సమాధానం దొరికింది. ఆ రోజుల్లో ఇక్కడ పనిచేసే ఎస్.ఐని కలుసుకున్నాను. ఆయన చెప్పింది విన్నతర్వాత నేను అవాక్కయ్యాను. ఆ కాలంలో ఆడపిల్లపెళ్ళి ఒక అసాధ్యమైన కార్యం. తన మీద కేసురాకుండా, శేషాద్రి ఆడిన నాట కంలో భాగమే అతనితో నీ పెళ్ళి. మీ అమ్మా నాన్నా నోరు మూసుకోడానికి జరిగిన ఒప్పందంలో భాగమే శేషాద్రితో నీ పెళ్ళి! ఈ అసాధారణ లంచం బాగా పనిచేసింది. మీ అమ్మా, నాన్నల నిస్సహాయస్థితిని తనకి అనుకూలంగా మలుచు కున్నాడు శేషాద్రి. నీ సంగతీ అంతే! నువ్వూ విషయం తెలియక తలవంచావు.'

'సరేగానీ ప్రియాంకా! నా గురించి నీ జీవితాన్ని త్యాగం చేశావు. నీకు ఇక పెళ్ళి అవుతుందా?' శేషారత్నం బాధపడుతూ అడిగింది.

'ఇప్పుడు కాలం మారిపోయింది, నా పెళ్ళి హాయిగా జరుగుతుంది. వాడుమాత్రం రాకేష్ లాంటివాడై ఉండడు. నాకు పెళ్ళి కాదన్న భయం నీకు అక్కరలేదు' ప్రియాంక ఆత్మవిశ్వాసంతో అంది.

జరిగిన విషయాలన్నీ శేషారత్నానికి ఆకళిం పుకు వస్తున్నాయి. ఇది అసాధారణమైన యదా ర్థగాథ. అక్క వెంకటరమణిని ఈ శేషాద్రి చంపే శాడు. ఆ విషయం బైటకు రాకుండా, అమ్మా నాన్న లతో వాడు బేరం కుదుర్చుకున్నాడన్నమాట. అప్పుడు జరిగిన అన్యాయానికి ఇప్పుడు న్యాయం జరిగింది.

శేషారత్నం గుండెబరువు తగ్గింది. అక్కా, అమ్మా, నాన్నల ఆత్మలు ఇప్పుడు శాంతించి ఉంటాయి.

'ప్రియాంకా! ఇన్నాళ్ళు ఎందుకు బతికానో ఇప్పుడు తెలుస్తోంది నాకు. ఆత్మీయుడైన ఒక తమ్ముడూ, ఒక మనవరాలూ నాకు దొరికారు. ఇక నాకు ఏ అవసరాలూ లేవు. ఎప్పుడో ఇలాంటి తోటలోనో, రోడ్డుమీదో నా ప్రాణం అనాథలా పోతుంది. నా గురించి ఎవరూ రారు' అనుకున్నాను. నాకు ఇప్పుడు అయినవాళ్ళున్నారు... మీరిద్దరూ.'

*సెల్: 94901 90908*

## హెపటైటిస్ వైరస్ హోమియోతో మాయం

**నా పేరు** ప్రభాకర్. నా వయస్సు 35 సంవత్సరాలు. ఆరు నెలల క్రితం నేను చావు అంచుల వరకు వెళ్లొచ్చాను. ఏం జరిగిందంటే.... నీరసంగా ఉండేది. ఆకలిగా అనిపించినా తినాలని అనిపించకపోయేది. తింటే వాంతులు అయ్యేవి. కొన్ని రోజులకు కడుపు నొప్పి కూడా మొదలయింది. ఊర్లో తెలిసిన డాక్టర్‌కు చూపిస్తే ఏవో మందులు రాసిచ్చాడు. వారం రోజులు వాడినా కొద్దిగా కూడా ఫలితం లభించలేదు. ఈలోగా కళ్లు పసుపు రంగులోకి మారుతున్నాయన్న విషయాన్ని స్నేహితులు, కుటుంబసభ్యులు గమనించి చెప్పారు. దాంతో టౌన్‌కి వెళ్లి డాక్టర్‌కు చూపించాను. అక్కడ పరీక్షలన్నీ చేసి హెపటైటిస్ వైరస్ సోకిందని, కామెర్లు వచ్చాయని చెప్పారు. హెపటైటిస్ వైరస్ ప్రాణాంతకం అని, కాలేయం పాడయిపోతుందని చెప్పేసరికి నాలో ఆందోళన మరింత రెట్టింపు అయింది. ఆ సమయంలోనే తెలిసిన మిత్రుడు ఒకడు హోమియో చికిత్స గురించి చెప్పాడు. దాంతో ఆగమేఘాల పరిగెత్తుకుంటూ డాక్టర్ రవికిరణ్ గారి దగ్గరకు వెళ్లాను.

**చికిత్స తరువాత :** హోమియో మందులతో త్వరగా కోలుకుంటావని, ఏమాత్రం భయపడాల్సిన అవసరం లేదని డాక్టర్ గారు ధైర్యం చెప్పారు. హోమియో చికిత్స మొదలు పెట్టాక వారం రోజుల్లోనే మంచి ఫలితం కనిపించింది. వికారం తగ్గింది. ఆకలి పెరిగింది. మామూలుగా ఆహారం తీసుకోవడం మొదలు పెట్టాను.. నెల రోజుల తరువాత చాలా మార్పు కనిపించింది. వైరల్ లోడ్ తెలుసుకునేందుకు పరీక్ష చేయిస్తే అతి తక్కువ స్థాయిలో ఉన్నట్లుగా తేలింది. జీవితం ముగిసిపోతుందన్న దశలో హోమియో చికిత్స ప్రాణాలు నిలిపింది.

## హెచ్ఐవి, హెర్పిస్‌ల బాధ పోయింది

**మా ఊరు** రాజమండ్రి. నా పేరు రాజేష్. ఏడాది క్రితం ఆత్మహత్యకు ప్రయత్నించాను. అదృష్టం కొద్దీ బతికి బయటపడ్డాను. నా కథ ఏంటంటే ఒకరోజు స్నేహితుల బలవంతంపైన ఒక అమ్మాయితో శృంగారంలో పాల్గొన్నాను. ఆ తరువాత కొద్ది నెలలకు పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు వచ్చాయి. విపరీతంగా దురద పెట్టేది. ఆ నీటి పొక్కులు పగిలి పుండు మాదిరిగా అయ్యేవి. డాక్టర్‌ను కలిస్తే కొన్ని పరీక్షలు చేసారు. ఆ పరీక్షలో నాకు హెచ్ఐవి ఉందని నిర్ధారణ అయింది. ఆ నీటిపొక్కులకు కారణం హెర్పిస్ అని తేలింది. ఆ రోజు ఎంత ఏడ్చానో చెప్పలేను. ఇక నా జీవితం ముగిసిపోయిందని నిర్ధారణకు వచ్చేశాను. ఆ సమయంలోనే డాక్టర్‌గారి ఆర్టికల్స్‌ను ఆంధ్రజ్యోతిలో చదివాను. ఆలస్యం చేయకుండా డాక్టర్‌గారిని కలిసాను. నా పరిస్థితి మొత్తం వివరిస్తే భయపడాల్సిన అవసరం లేదని, వ్యాధి గురించిన వివరాలన్నీ చెప్పారు. దాంతో నాకు కొండంత ధైర్యం వచ్చింది. ఆరు నెలల పాటు మందులు వాడితే హెర్పిస్ జాడలేకుండా పోతుందన్నారు. హెచ్ఐవి వైరస్ ఏమీ చేయలేని స్థితిలోనే ఉండిపోతుందన్నారు. డాక్టర్‌గారుచెప్పినట్లుగా మందులు వాడాను. మూడు నెలలో హెర్పిస్ పూర్తిగా పోయింది. నాకు పునర్జన్మను ప్రసాదించిన డాక్టర్‌గారికి జీవితాంతం రుణపడి ఉంటాను.

### హోమియో చికిత్స

హెచ్ఐవి, హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగించే విధంగా ఉంటుంది. రోగనిరోధక శక్తి బలపడటం ద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి.

**Dr. K Ravikirane**
**M.D.,M.sc(psych), P.G(virology)LONDON**
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## హోమియో చికిత్సతో జీవితంలో వెలుగులు

**నా పేరు రవి**. నా పెళ్లయి నాలుగేళ్లవుతోంది. కానీ సంతానం కలగ లేదు. మంచి మంచి ఆసుపత్రులన్నీ తిరిగాం. కానీ ఫలితం లేదు. పరీక్షలన్నీ చేసి వీర్యకణాల సంఖ్య తక్కువగా ఉందని అన్నారు. మందులు వాడితే సరిపోతుందన్నారు. ఏడాది పాటు మందులు వాడాను. కానీ పిల్లలు మాత్రం కలగలేదు. వీర్యకణాల సంఖ్య పెరగలేదు. ఆ సమయంలోనే హోమియో చికిత్స గురించి తెలిసింది. వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాను. ముందుగా సెమన్ అనాలసిస్ పరీక్ష చేయించమని చెప్పారు. రిపోర్టు వచ్చాక దానిపై అవగాహన కల్పించారు. వీర్య (సెమన్ అనాలసిస్) పరీక్ష ద్వారా వీర్యంలో ఉన్న లోపాలను గుర్తించవచ్చని అన్నారు. 'వీర్యంలో ప్రతి ఎంఎల్‌లో 60 నుంచి 120 మిలియన్ల వీర్యకణాలుండాలి. అందులో 80 శాతం కణాలు బాగుండాలి. వాటి కదలికలు బాగుండాలి. కానీ నా వీర్యంలో కణాలు తక్కువ సంఖ్యలోని ఉన్నాయి. ఉన్న కొన్ని కణాలు బాగాలేవు. అందువల్లే సంతానం కలగడం లేదు' అని డాక్టర్ చెప్పారు. హోమియో మందులతో సమస్య పోతుందని భరోసా ఇచ్చారు.

### చికిత్స తరువాత

హోమియో మందులు వాడటంతో వీర్యపుష్టి కలుగుతుందని చెబితే నమ్మలేదు. కానీ నా విషయంలో మందులు వాడిన తరువాతే అర్థమయింది. హోమియో మందులు ఎంత అద్భుతంగా పనిచేస్తాయో. హోమియో చికిత్స తరువాత వీర్యకణాల కదలికలు పెరిగాయి. డాక్టర్ గారు నా శారీరక ధర్మాలను, మానసిక లక్షణాలను పరిగణలోకి తీసుకుని మందులు ఇచ్చారు. దీనివల్ల మంచి ఫలితం లభించింది. హోమియో చికిత్స నా జీవితంలో వెలుగులు నింపింది. ఇప్పుడు నాకు ఒక బాబు. వాడు పుట్టాక నా జీవితం మొత్తం మారిపోయింది. డాక్టర్ గారికి ఎప్పటికీ రుణపడి ఉంటాను.

## నరాల జబ్బులు శాశ్వతంగా పోవాలంటే..

**చేతులు,** కాళ్లు, పాదాలు, ముఖం, నోరు...ఇలా శరీరంలోని అన్ని భాగాల నుంచి నరాలు వెన్నుపాముతోనూ, మెదడుతోనూ అనుసంధానించబడి ఉంటాయి. ఈ నరాల వ్యవస్థ ద్వారానే భౌతిక అనుభూతుల తాలూకు సంకేతాలను మెదడుకు అందుతాయి. అంటే కాలికి దెబ్బతగిలితే నొప్పి తెలియడం వెనక కారణం మెదడుకుసంకేతాలు చేరడమే. అయితే కొందరిలో కొన్ని కారణాల వల్ల ఈ నరాల వ్యవస్థ దెబ్బతింటుంది.

**కారణాలు :** కుటుంబంలో ఎవరెనా ఈ సమస్యతో బాధపడుతున్నట్లయితే వారి పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. డయాబెటిస్‌తో బాధపడే వారిలో ఎక్కువగా కనిపించే సమస్య ఇది. గాయాలు కావడం, దీర్ఘకాలంగా అనారోగ్యం ఉండటం, ఇన్‌ఫెక్షన్లు వంటివి కూడా కారణమవుతాయి. ఆల్కహాల్ అధికంగా సేవించడం, విషపూరితమైన కెమికల్స్‌కు ఎక్స్‌పోజ్ కావడం, కొన్ని రకాల వైరస్‌లు, బ్యాక్టీరియాలు నేరుగా నరాల టిష్యూపై దాడి చేయడం వల్ల కూడా ఈ సమస్య తలెత్తవచ్చు. హెచ్ఐవితో బాధపడే వారిలోనూ పెరిఫెరల్ న్యూరోపతి డెవలప్ అయ్యే అవకాశం ఉంటుంది.

### లక్షణాలు

చేతులు. పాదాల్లో పొడిచినట్లు అనిపించడం, తిమ్మిర్లు రావడం, చేతుల్లో నుంచి వస్తువులు జారిపడటం, పురుషుల్లో అంగస్తంభనలు తగ్గిపోవడం, మలబద్ధకం, జీర్ణసమస్యలు రావడం, డయేరియా, చెమటలు అధికంగా పట్టడం వంటి లక్షణాలుంటాయి.

### హోమియో చికిత్స

నరాల సంబంధ సమస్యలకు హోమియో మందులు అద్భుతంగా పని చేస్తాయి. తిమ్మిర్లు, చెమటలు అధికంగా పట్టడం వంటివి తగ్గిపోతాయి. అంగస్తంభన సమస్యలు దూరమవుతాయి. మొత్తంగా కాంప్లికేషన్స్ అన్నీ దూరమయి ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

# వెట్టి (ది వారియర్)

-మధుబాబు




**నేల వేము ఆకులు రెండింటిని నోటిలో వేసుకున్నట్టు పరమ చేదుగా తయారైనట్లుంది డ్రైవర్ మొఖం - వెగటుగా నొసలు విరిచి చూశాడు.**

**'ఆ సబ్బిరెడ్డితో పెట్టుకుంటే మనం ఎందుకూ పనికిరాకుండా పోతాం. పట్టుబడిన వాళ్ళని విచారించి అక్కడితో సరిపెట్టుకోవటం చేతకాదు వాడికి. మూలాల్ని వెతుకుతాడు. తట్టుకోవటం చాలా కష్టం..' నుదురు రుద్దుకుంటూ చెప్పాడు బాజిరెడ్డి.**

'వాడు శివారెడ్డి సారుకు బంధువు అవుతాడు కదూ?' అడిగాడు డ్రైవర్.

'అవుతాడురా. ఆ పిచ్చిదానికి మేనల్లుడి వరసో... ఇంకేదో..' అన్నాడు బాజిరెడ్డి.

'అయితే ఇంకా భయం దేనికి సారూ? శివారెడ్డి దగ్గరికిపోయి ఇంకో నొక్కు నొక్కండి. తనే చూసుకుంటాడు' చాలా తేలికగా చెప్పేశాడు డ్రైవర్. చిరాకుగా కనిపిస్తున్న బాజిరెడ్డి ముఖం తేటపడింది, అతి స్వల్పంగా. 'నిజమేరా.. ఈ ఆలోచన నాకు ఇంతవరకూ రాలేదు. శివారెడ్డి మొగ్గుతాడంటావా?' సాలోచనగా చూస్తూ అడిగాడు.

'మీరు నొక్కితే మొగ్గక ఏం చేయగలడు? ఇది మామూలు సమస్య కాదు. మన పఠాన్‌బాబు సమస్య..' మరింత నమ్మకంగా చెప్పాడు డ్రైవర్.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాలవల్ల వెట్టిగా మారతాడు. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి రమ్మంటాడు. ఆలయంలో పఠాన్‌తో పాటు బసవప్పను చూస్తాడు వెట్టి. సమయం చూసుకుని అందరినీ చావమోదుతాడు. ఆలయంలో పిచ్చిపూజారి ద్వారా కొన్ని విషయాలు తెలుసుకుంటాడు. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి తాంబూలాలు పుచ్చుకుంటారు. గుడిదగ్గర తారసపడిన వ్యక్తిని రాయుడిపల్లిలో దించటానికి వెళతాడు వెట్టి. ఆ ఇంటి ఇల్లాలి తమ్ముడి ద్వారా ఒకప్పుడు బాజిరెడ్డికి సన్నిహితుడైన వ్యక్తిని కలుసుకుంటాడు. అతని ద్వారా చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకుంటాడు. విషయం తెలుసుకున్న బసవప్ప మనుషులు వెట్టి కోసం బయలుదేరుతారు. చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకున్న వెట్టి అడవిదారిగుండా నిష్క్రమిస్తాడు. **ఆ తర్వాత...**

'ఆ పిచ్చిదాన్ని పిలిపించటానికే చాలా సీరియస్‌గా చెప్పాల్సి వచ్చింది. మళ్ళీ ఇప్పుడు ఈ వ్యవహారం గురించి మాట్లాడితే పరిస్థితి ఎలా ఉంటుందో తెలియదు. మొగ్గుతున్నాడు కదా అని అదేపనిగా నొక్కితే మంత్రం పనిచేయకపోవచ్చు. శివారెడ్డి మొండికేస్తే మొదటికే మోసం వచ్చేస్తుంది. అందులోను ఇప్పుడు ఈ పిచ్చిదాని మెంటల్ తగ్గిపోతుందనే మాట కూడా బయటికి వచ్చింది' అంటూ ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా తల ఊపాడు బాజిరెడ్డి. ఇంకోరోజు ఆగుదాం. ఈ లోపల ఈ గ్రానైట్ మైన్సోళ్ళు ఆ వెట్టిగాడి కాళ్ళు కీళ్ళు విరిచేసి వెంటబెట్టుకుపోతారు. ఆడు సీనులో నుంచి అవతలికి పోతే మూడొంతులు తలనొప్పి తగ్గిపోతుంది' అన్నాడు.

'మీరు అన్నీ తెలిసినోళ్ళు. మీరు అవునంటే మేము కాదనేది ఏమీ లేదు. ఇప్పుడు మమ్మల్ని ఏం చేయమంటారు?' అంటూ పక్కకి చూశాడు డ్రైవర్.

దారి మధ్యలో కనిపించిన ఏదో వెహికల్‌ని పట్టుకుని, సిటీలోకి వచ్చిన బాజిరెడ్డి గుంపు కాళ్ళు ఈడ్చుకుంటూ హాస్పిటల్ దగ్గరికి వస్తూ ఉండటం కనిపించింది.

'పిచ్చిపూజారి పందెం పుంజు మాదిరి అదే పనిగా వెక్కిరిస్తున్నాడు. ఏం మాట్లాడితే మరేం ముంచుకు వస్తుందో తెలియక, పారిపోయి వచ్చాం' దగ్గరికి వస్తూనే చేతులు కట్టుకుని బాజిరెడ్డికి విన్నవించుకున్నారు.

'ఫరవాలేదురా. మనం చేయాల్సిన పని పూర్తిగా ముగించటానికి వేరేవాళ్ళు వెళ్ళారు. తెల్లారి ఏడెనిమిది గంటల సమయంలో అంతా అయిపోతుంది' అంటూ ఒక క్షణం ఆగి, 'మీరు ఒక పనిచేయండి... ఇళ్ళకు పోవద్దు. పొలిమేరల్లో కాపలా కాయండి. ఒకవేళ ఆ చప్పిమొఖంవాడు ఇంకోసారి తప్పించుకుని పారిపోయి వస్తే, మధ్యలోనే పట్టుకుని మెడమీది నించి తలకాయని తప్పించేయవచ్చు' అన్నాడు డ్రైవర్, బాజిరెడ్డి కన్ఫర్మేషన్ కోసం ఎదురు చూడకుండానే.

'ఆడు ఎట్టా ఉంటాడో మాకెవరికీ తెలియదు గదా.. ఆడిని మేము ఎవరిమీ చూడలేదు కదా' అన్నాడు ఆ అనుచరుడు.

'పోరా... నువ్వు కూడా పోయి కాపలాలో కూర్చో. తెల్లవారేవరకూ మనకి వేరే పనులు ఏమీలేవు. వెళ్ళు' ఉన్నట్లుండి కల్పించుకుని చెప్పాడు బాజిరెడ్డి.

ఎదురు చెప్పలేదు డ్రైవర్. తల ఊపి, ఆ జనమందరితో కలిసి చౌడేశ్వరి గుడి దగ్గర్నుంచి సిటీలోకి వచ్చే రోడ్డు దగ్గరికి బయలుదేరాడు.

దూరంగా నిలబడి ఉన్న తన బాడీగార్డుల్ని



రమ్మని సైగ చేసి, తన కార్లో కూర్చున్నాడు బాజిరెడ్డి.

●●●

'పొద్దుపొద్దున్నే సూరీడు పైకి వచ్చే సమయంలో సంబరంగా రేకలు విప్పుకునే ఎర్రతామర పువ్వు మాదిరి ఉండేది పూజారయ్య కూతురు. కిలకిలా నవ్వుతూ లేడిపిల్ల మాదిరి చురుకుగా తిరుగుతూ ఉంటే, నోళ్ళు తెరచుకుని చూస్తూ ఉండిపోయే వాళ్ళు, పూజలు చేయించటానికి వచ్చిన వాళ్ళు' అరమూసిన కళ్ళతో చెప్పాడు బండోడి నాయన.

విసుగ్గా తల విదిలించబోయి విల్‌పవర్‌నంతా కూడగట్టుకుని, తనను తాను నిగ్రహించుకున్నాడు వెట్టి. సమయం త్వరత్వరగా గడిచిపోతోంది. ఆర్చుకుని తీర్చుకుని ఆ పెద్దాయన కంప్లీట్‌గా చెప్పటానికి ఇంకో రెండు మూడు గంటలు పట్టేటట్టుంది. పెద్ద పులులు మీదకి వచ్చినట్టు వచ్చి పడిపోతారు బాజిరెడ్డి జనం. మధ్యలోనే లేచి పొదల్లోకి పారిపోవాల్సిన పరిస్థితి దాపురించే సూచనలు చాలా బలంగా కనిపిస్తున్నాయి.

వెట్టి మనసులో ఎటువంటి ఆలోచనలు మెదులుతున్నాయో బండోడి తండ్రికి తెలిసే అవకాశం లేదు. ఈ లోకంలో ఉన్నట్టుగా కనిపించటం లేదు వాలకం.

'స్వతహాగా చాలా మంచివాడు శివారెడ్డి తండ్రి. అవసరంలో ఉన్నవారికి లేదనకుండా సాయం చేసేవాడు. రెక్కలు దెబ్బతిని రోడ్డుపక్కన పడిపోయిన పిట్ట కనిపించినా, తన కారు ఆపి దానికి సేవలు చేయించేంత జాలిగుండె! అటువంటి మంచి మనిషి ఎందుకు కక్కుర్తిపడ్డాడో, ఇప్పటికీ నాకు అర్థం కాని విషయమే అయింది' అన్నాడు శూన్యంలోకి చూస్తూ.

'చెప్పండి స్వామీ, తర్వాత జరిగింది చెప్పండి..' అసహనాన్ని అతిబలవంతంగా అదుముకుంటూ కొంచెంగా ఒత్తిడి చేశాడు వెట్టి.

'నువ్వు ఏదో తలుచుకుని అదేపనిగా భయపడుతున్నట్టుగా ఉంది. బాజిరెడ్డి జనం నీ కోసం వచ్చేస్తూ ఉంటారనేగా?' ఉన్నట్టుండి కనుల్ని పూర్తిగా తెరిచి చిరునవ్వుతో అడిగాడు ఆ వృద్ధుడు.

'భయమనే మాట చాలా చిన్నది స్వామీ! తడిసిపోతున్నట్టుగా ఉంది ఒళ్ళు. గొంతు ఎండుకుపోతోంది' నిజాయితీగా చెప్పాడు వెట్టి.

'ఇందాకటి నుంచీ చూస్తున్నాను... నువ్వు నీ పరిస్థితిని చాలా తక్కువగా చేసి చూసుకుంటున్నావు. ఇప్పటివరకూ నువ్వు చెప్పిన మాటల్ని వింటుంటే నాకు నవ్వు వస్తోంది' అన్నాడు వృద్ధుడు.

తెల్లబోయి చూశాడు వెట్టి.

'పిచ్చోడా... ఆ తల్లి నిన్ను స్వయంగా ఎంచుకుంది. అడుగు అడుగునా నీకు కనిపించి, నిన్ను సరైన దారిలో నడిపిస్తోంది. ఇందాక నువ్వు ఒక మాట అన్నావు.. ఏమిటదీ?' అడిగాడు వృద్ధుడు.

అక్కడికి వచ్చిన దగ్గర్నుంచీ తను మాట్లాడిన మాటలన్నిటినీ వరుసపెట్టి గుర్తు చేసుకుని సమాధానం ఇవ్వవలసిన ప్రశ్న అది. అందుకు అవసరమైన వ్యవధి -

వెట్టి మొఖంలోకి సూటిగా చూశాడు వృద్ధుడు.

'రవీంద్ర ఇంటిదగ్గర నీకు కనిపించింది ఆ తల్లి. ఇప్పుడు కూడా ఈ చుట్టుపట్లే ఎక్కడో ఉండి ఉన్నా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదని అన్నావు. గుర్తొచ్చిందా?' అని అడిగాడు.

మూగగా తల ఊపాడు వెట్టి.

'ఎక్కడో తన ఆలయంలో తను ఉండాల్సిన ఆ తల్లి ఈ మారుమూల గ్రామంలోకివచ్చి నీకెందుకు కనిపించినట్టు?'

'చెప్పండి స్వామీ.. నేను వేయవలసిన ప్రశ్నలన్నీ మీరు వేస్తున్నారు' అన్నాడు వెట్టి.

'పిచ్చిమాలోకానివి నువ్వు. కాపలా కాయటానికి వచ్చిందిరా. నీకు చెడుపు తలపెట్టేవాడు ఎవడు ఈ పొలిమేర ల్లోకి వచ్చినా, ప్రాణాలతో తిరిగి వెనక్కి పోలేడు. చౌడేశ్వరి అంటే మాటలు కాదురా నాయనా. తలుచుకుందంటే ఈ భూమి మొత్తాన్ని ఉండచుట్టి సముద్రంలో ముంచేయగల ఆదిశక్తి' చేతులు జోడిస్తూ తన్మయత్వంగా చెప్పాడు వృద్ధుడు.

'స్వామీ.. ఒక చిన్న అనుమానం... అడగనా?' ఉన్నట్టుండి అడ్డం పోయాడు వెట్టి.

'నువ్వు అడగాల్సిన అవసరం లేదు. నీ అనుమానం ఏమిటో నాకు తెలుసు. ఆ తల్లి అంటే ఇంత భక్తిప్రపత్తులు కలిగి ఉన్న నేను - ఎప్పుడు ఏ క్షణంలో ఆ తల్లి



వచ్చి మీద పడుతుందోనన్న భయంతో వణికి పోతూ ఉండటం దేనికని నీ అనుమానం.'

తల ఊపాడు వెట్టి.

'తప్పు చేశానురా. ఒక అమాయకురాలికి ఒక విధంగా ద్రోహం చేశాను. నా కర్మకాలి అది ఆ తల్లికి కూడా ద్రోహం చేసినట్లే అయింది. నిత్య పూజలతో, నిత్య నైవేద్యాలతో విరాజిల్లుతూ ఉండ వలసిన ఆ తల్లి ఆత్మశిల పాడుబడిన గుడిలో మూలవిరాట్టు మాదిరి కళాకాంతులు లేకుండా పిచ్చిచెట్ల మధ్య పడిపోయి ఉండాల్సిన పరిస్థితికి కారకుణ్ణి అయ్యాను.' బాష్పధారలు బుగ్గల మీదికి జారుతుండగా అన్నాడు వృద్ధుడు.

'తెలిసి చేసిన తప్పు కానందువల్ల ప్రాణాలు తీయకుండా ప్రస్తుతానికి వదిలిపెట్టిందా తల్లి. మనసు మార్చుకుని ఎక్కడ పడగను విసురుతుందో నన్న భయంతో విషాలన్నిటినీ విరిచేసే మూలికల న్నిటినీ పక్కన పెట్టుకుని దినదిన గండం నూరేళ్ళ ఆయుష్షు మాదిరి బతుకుతున్నాను. గడపదాటి బయటికి పోవటానికి భయం. పొలిమేరల్నించి రోడ్డుమీదికి వెళ్ళటానికి భయం. ప్రతిపనికీ భయమే! దుర్భరం అయిపోయింది బతుకు' కన్నీటిని తుడుచు కుంటూ చెప్పాడు.

'చెప్పండి స్వామీ... ఆత్మశిల గురించి చెప్పండి' ఆ సంభాషణ కట్‌చేసి అసలు విషయంలోకి అతన్ని నడిపించే ప్రయత్నం చేశాడు వెట్టి.

'శివారెడ్డి తండ్రి పూజారయ్య కూతురి మీద మనసు పడ్డాడు. ఆ మాట ఈ మాట చెప్పి లోబ రుచుకున్నాడు. కొంతకాలం సజావుగానే సాగిందా వ్యవహారం. ఆ బిడ్డ నెల తప్పటంతో మొదలైంది అసలు బాధ' అసలు విషయంలోకి వచ్చేశాడు బండోడి నాయన.

'ఆత్మశిల అంటూ ఒకటి ఉన్నదని, అమ్మ వారికి అది ప్రతిరూపమని నాకు తెలియదు. గుడి లోని శాసనం ఏదో పనిలేనివాళ్ళు చెక్కి - భక్తుల్ని భయపెట్టటానికి అక్కడ నిలబెట్టి ఉంచారనే భావన అందరిదీ... మాది కూడా'.

'నెల తప్పిన వెంటనే పూజారయ్య కూతురు లబోదిబోమనటం మొదలు పెట్టింది. కారణం అడి గితే అసలు విషయాన్ని బయట పెట్టిందట..'

ఊపిరి బిగపట్టేశాడు వెట్టి.

'గుడిపక్కన ఉన్న పుట్టల మధ్యలో ఒక మట్టి వేదిక. శివలింగం పైభాగంలో ఉన్న శిలవంటి ఒక కోలమొఖం రాయి. గుడిలోని విగ్రహానికి పూజలు, నైవేద్యాలు సమర్పించినట్టే - ప్రతిరోజూ ఆ శిలకు ఆ ఉపచారాలు జరిపి తీరాలట. ఆ పనిని భక్తిశ్రద్ధ లతో, పవిత్రమైన మనస్సుతో, అంతకంటే పవిత్ర మైన శరీరంతోనే చేయాలట. నెల తప్పిన పూజా రయ్య కూతుర్ని అక్కడి పుట్టల్లోని పాములు శిల దగ్గరికి పోనీయటం లేదట..'



**చౌడేశ్వరి ప్రసాదాన్ని బయటికి తీశాడు వెట్టి. అది గమనించి ఒక అడుగు వెనక్కివేశాడా వృద్ధుడు. గజగజ వణకిపోయాడు. మునివేళ్లతో తీసిన ప్రసాదాన్ని ఆ వృద్ధుడి దోసిట్లో వేశాడు. ప్రసాదం దోసిట్లో పడిన మరుక్షణం కరెంటుషాక్ కొట్టినట్లు అదిరిపడ్డాడు వృద్ధుడు. అసలేం జరిగింది? ఇంతకుముందులా ప్రసాదం రంగు మారిందా?**

కాగితం మీద రాసుకుని చదివినట్టు చకచకా చెప్పుకుంటూ పోతున్న వృద్ధుడి ముఖంమీది నుంచి చూపుల్ని తిప్పుకుని కూర్చున్న వెట్టి కనులముందు మెదిలింది ఆ దృశ్యం.

శిల దగ్గరికి పోకుండా పాములన్నీ అడ్డుకోవ టంతో, శివారెడ్డి తండ్రికి ఆ సంగతి చెప్పి ఉంటుంది ఆ అమాయకురాలు. బాజిరెడ్డిని బండోడి నాయన దగ్గరికి పంపించి ఉంటాడు ఆ పెద్దమనిషి. ఈయన ఏదో మూలికను ఇచ్చి ఉంటాడు. అది వికటించి ఆ బిడ్డ కళ్ళు మూసేసి ఉంటుంది. అంతవరకూ గుట్టుగా సాగిన ఆ గ్రంథం బట్టబయలై పూజా రయ్య దృష్టిలోకి పోయి ఉంటుంది.

క్లియర్ కట్‌గానే ఉంది వ్యవహారం. తర్వాత ఏదో జరిగింది. అది ఆ తల్లికి బొత్తిగా నచ్చలేదు. తన పవర్ ఎటువంటిదో చూపించింది. అదేమిటి? 'ఆ తర్వాత కాదురా... అంతకుముందే జరిగింది. ఒక్క పూజారికి మాత్రమే తెలిసి ఉండవలసిన ఆ ఆత్మశిల విషయాన్ని, ఆ బిడ్డకు నెల తప్పకముందే ఈ పెద్దమనుష్యులు ఇద్దరూ చాటునుంచి గమ నించారు. అయితే ఆ శిలకున్న పవర్ నిజమైనదే నని ఆ బిడ్డ చెప్పిన తర్వాతనే వాళ్ళు గ్రహించారు' వెంటనే సరిచేశాడు వృద్ధుడు తన ఆలోచనల్ని.

'పూజారయ్య కూతురు ఈ ప్రపంచాన్ని వదిలి పోవటాన్ని శివారెడ్డి తండ్రి చాలా సీరియస్‌గా తీసుకున్నాడు. బాజిరెడ్డిని చాలా పరుషమైన పదా లతో తీవ్రంగా నిందించాడు. వైద్యం చేయటం చేత కాని వాడివని నన్ను కూడా తిట్టిపోశాడు. బాజి రెడ్డినైతే ఉద్యోగం మానుకుని కదిరి పొలిమేరల్లో ఎక్కడా కనిపించకుండా వెళ్ళిపొమ్మని ఆదేశించాడు'.

'అదిగో.. అప్పుడు బయటపడింది బాజిరెడ్డి అసలైన వికృత స్వరూపం. చౌడేశ్వరి తనమీద పగ బట్టిందని నాకు అసత్యాలు చెప్పి, ఇంతకుముందు నేను పుచ్చుకున్న మూలికనే తను కూడా తీసుకు పోయాడు..' అన్నాడు.

'ఆత్మశిల... ఆ మట్టి అరుగుమీద ఉన్న ఆత్మ శిలకు స్థానభ్రంశం కల్పించబడింది. బాజిరెడ్డి మీరు ఇచ్చిన మూలికను ఉపయోగించి, అక్కడి పాములు తనకు చెడుపు చేయకుండా జాగ్రత్తపడి, ఆ శిలను అక్కడి నుంచి మరో చోటుకు తీసుకుపోయాడు. అది జరిగిన వెంటనే పూజారయ్యకు మతి తప్పింది. శివారెడ్డి తండ్రి బలైపోయాడు. శివారెడ్డికి అనా రోగ్యం. అతని మారుటి తల్లికి పిచ్చి..' అన్నాడు వెట్టి.

తల ఊపాడు బండోడి తండ్రి.

'చౌడేశ్వరి ఆత్మశిలకు అపచారం చేసింది శివా రెడ్డి తండ్రిగారే అని బయటికి తెలిస్తే, పూజా రయ్య కూతురి మరణానికి కారకుడు ఆయనేనని అందరూ గ్రహిస్తే, కదిరి ఎస్టేట్ కకావికలం అయి పోతుంది. వంగివంగి నమస్కారాలు చేస్తూ, వినయ విధేయతలు ప్రదర్శిస్తున్న జనం ఒక్కసారిగా ఆగ్రహా వేశాలకు గురవుతారు. పరువుప్రతిష్ఠలు మంట కలిసి పోతాయి. ఒక విధంగా శివారెడ్డిని, అతని భార్యను అతని బంధువులతో సహా వెలివేసినట్టు దూరంగా పెట్టేస్తారు జనం. ఇదే బాజిరెడ్డి ప్రయో గిస్తున్న అస్త్రం! శివారెడ్డి అతనికి బానిసగా మారి పోవటానికి వెనుక ఉన్న అసలైన కారణం!' అన్నాడు వెట్టి.

'అర్థం అయింది కదా! నీ అనుమానాలన్నీ తీరిపోయాయి కదా..' అన్నాడు వృద్ధుడు.

తల ఊపాడు వెట్టి.

'అయితే ఇంక ఆలస్యం చేయకుండా వెళ్ళిపో...' అంటూ కూర్చున్న చోటు నుంచి లేచి నిలబడ బోయాడు వృద్ధుడు.

చేతిని జాచి ఆపాడు వెట్టి.

'మళ్ళీ అనుమానమా?' అసహనంగా అడిగాడు బండోడి తండ్రి.

'జరిగిపోయిన అపచారాన్ని సరిచేయటానికి మార్గం ఏదో ఒకటి ఉంటుంది. అదేమిటి?' అడి గాడు వెట్టి.

'దెబ్బ తగిలింది. మందులు వేసుకోవాలి. కట్టు కట్టించుకోవాలి' అన్నాడు వృద్ధుడు.

'ఏమైపోయిందో తెలియని ఆ శిలను తీసుకు వచ్చి, తిరిగి ఆ పుట్టల మధ్యన ప్రతిష్ఠించి, ఆగి పోయిన పూజల్ని మళ్ళీ మొదలు పెట్టించాలి. అంతేనా?'

నిదారుగా నిలబడి వెట్టి తలమీద చెయ్యివేసి ఆప్యాయంగా నిమిరాడు వృద్ధుడు. 'నేను మొద



ట్లోనే చెప్పాను. ఆ తల్లి నిన్ను పనికట్టుకుని వెంట బెట్టుకొచ్చింది అని. ఇటువంటి పనులు యాంత్రికంగా జీవితాలు గడిపే సామాన్యులు ఎవరూ చేయలేరు. అన్నీ ఉన్నా ఏమీలేనట్టు బ్రతికేవాళ్ళు, తన గురించి ఆలోచించకుండా అవతలివాళ్ళ శ్రేయస్సును కోరుకునేవాళ్ళు, అవసరం అయితే ప్రాణాలకు తెగించి పనులు పూర్తి చేయగల ధైర్యవంతులు... ఇటువంటి వాళ్ళ వల్లనే పూర్తవుతాయి. ప్రతిఫలం ఆశించకుండా వెట్టిచాకిరీ చేయటానికి సిద్ధపడితేనే ఫలితాలు కనిపిస్తాయి' అంటూ గుమ్మం దగ్గరికిపోయి మూసి ఉన్న తలుపుల్ని బార్లా తెరిచాడు.

దూరంగా నిలబడి ఉన్న బండోడు, అతని స్నేహితుడు ఇద్దరూ పరుగు పరుగున వచ్చి ఎదుట నిలబడ్డారు.

'ఈ చుట్టుపట్ల ఉన్న అడివి దారులన్నీ నా బిడ్డడికి కొట్టినపిండి. ఎవరికీ కనిపించకుండా నిన్ను అవతలికి తీసుకుపోతాడు' అని తన వెనక ఉన్న వెట్టికి చెప్పి, 'తీసుకుపో బిడ్డ, అతన్ని అవతలికి తీసుకుపో' అని తన కొడుక్కి చెప్పాడు.

'ద్వారబంధాన్ని ఆసరాగా చేసుకుని నిలబడి ఉన్న వృద్ధుడికి వట్టిగా చేతులు జోడించలేదు వెట్టి. ముందుకు వంగి అతని పాదాలను తాకి మరీ నమస్కారం చేశాడు.

'వెయ్యేళ్ళు.. నీకు వెయ్యేళ్ళ ఆయుష్షు. పిల్లా పాపలతో సుఖమైనజీవితం - మనం మళ్ళీ కలుస్తామనే అనిపిస్తోంది' భుజం మీద చెయ్యివేసి ఆప్యాయంగా అన్నాడు వృద్ధుడు.

'అన్నా ఆలస్యం చేయకు... అర్ధరాత్రి దాటిన తర్వాత అడవిదారుల్లో నడవటం మంచిది కాదు' హెచ్చరించాడు బండోడు.

'ఓరినీ... అన్న సంగతి నీకు తెలియదురా బండోడా! వివరంగా చెపితే గుడ్లెళ్ళబెడతావు. కాసేపు ఆగు' అంటూ హెచ్చరించాడు అతని ఫ్రెండ్.

వెనుతిరగబోతూ ఒక్క క్షణం ఆగాడు వెట్టి.

'ఏంటి బిడ్డా? మళ్ళీ ఇంకో అనుమానమా?' నవ్వుతూనే అడిగాడు వృద్ధుడు.

'శివారెడ్డిసారుకి జబ్బు నయం అయ్యే సూచనలు కనిపిస్తున్నాయని చెప్పాడు వాళ్ళ డాక్టరు. ప్రాణాలు గాలిలో కలిసిపోబోయి ఆఖరి క్షణంలో తేరుకుని తెప్పరిల్లాడు శివారెడ్డి. ఎక్కడో దూరంలో నుంచి ఫోనులో కబురందించింది జయమ్మ తల్లి. చెల్లాచెదురైన వరి పనల్ని జాగ్రత్తగా కోసి ఎండబెట్టి కట్టలుకట్టి కుప్పవేయమని' అంటూ జేబులో దాచుకున్న చౌడేశ్వరి ప్రసాదాన్ని బయటికి తీశాడు వెట్టి.

ఇంట్లో వెలుగుతున్న దీపం కాంతిలో స్పష్టంగానే కనిపించింది కాబోలు.. భయపడుతున్నట్టు ఒక అడుగు వెనక్కి వేశాడు బండోడి తండ్రి.

'ఆ తల్లి దయ ఎలా ఉన్నదో స్వయంగా చూడాలని నా కోరిక. ఒకసారి చేయి పట్టండి' మునివేళ్ళతో ప్రసాదాన్ని కొంచెంగా బయటికి తీస్తూ అన్నాడు వెట్టి.

'వద్దులే బిడ్డ. ఒకటికి రెండుసార్లు గతం గుర్తుకు వస్తే మనసు కకావికలం అయిపోతుంది' అన్నాడు బండోడి తండ్రి.

'అన్నయ్య అవసరం లేకుండా ఏదీ మాట్లాడడు. తీసుకో బాబాయ్... ఒకసారి తీసుకుని చూడు..' అంటూ ప్రాంప్ట్ చేశాడు రవీంద్రన్న బావమరిది.

గజగజ వణుకుతూ, దోసిలిపట్టాడు బండోడి తండ్రి.

బయటికి తీసిన ప్రసాదాన్ని ఆ దోసిట్లో వేశాడు వెట్టి.

కరెంట్ షాకు కొట్టినట్టు అదిరిపడ్డాడు వృద్ధుడు. చాలా వేగంగా కదిలి తన తండ్రి భుజాల్ని గట్టిగా పట్టుకుని, పడిపోకుండా నిలబెట్టాడు బండోడు.

'అయ్యబాబోయ్... చూసుకో బాబాయ్.. నీ చేతుల్ని చూసుకో' వెట్టి భుజాల మీది నించి వృద్ధుడి చేతులవైపు చూస్తూ బిగ్గరగా అరిచినంత పని చేశాడు రవీంద్రన్న బావమరిది.

జలజలా బుగ్గలమీదికి వచ్చేస్తున్న కన్నీటిని తుడుచుకోను కూడా తుడుచుకోకుండా దోసిలిని ఎత్తి కనులకు అద్దుకుని నెత్తిమీద పోసుకున్నాడు వృద్ధుడు.

'నీకేమైనా పిచ్చి ఎక్కిందా? నోట్లో వేసుకోవాల్సిన ప్రసాదాన్ని నెత్తిమీద వేసుకోవటం ఏమిటి నాయనా?' ఆశ్చర్యంగా అడిగాడు బండోడు.

'తల్లి దయ వచ్చిందిరా పిచ్చోడా! నా మీద కోపం తగ్గిపోయిందని తేల్చి చెప్పేసింది. కళ్ళు తెరుచుకుని చూడరా. ప్రసాదం రంగు ఎలా ఉందో చెప్పు' ఆనందంగా అన్నాడు వృద్ధుడు.

తేరిపార చూసిన బండోడి కళ్ళు వెడల్పు అయిపోయాయి.

అంతకుముందు అతని తండ్రి చేతి స్పర్శ తగలగానే కాటుకలో ముంచినట్టు నల్లగా మారిపోయిన చౌడేశ్వరి ప్రసాదం, ఇప్పుడు మామూలుగానే ఉంది.

'నిజంగానే మా ఓడు చెప్పినట్టు నువ్వు చాలా గ్రేట్ అన్నయ్యా... ఆ బాజిరెడ్డి జనం తరుముకుంటూ వచ్చేస్తున్నారని తెలిసి కూడా నిబ్బరంగా కూర్చొని ఉండడం నీలాంటి వాడికే చెల్లుతుంది. పంచెలు తడిసిపోతయ్ మాలాంటోళ్ళకి' అన్నాడు బండోడు.

'అరేయ్ నాయనా.. అన్నయ్యని అడివి దాటించి నువ్వు తొందరగా వచ్చేయ్. నువ్వు రాగానే మనం ఆ తల్లి దర్శనానికి పోయి సాష్టాంగ నమస్కారం చేసుకోవాలి' బుగ్గలమీది తడిని తుడుచుకుంటూ అన్నాడు తండ్రి.

'వద్దు. నేను ఇక్కడికి వచ్చినట్టు తెలిసిన వెంటనే ఆ బాజిరెడ్డి తన జనాన్ని పంపించటానికి కారణం, నేను మీతో మాట్లాడి జరిగినవి తెలుసుకుంటాననే భయమే కావచ్చు. నేను కనిపించకపోతే తను ఆ కక్షని మీ మీద తీర్చుకునే ప్రయత్నం చేయవచ్చు' వెంటనే చెప్పాడు వెట్టి.

ప్రసన్నంగా ఉన్న బండోడి ముఖం ఒక్కసారిగా వికృతంగా మారిపోయింది. 'నరికి పోగులు పెట్టేస్తానన్నయ్యా ఆ దొంగనాయాళ్ళని. ఆ బాజిరెడ్డి తలని నడిబజార్లో నరికి బంతాట ఆడేస్తాను. నా నాయన ఒంటిమీద పడిన చేతులు మట్టిలో పడి పొర్లిగింతలు పెట్టాల్సిందే' కరకరలాడుతున్న కంఠంతో చెప్పాడు.

'అనవసరమైన మాటలు వద్దు. ఒక్క రెండు రోజులు ఆగితే అన్ని పనులూ సక్రమంగా పూర్తి అయిపోతాయ్. వాళ్ళని చూసి వీళ్ళని చూసి భయపడాల్సిన అవసరం ఎవరికీ ఉండదు. నేను చెప్పినట్టు చేయండి. నేను వచ్చి చెప్పేవరకూ ఎవరూ ఎక్కడికీ కదలద్దు' అంటూ రవీంద్రన్న బావమరిది వైపు తిరిగి, 'నువ్వు కూడా... ఆ గుర్రపోడు నీ గురించి కూడా అందరికీ చెప్పేశాడేమోనని నా అనుమానం' అన్నాడు.

'మా ఊళ్ళో ఉన్న అమ్మతల్లికి జాతర జరిపించి చాలాకాలమైంది అన్నయ్య. ఈసారి కోళ్ళని, కొక్కిరాయిల్నే కాదు, కొంతమంది జనాన్ని కూడా బలి ఇవ్వాల్సి వచ్చేటట్టుంది. ఇప్పుడు జరుగుతున్న ఈ డ్రామాలన్నీ మా బావయ్యకి తెలిస్తే అప్పుడు మొదలవుతుంది అసలు కథ..' అన్నాడు యువకుడు.

'సరిసరి.. మాటలు చాలా ఎక్కువైపోయినయ్. ఇంక బయలుదేరండి' అసహనంగా హెచ్చరించాడు వృద్ధుడు.

మరోసారి ఆయనకి నమస్కారం చేసి పెద్ద పెద్ద అడుగులు వేశాడు వెట్టి.

'అటుకాదు అన్నయ్య ఇటు' అంటూ తమ ఇంటికి తీసుకుపోయే దారిని చూపించాడు రవీంద్రన్న బావమరిది.

'అటు దేనికి?' అడిగాడు వెట్టి.

'అక్కమ్మకి చెప్పాలి కదా. తెల్లవారుజామున నిద్రలేచే అలవాటున్న వాళ్ళ కోసం టీ కాచటానికి సిద్ధం అవుతూ ఉంటుంది ఆ అన్నపూర్ణమ్మ తల్లి. చెప్పకపోతే నొచ్చుకుంటుంది' అన్నాడు అతను.

'టైం లేదు తమ్ముడూ. ఇంకోసారి వచ్చి నమస్కారం చేసుకుంటాను' అన్నాడు వెట్టి. అలాగే ముందుకు నడిచాడు.

## కిక్ ఇస్తే చేస్తుందట!



*ఇదేదో రవితేజ డైలాగ్‌లా ఉందే అన్న అనుమానం వస్తోందా? డైలాగ్ రవితేజదే కానీ అన్నది మాత్రం కాజల్. కాజల్ చేసిన 'పక్కా లోకల్' సాంగ్‌కి విపరీతమైన ఆదరణ వచ్చింది. ఆ పాట చేస్తుంటే మంచి కిక్ వచ్చిందట! అలాంటి కిక్ ఇచ్చే పాటుంటే చెప్పండి, చేస్తాను. అంతే కానీ మా సినిమాలో ఐటెంసాంగ్ ఉంది చేయండి అంటూ నా దగ్గరకు రాకండి అంటూ గట్టిగానే చెబుతోందట! అయితే అన్ని పాటలూ అలాంటి కిక్ ఇవ్వాలంటే కష్టం కదా! అని కొందరు దర్శకనిర్మాతలు గొణుక్కుంటున్నారట కూడా!*

వంద అడుగులు వేసిన తర్వాతగాని అతనికి తెలియలేదు, బండోడితో పాటు తన కూడా వచ్చేస్తున్నాడు అతను.

'అరే... నువ్వేమిటి? దేనికి?' అడిగాడు ఆశ్చర్యంగా వెట్టి.

'ఒళ్ళు జలదరించే మాటల్ని, చేతల్ని చూసి చాలాకాలం అయిందన్నాయ్. రాక రాక వచ్చిన ఛాన్సు... వచ్చినా వదులుకోను. నిన్ను అడవి దాటించే వరకూ నేను నీ పక్కన ఉండటం ఉండటమే' రెండో మాటకు చోటు లేకుండా ఖచ్చితంగా చెప్పాడు అతను.

బెదిరించినా అతను బెదిరే రకం కాదని అర్థమై మౌనంగా ముందుకు సాగాడు వెట్టి. ఊరి పొలిమేరలు దాటిన వెంటనే దట్టమైన పొదల్లో తాను దారి చూపించాడు బండోడు.

•••

ఉదయం ఎనిమిది గంటలు అవటానికి ఇంకో పావుగంట వ్యవధి ఉండగానే మోతలు చేసుకుంటూ కాంపౌండ్‌లోకి వచ్చి ఆగింది డాక్టరుగారు స్వయంగా డ్రైవ్ చేస్తున్న కారు.

పరిగెత్తుకుంటూ వెళ్ళి డోర్ తెరిచాడు ఒక పనివాడు.

'జయమ్మ తల్లి దగ్గరికి తర్వాత వస్తాను. ముందు శివారెడ్డిని చూస్తాను' అంటూ తనతోపాటు దిగిన సైకియాట్రిస్ట్‌ని వెంటబెట్టుకుని లోపలికి పోయాడు డాక్టర్.

అంతకుముందే నిద్ర లేచాడు కాబోలు.. తన భార్యను పక్కన కూర్చోబెట్టుకుని ఏవో మాట్లాడుతున్నాడు శివారెడ్డి. మెత్తగా అడుగులు వేస్తూ వచ్చిన డాక్టర్‌ని చూడగానే దరహాసం చేశాడు.

'నాకు చాలా సంతోషంగా ఉంది. మీ వాళ్ళు కట్టించిన హాస్పిటల్ లక్ష్యం పూర్తిగా నెరవేరినట్టు అనిపిస్తోంది' దగ్గర్లో ఉన్న కుర్చీని తనే జరుపుకుని కాలుమీద కాలు వేసుకుని కూర్చుంటూ అన్నాడు డాక్టరు.

'అంతా మీచేతి మహత్యం డాక్టరుగారు' ఆయన్ని చూడగానే బెడ్ దిగి లేచి నిలబడిన శివారెడ్డి భార్య వెంటనే అంది.

'నాదేముంది తల్లీ... బిడ్డొచ్చిన వేళ గొడ్డొచ్చిన వేళ అంటారు పెద్దలు. ఆ యంగ్‌మ్యాన్ మీ దగ్గరికి వచ్చినవేళ కూడా అటువంటిదే! ఏడీ? ఎక్కడా కనిపించటం లేదు?' చుట్టూ చూస్తూ అన్నాడు డాక్టరు.

ప్లెజెంట్‌గా ఉన్న శివారెడ్డి ముఖం చిరాకుగా తయారయింది. 'నిజమే... ఏమైపోయాడు రాజీ? అదే పోక పోయాడేమిటి?' అని అడిగాడు.

'కనుక్కుంటాను. అందరమూ అదేమాట అనుకుంటున్నాము.' అంటూ డాక్టరు వైపు తిరిగింది ఆమె.

'తల్లీ.. మీ చేత్తో వేడిగా కాఫీ ఇప్పించండి. తాగేసి మీ అత్తమ్మగారిని చూడాలి' అన్నాడు అతను.

చిరాకుగా ఉన్న శివారెడ్డి ముఖంలో వెంటనే ప్రత్యక్షమైంది ఆశ్చర్యం.

'మా అమ్మని చూడటం ఏమిటి? ఏమైంది?' ఆత్రుతగా అడిగాడు. అడగటంతో ఆగలేదు, బెడ్ మీది నించి దిగబోయాడు.

'అయ్యయ్యో... మీరు కదలకండి' అంటూ ఆపాడు అంతకుముందే అక్కడికి వచ్చిన డ్యూటీ డాక్టరు.

'అదేంటి, సారు అలా అడుగుతున్నాడేమిటి?' అని క్వశ్చన్ చేయబోయిన పెద్ద డాక్టర్‌కి సైగ చేసి ఆపింది శివారెడ్డి భార్య.

'అత్తమ్మకి ఏమీకాలేదు. మీకు సుగుణం కనిపించినట్టే తనకి కూడా తన ప్రాబ్లం తగ్గిపోతున్నట్టు అనిపిస్తోందిట. రాత్రి తనే స్వయంగా ఫోనుచేసి డాక్టరుగారిని రమ్మని చెప్పింది' మృదువుగా భర్తకి చెప్పింది.

సడన్‌గా తడి అయిపోయాయి శివారెడ్డి కళ్ళు. అందరూ ఆశ్చర్యపడేలా రెండు చేతుల్ని కలిపి ఎవరికో నమస్కారం చేసుకున్నాడు.

'ఇప్పుడు అర్థం అయ్యాయా నా మాటలు.. ఇవన్నీ ఆ యంగ్‌మ్యాన్ మీ గడపలో కాలుపెట్టిన దగ్గర్నుంచీ జరుగుతున్న విచిత్రాలు' నవ్వుతూ చెప్పాడు డాక్టరు.

'రాజీ... వెట్టి తిరిగి రాగానే అతన్ని మన హాస్పిటల్‌కి, మన రైసుమిల్లులకి, సినిమా హాళ్ళకి మేనేజరుగా పెట్టేయ్' తడుముకోకుండా చెప్పేశాడు శివారెడ్డి.

'బాజిరెడ్డికి చెప్పండి. అతను ఏమంటాడో' అన్నది ఆమె.

'ఏంటి తను అనేది? ఇది మనకు సంబంధించిన విషయం. మన ఇష్టం' మొండిగా అన్నాడు శివారెడ్డి.

'అయినా సరే... ముందుచెప్పండి. తర్వాత చూద్దాం' అంటూ కిచెన్‌వైపు వెళ్ళిపోయింది ఆమె.

కనులు చిట్లిస్తూ ఆమె వెళ్ళినవైపే చూస్తున్న శివారెడ్డి చేయిమీద చేయి వేశాడు డాక్టరు. 'అమ్మగారి మాట కరెక్టు. బాజిరెడ్డి సారుకి ఆ యంగ్‌మ్యాన్ అంటే అస్సలు సరిపడదు. మీ మాటకు నెగెటివ్ రిజల్టు రావచ్చు. సో బీ కేర్‌ఫుల్' అంటూ కుర్చీలో నుంచి లేచాడు.

'కాఫీ తాగుతానని అన్నారు గదా.. కూర్చోండి' అన్నాడు శివారెడ్డి.

'జయమ్మ తల్లి దగ్గరికిపోయి అక్కడ తాగుతాను' అంటూ అతని సమాధానం కోసం ఎదురు చూడకుండా ఆ గదిలో నుంచి బయటికి వచ్చాడు డాక్టరు.

గది వెలుపల రెడీగా ఉంది ఒక పనిమనిషి. దూరంగా ఉన్న ఒక పెద్ద హాలు వంటి గదిలోకి తీసుకుపోయింది.

మెత్తటి కుర్చీలో కూర్చుని కనులు మూసుకుని తనలో తను నవ్వుకుంటూ ఉన్నది పిచ్చమ్మి, అక్కడ. చుట్టూ కూర్చుని ఉన్నారు మిగిలిన ఫ్యామిలీ మెంబర్స్ అందరూ.

డాక్టరు అడుగు పెట్టటం ఆమె పకపకా నవ్వటం ఒకేసారి జరిగింది. 'ఏమైంది తల్లీ?' అటువంటి డెవలప్‌మెంట్స్‌ని అంతకుముందు చూసి ఉండటం వల్ల, జంకు గొంకు లేకుండా అడిగాడు అతను.

'అయిపోయింది నా పని. పనులన్నిటినీ సరిచేయించాను. కట్టెలు కొట్టించి కుప్ప వేయించబోతున్నాను. మంచిరోజు చూసుకుని ముగింపు పలకటం ఒక్కటే మిగిలి ఉంది' అని చెప్పిన తర్వాత కనులు తెరిచింది ఆమె.

ఆ తర్వాత అందరూ కంగారుపడే మాటల్ని మాట్లాడుతుందని అనుమానం వచ్చింది కాబోలు... 'వందనాలు తల్లీ... నీకు శతకోటి వందనాలు' అనేశాడు శంకరయ్య.

చటుక్కున వచ్చేసింది మార్పు పిచ్చమ్మి ముఖంలో. సౌమ్యంగా చాలా ప్రశాంతంగా మారిపోయింది ముఖం.

'వచ్చారా... రండి.. రండి' అంటూ ఆహ్వానించింది డాక్టర్‌ని.

'అమ్మ.. ఇతనే మన సైకియాట్రిస్ట్' తన వెనుక నిలబడి ఉన్న యువకుడిని పరిచయం చేశాడు డాక్టరు.

'తల్లీ.. శివారెడ్డి తండ్రిగారు పేద విద్యార్థులు చదువుకోవటానికి ఏర్పాటు చేసిన స్కాలర్‌షిప్పుతో డాక్టరునయ్యాను. అంతా మీరుపెట్టిన భిక్ష' నమస్కారం చేస్తూ అన్నాడు అతను.

చివ్వున మళ్ళీ తల ఎత్తబోయి.. ఆగి, నుదురు రుద్దుకున్నది పిచ్చమ్మి.

'తలనొప్పి అనిపించింది కదూ తల్లీ... కళ్ళు గిర్రున తిరిగి, ఫైకం ముంచుకు వస్తున్న ఫీలింగ్ కలిగింది కదూ?' అడిగాడు అతను. తల ఊపింది ఆమె.

'రెండు కారణాలున్నాయి తల్లీ.. ఒకటి మెదడులో జరిగే ఒక రసాయనిక ప్రక్రియ. చక్కటి మెడిసిన్స్ ఉన్నాయి, చిటికెలో కంట్రోల్ చేస్తాయి' చెప్పాడు అతను.

'రెండవ కారణం ఏమిటి?' చిరునవ్వుతో అడిగింది పిచ్చమ్మి.

'కారణమని చూచాయగా చెప్పటమే కాని, ఆధారాలు, ఎవిడెన్సులు చూపించటం అసాధ్యం తల్లీ... ఈ కారణం మన సంస్కృతీ సంప్రదాయాల మీద, మన నమ్మకాల మీద ఆధారపడి ఉంటుంది' అన్నాడు డాక్టరు.

***(ఇంకా వుంది)***



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో

## ఇరిటబుల్ బవెల్ సిండ్రోమ్ (IBS) సమస్యకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

తరచుగా ఒక రోజు విరేచనాలు, మరొక రోజు మలబద్ధకం వంటి లక్షణాలు మీలో ఈ మధ్యన ఒకదాని వెంట ఒకటి కనిపిస్తున్నట్లయితే మీరు **IBS** గురించి తెలుసుకుని ఉండటం మంచిది. ఈ 'ఐబియస్'తో బాధపడేవారి సంఖ్య నానాటికీ పెరుగుతూనే ఉంది. మారుతున్న జీవన శైలి, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం, ఆహార లోపం, కొన్ని గ్యాస్ట్రిక్ ఇన్‌ఫెక్షన్‌లు మొ॥వి దీనికి ప్రధాన కారణాలుగా చెప్పవచ్చు. ప్రతి ఐదుగురిలో ఒకరు తమ జీవితకాలంలో ఈ వ్యాధి బారిన పడటం జరుగుతోంది. వయస్సు అంశానికి సంబంధం లేకుండా ఏర్పడే ఈ వ్యాధి ఎక్కువగా 20 నుండి 30 సం॥ల మధ్యవయస్సు వారిలో కనిపించే అవకాశం ఉంది. ఇది ముఖ్యంగా పురుషుల కంటే స్త్రీలలో 1.5 రెట్లు ఎక్కువగా కనిపిస్తుంది. ఈ వ్యాధికి ఇతర వైద్యవిధానాలలో కేవలం తాత్కాలిక ఉపశమనం తప్ప పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కేవలం హోమియో చికిత్స ద్వారా మాత్రమే ఈ వ్యాధి పూర్తిగా నయం అయ్యే అవకాశం ఉంది.



పేగుల్లో క్రమరాహిత్యం ఏర్పడటం లేదా పేగుల అసాధారణ కదలికల వలన వచ్చే సమస్యనే 'ఐబియస్' అని పిలుస్తారు. ఇది సాధారణంగా పేగు పనితీరులో వచ్చే మార్పుతో ఉత్పన్నమయ్యే సమస్యే కానీ, పేగు నిర్మాణ మార్పులకు చెందినది కాదు. పేగుల కదలికల అంతర్గత నియంత్రణలో లోపం ఏర్పడినప్పుడు సహజ కదలికలకు అదనంగా జరిగే ఎక్కువ కదలికల వలన విరేచనాలు కావటం, తక్కువ కదలికల వలన మలబద్ధకం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

**కారణాలు:** ఈ వ్యాధి ఏర్పడటానికి గల కారణాలలో ఇంతవరకూ స్పష్టత లభించలేదు. కానీ పేగులు తీవ్ర సున్నితత్వము కలిగి ఉండటం కారణంగా – మానసిక ఒత్తిడి, గ్యాస్ట్రిక్ ఇన్‌ఫెక్షన్‌లు, కొన్ని రకాల నూనె పదార్థాలు, మసాలాలు, కొవ్వు పదార్థాలు, కలుషితమైన నీరు–ఆహారం మొదలైనవి 'ఐబియస్' ప్రేరేపకాలుగా నిలిచి ఈ వ్యాధి లక్షణాలను కలుగజేస్తాయి. కొన్ని రకాల యాంటీబయోటిక్ మందులను ఎక్కువగా వాడటం మూలంగా అవి మన శరీరంలో మేలు చేసే బ్యాక్టీరియాకు హాని తలపెట్టిన సందర్భంలో 'ఐబియస్' సమస్య తలెత్తే అవకాశం ఉంది.

**లక్షణాలు:** కడుపునొప్పి, కడుపుబ్బరం వంటి లక్షణాలు తరచుగా వస్తూ పోతూ ఉంటాయి. ఈ నొప్పులు ఒక్కోసారి అసాధారణ స్థాయిలో మొదలై తీవ్రస్థాయికి చేరతాయి. సహజంగా మలవిసర్జన తరువాత మాత్రమే ఇలాంటి నొప్పులకు ఊరట లభిస్తుంది. కొందరిలో మలవిసర్జన–నీటి విరేచనాలుగా మారవచ్చు లేదా మరికొందరిలో మలబద్ధకం తలెత్తవచ్చు. అలానే ఇంకొందరిలో విరేచనం సాఫీగా కాకపోవడంతో తరచూ వెళ్ళవలసి రావడం వంటి లక్షణాలు కనిపిస్తుంటాయి. త్రేన్పులు రావటం, వికారం, ఛాతీలో మంట, తలనొప్పి, కండరాల నొప్పి మొ॥ ఇతర లక్షణాలు కూడా ఏర్పడవచ్చు.

**నిర్ధారణ పరీక్షలు:** వ్యాధి లక్షణాలను మరియు తీవ్రతను బట్టి, ముఖ్యంగా కడుపునొప్పి లేదా కడుపులో ఇబ్బంది 12 వారాలకు పైగా ఉన్నప్పుడు మరియు ఈ క్రింది వాటిలో ఏవైనా 2 లక్షణాలు కనబడినప్పుడు 'ఐబియస్'ను నిర్ధారించటం జరుగుతుంది.

(1) 'తరచుగా మల విసర్జనకు వెళ్ళాలి' అనిపించటం లేదా మలవిసర్జనలో మార్పులు రావడం – ఉదాహరణకు: రోజుకు 3 సార్లు లేదా అంతకన్నా ఎక్కువ సార్లు నీళ్ళ విరేచనాలు కావడం, మరికొందరిలో మలబద్ధకం ఉండటం, (2) ఆతృతతో మలవిసర్జనకు వెళ్ళడం, విసర్జన అనంతరం ఊరట కలగడం, (3) మలంలో చీము కనిపించడం, (4) కడుపుబ్బరం మొదలగు లక్షణాలను గమనించినప్పుడు ఈ వ్యాధిని నిర్ధారించవచ్చు. 'ఐబియస్'కు ప్రత్యేక నిర్ధారణ పరీక్షలు లేనప్పటికీ వేరే ఇతర రుగ్మతలు ఉన్నాయో లేదో వైద్యుని సలహా మేరకు నిర్ధారించుకోవలసిన అవసరం ఉంది. రక్తహీనత గలవారిలో, కుటుంబ చరిత్రలో గ్యాస్ట్రిక్ సమస్యలు ఉన్నవారిలో, 50 సం॥లు పైబడిన వారిలో బరువు తగ్గడం, మలంలో రక్తం పడటం, కడుపునొప్పి లేదా ముఖ్యంగా మలవిసర్జన తరువాత కూడా ఈ కడుపునొప్పి కొనసాగటం, వికారం, తరచుగా వాంతులు అవటం మొదలగు లక్షణాలనే 'రెడ్ ఫ్లాగ్ సైన్స్' అంటారు. ఈ లక్షణాలు ఉన్నవారు సిగ్మాయిడోస్కోపి, కొలనోస్కోపి, సి.టి.స్కాన్, రక్తపరీక్షలు, లాక్టోజ్ ఇన్‌టాలరెన్స్ టెస్ట్ వంటి పరీక్షలు చేయించుకోవడం మంచిది.

**నివారణ మార్గాలు:** 'ఐబియస్'తో బాధ పడేవారు పీచు పదార్థాలు తరచూ తీసుకోవాలి. ఇవి 2 రకాలు. (1) సహజంగా నీటిలో కరిగేవి. (2) నీటిలో కరగనివి. **కరిగేరకం పీచు:** ఓట్స్, సజ్జలు, కొన్నిరకాల పండ్లు, కూరగాయలలో పీచు ఎక్కువగా ఉంటుంది. ఇవి వీరికి మేలు చేస్తాయి. **కరగని రకం పీచు:** ఇది ముఖ్యంగా గోధుమపొట్టు, మొక్కజొన్న పొట్టు, తౌడు వంటి వాటిలో ఎక్కువగా ఉంటుంది. కావున ఈ పదార్థాలు ఎక్కువగా తీసుకోకపోవడమే మంచిది. క్రమం తప్పకుండా వేళకు భోజనం చేయడం, శరీరానికి సరిపడా మంచినీరు త్రాగటం, ఒత్తిడిని తగ్గించుకోవడం వంటి జాగ్రత్తలతో 'ఐబియస్' వ్యాధిని కొంతవరకు అదుపులో ఉంచవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే 'జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ సిమిలిమం' విధానంలో 'ఐబియస్' సమస్యకు గల మూలకారణాన్ని గుర్తించి, రోగి యొక్క మానసిక, శారీరక స్థితిగతులను మరియు వ్యాధి లక్షణాలను పరిగణనలోకి తీసుకొని చికిత్సను ఇవ్వడం జరుగుతుంది. అంతేకాకుండా పేగుల్లోని క్రమరాహిత్యాన్ని సరిచేసి, మరోసారి తిరగబెట్టని రీతిలో ఈ 'ఐబియస్' సమస్యను సంపూర్ణంగా నయం చేయవచ్చు.




# కౌశికపుత్ర చరిత్ర:ఉగ్రాయుధసంహారం

**పితృగణాలు ఎన్ని? వారు ఏఏ లోకాల్లో నివసిస్తున్నారు? మార్కండేయుడు అడిగిన ప్రశ్నకు సనత్కుమారుడు చెబుతున్నాడిలా. మరీచిమహర్షి పుత్రులు అగ్నిష్వాత్తులు. వీరు వేరొకగణం పితృదేవతలు. వీరిని కూడా దేవతలు భక్తిశ్రద్ధలతో పూజిస్తారు. ఈ గణం పితృదేవతలు దివ్యలోకం సోమమయంలో నివసిస్తున్నారు. వీరి మానస పుత్రిక అచ్ఛోద. అచ్ఛోదసరస్సు ఈమె పేరున ఏర్పడినదే!**

ఒకనాడు తన పితరులు ఎవరూ కనిపించక పోవడంతో అచ్ఛోద ఆందోళన చెందింది. వారిని వెదుకుతూ ఆకాశంలో అప్సరస అద్రికసహా ఉపరిచరవసువు విహరించడాన్ని చూసింది. అతని వైభవానికి విస్తుపోయింది.

ఏ తపస్సు చేసి ఉపరిచరవసువు కుమార్తె కాగలను? అనుకున్నది.

అచ్ఛోద అలా అనుకున్న మరుక్షణం ఆమెలో యోగశక్తి నశించింది. అధోముఖురాలై ఆమె కిందికి పడిపోసాగింది. పడిపోతూ పితృదేవతలను చూసిందప్పుడు. తండ్రులారా! ఆదుకోండి! రక్షించండి అని వేడుకున్నది. ఆదుకున్నారు తండ్రులు. ఆమె పతనాన్ని నిరోధించారు. సంతోషించింది అచ్ఛోద. నమస్కరించి వారి ముందు నిలిచింది. యోగశక్తితో ఆమె భవిష్యత్తును తెలుసుకున్నారు పితృదేవతలు. ఆమెకు వివరించారిలా.

తల్లీ! దేవదానవ మనుష్యలోకాల్లో ఎంతటి వారైనా కర్మఫలం అనుభవించకతప్పదు. నువ్వు ఉపరిచరవసువును తండ్రిగా కోరుకున్నావు. నీ కోరిక తప్పక నెరవేరుతుంది. అయితే ఇరవై ఎనిమిదవ ద్వాపరయుగంలో అద్రిక మత్స్యరూపం ధరించినప్పుడు నీ కోరిక నెరవేరుతుంది. నువ్వు ఆమెకు జన్మిస్తావు. పెరిగి పెద్దదానివై పరాశర తపోనిధిని కూడి ఓ కుమారుణ్ణి కంటావు. ఆ కుమారుడే వేదరాశిని నాలుగు విధాలుగా విభజిస్తాడు. ఆ తర్వాత మహాభిషుడు అనే రాజు శంతనుడుగా అవతరిస్తాడు. అతనిపరంగా నువ్వు చిత్రాంగద, విచిత్రవీర్యులనే ఇద్దరు కుమారులను కంటావు. ముగ్గురుబిడ్డలకు తల్లివి అయినా నీ కన్యత్వానికి ఎలాంటి లోపమూ కలగదు.

తండ్రులు చెప్పినట్టుగానే అచ్ఛోద కొంత కాలానికి భూమిపై జన్మించింది.

విభ్రాజములు అనే పేరుగల తేజోమయ కాలాలలో బర్హిషదులు అన్న పితృదేవతలు నివసిస్తున్నారు. వారు పులస్త్యమహర్షి కుమారులు. మహాధర్మకోవిదులు. వారిని యక్షరక్షో గంధర్వాదులు పూజిస్తారు. ఈ బర్హిషదుల మానస పుత్రిక పీవరి. ఈమె శుకమహర్షిని వివాహం చేసుకుని, కృష్ణుడు, గౌరుడు, ప్రభుడు, శంభుడు, ఋతుడు, జయుడు, భూరి అని ఏడుగురు కుమారులనీ, కీర్తిమతి అని ఒక కుమార్తెనీ కంటుంది. ఈ కీర్తిమతి అణూహుడు అన్న రాజుని వివాహం చేసుకుని, బ్రహ్మదత్తుణ్ణి కంటుంది.

ఇంతవరకూ నీకు పితృదేవతలు వైరాజులు, అగ్నిష్వాత్తులు, బర్హిషదుల గురించి వివరించాను. వీరంతా రూపవిహీనులు. ఇప్పుడు నీకు రూపసహిత పితృదేవతల గురించి చెబుతాను, విను అన్నాడు సనత్కుమారుడు. చెప్పండి అన్నట్టుగా చేతులు జోడించి నమస్కరించాడు మార్కండేయుడు.

జ్యోతిర్భావాలు అనే పేరుతో కొన్ని స్వర్లోకాలు ఉన్నాయి. అక్కడ వసిష్ఠకుమారులు పూరులు అని

> **మూర్తిరహితులు, మూర్తిసహితులైన పితృదేవతల గురించి మార్కండేయునికి సనత్కుమారుడు చెప్పినదంతా ధర్మజునికి వివరించాడు భీష్ముడు. బ్రహ్మదత్తుని వృత్తాంతం కూడా చెప్పనారంభించాడు. తన తండ్రి శంతనుడి పితృకర్మల్లో నిమగ్నమైన సమయంలో రాయబారం ద్వారా భీష్ముణ్ణి ఆగ్రహావేశాలకు గురిచేసే ఆంక్షలు విధించాడు ఉగ్రాయుధుడు. అసలు అతడికంత ఆగ్రహం ఎందుకొచ్చింది? అప్పుడు భీష్ముడు ఏం చేశాడు?**

పితరులు నివసిస్తున్నారు. బ్రాహ్మణులకు వారు పూజ్యనీయులు. గోవ వారి మానసపుత్రిక, శుక్రుని ఇల్లాలై అతని వంశాన్ని వృద్ధి చేసింది. మరీచిగర్భాలనెడి పుణ్యలోకాల్లో అంగిరసుని కుమారులు భాస్వరులన్న పేరిట పితృదేవతలై నివసిస్తున్నారు. వారి ఐశ్వర్యానికి అంతులేదు. క్షత్రియులు ఎక్కువగా వారిని ఆరాధిస్తున్నారు. వారి మానసపుత్రిక యశోద. ఆమె విశ్వమహత్తుకు భార్య అయి, దిలీపుణ్ణి కన్నది. పులహుని కుమారుడు కర్దమునికి వసువులన్న పితరులు జన్మించారు. వారంతా కామదములనే లోకాల్లో నివసిస్తున్నారు. వారిని వైశ్యులు అర్చిస్తున్నారు. వారి మానసపుత్రిక వైద్రాత్రి. ఆమె నహుషుని భార్య అయి, యయాతిని కన్నది. ఇక సుకలులన్న పితృదేవతలు శూద్రులకు పూజ్యనీయులు. మానసాలన్న లోకాల్లో వారు నివసిస్తున్నారు. వారి మానసపుత్రిక రేవానది పురుకుత్సుని భార్య.

అన్ని యుగాల్లోనూ పితృదేవతారాధనం పరమ ప్రశస్తం. దేవునికన్నా పితృదేవతారాధన మిక్కిలి గొప్పది. సుతసంపత్తి, సౌభాగ్యం, జయం, ఆయుర్దాయం, సుఖం, క్షేమం, స్మృతి, విద్య, వినయం, వైరాగ్యం, మృత్యువిజయం, విముక్తి మొదలైన శుభఫలితాలు పితృదేవతలను ఆరాధిస్తేనే లభ్యమవుతాయి.

స్వర్గం కోరి పితరులను అర్చించిన పుణ్యాత్ములు ఇహసౌఖ్యాలన్నిటినీ అనుభవించి, అంత్యకాలంలో మణిమాణిక్యాలతో నిర్మితమైన విమానాలలో ఊర్ధ్వలోకాలు చేరుకుంటున్నారు. అక్కడ అనేక భోగాలు అనుభవిస్తున్నారు. పాడ్యమి నాడు పితరులను పూజిస్తే సువర్ణం లభిస్తుంది. విదియనాడు పూజిస్తే పశుసంపద చేకూరుతుంది అంటూ ఆయా తిథులలో పితరులను పూజిస్తే ఏది లభ్యమయ్యేదీ వివరంగా చెప్పాడు సనత్కుమారుడు.

మూర్తిరహితులు, మూర్తిసహితులు అయిన ఏడుగణాల పితృదేవతలు ఇంద్రాది దేవతలందరికీ ఆరాధ్యులు. ఈ ప్రశస్తి ఏడుదీవుల్లో సప్తర్షి అనే పేరుతో ప్రసిద్ధమైంది. ఇదంతా బ్రహ్మదేవుడే స్వయంగా చెప్పాడు. పితృదేవతలంటే నీకెంతో శ్రద్ధాభక్తులు ఉన్నవని గ్రహించాను. అందుకే నీకిదంతా చెప్పాను. పైగా నేనంటే నీకు విపరీతమైన భక్తిశ్రద్ధలు ఉన్నాయి. అందువల్ల నీకు ఇప్పుడు దివ్యదృష్టి ప్రసాదిస్తున్నాను. దీని ప్రభావంతో నువ్వు సిద్ధమూర్తులైన పితరులందరినీ ప్రత్యక్షంగా చూడగలవు అన్నాడు సనత్కుమారుడు. తర్వాత మళ్ళీ చెప్పాడిలా.

మార్కండేయమునీ! ప్రాచీనయుగంలో భరద్వాజుని కుమారులు ఏడుగురు పరమోత్తమ ధర్మాన్ని చిరకాలం నిర్వర్తించారు. విధివక్రించి వారికి దుశ్చరిత్రపాతిత్యం సంప్రాప్తించింది. దానివల్ల ఎంతకాలం తపస్సు ఆచరించినా వారికి ఫలితం లభించలేదు. దాంతో తీవ్రనైరాశ్యంతో అంతా మరణించారు. పూర్వజన్మభాగ్యం వల్ల స్వర్గలోకం చేరుకున్నారు. చేసిన సుకృతాలఫలితంగా అక్కడ సుఖాలు అనుభవించి, ఇప్పుడు భూలోకంలో కౌశికుడు అనే మునికి పుత్రులుగా జన్మించారు అని ముగిం

చాడు సనత్కుమారుడు. అదృశ్యమయ్యాడు.

ఆ దేవమునితో మాట్లాడుతోంటే ఈ లోకంలో పద్దెనిమిది సంవత్సరాలకాలం ఒక రోజులా గడచిపోయింది. ఆ సమయంలో ఆకలి, దప్పిక, అలసట, నిద్రలాంటివేవీ నన్నంటలేదు. పైగా ఆ మహాముని కరుణాకటాక్షం వల్లనే దివ్యదృష్టితో పాటు, పరిపూర్ణవిజ్ఞానాన్ని నేను సునాయాసంగా అందుకున్నాను. ఆ దివ్యదృష్టితోనే కురుక్షేత్రంలో నివసిస్తున్న కౌశికపుత్రులను నేను చూడగలిగాను. వారిలో ఏడవవాడు, శుకుని కుమార్తె కీర్తిమతి-అణూహులకు బ్రహ్మదత్తుడుగా జన్మించాడు. ఆ బ్రహ్మదత్తుడే కాంపిల్యపురాన్ని పాలించి, మహోత్కృష్టమైన యోగసిద్ధిపొందాడు అని ముగించాడు మార్కండేయుడు. తనకు మార్కండేయుడు చెప్పిందంతా ధర్మరాజుకి చెప్పి, సేదదీరాడు భీష్ముడు.

భీష్ముడు చెప్పిందంతా విని ఆశ్చర్యానందాలతో చేతులు జోడించాడు ధర్మరాజు. భీష్మునికి నమస్కరించాడు. అడిగాడిలా.

మహానుభావా! అణూహుడు ఏ వంశంలో ఏ కాలంలో జన్మించాడు? కౌశికుని ఏడవకుమారుడు బ్రహ్మదత్తుడుగా అణూహునికి ఏ తీరులో జన్మించాడు? మిగిలిన కౌశికపుత్రులు ఏ విధంగా ఉత్తమగతులు పొందారు? ఇవన్నీ దయచేసి నాకు వివరించు.

ధర్మరాజుకి చెప్పసాగాడిలా భీష్ముడు.

పూరువంశంలో పూరుమిత్రుడు జన్మించాడు. అతనికి బృహద్దిషుడు, అతనికి బృహద్ధన్వుడు, అతనికి సత్యకర్ముడు, సత్యజిత్తు జన్మించారు. సత్యజిత్తునికి విశ్వజిత్తు జన్మించాడు. అతనికి సేనజిత్తు జన్మించాడు. సేనజిత్తుకి నలుగురు కుమారులు జన్మించారు. వారు మహాబలవంతులు. వారిలో రుచిరరుడు అద్భుతపరాక్రమశాలి. అతనికి పృథుసేనుడు జన్మించాడు. అతనికి పారుడు, పారునికి నిశుడు జన్మించారు. నిశునికి నూరుగురు కుమారులు జన్మించారు. ఈ నూరుగురూ అతిరథులై గొప్ప ఖ్యాతి గడించారు. వారిలో మహాశూరుడు సమర్థుడు. అతనికి పృథుడు, అతనికి విభ్రాజుడు, అతనికి అణూహుడు జన్మించారు. శుకుని కుమార్తె- అణూహులకు బ్రహ్మదత్తుడు జన్మించాడు.

బ్రహ్మదత్తునికి విష్వక్సేనుడు, అతనికి దండసేనుడు జన్మించారు. ఈ దండసేనుడే కాంపిల్యనగరాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించాడు. దండసేనుని మీదికి ఉగ్రాయుధుడు దండెత్తి వచ్చాడు. భీకరచక్రాయుధంతో ఘోరసమరం సాగించాడు. ఆఖరికి దండసేనుణ్ణేకాదు, అతని వంశాన్నంతటినీ నిర్మూలించాడు. అక్కడితో ఆగలేదతను. మార్గమధ్యంలో తనకు అడ్డుతగిలిన ప్రతి క్షత్రియుణ్ణీ సంహరించాడతను. పరమభయంకరుడై విజృంభించాడు. అదే సమయంలో నా తండ్రి శంతనమహారాజు పరలోకగతుడు కావడంతో నేను అతనికి పితృకర్మలు ఆచరిస్తూ మవునంగా ఉన్నాను. అప్పుడు ఉగ్రాయుధుడు నా దగ్గరికి తన రాయబారిని పంపించి, వాని ముఖతః నాకు ఆదేశించాడిలా. అని ఆగాడు భీష్ముడు. ఆనాటి దృశ్యాలనూ, మాటలనూ గుర్తు చేసుకుంటూ ఆందోళన చెందాడతను. గమనించాడది ధర్మరాజు. కంగారుపడ్డాడు. కాసేపటికి తేరుకున్నాడు భీష్ముడు. చెప్పసాగాడిలా.



ఉగ్రాయుధుడు నాకు ఆదేశించింది ఏమిటంటే...

భీష్మా! నీ సవతితల్లి సత్యవతి ముల్లోకాల్లోనూ మహా అందగత్తె! ఆమెపై నేను మనసుపడ్డాను. నేను మనసుపడ్డ కారణంగా నువ్వు నీ సవతి తల్లిని నాకు అప్పగించాలి. దీనికి నువ్వు అంగీకరిస్తే రాజ్యంసహా నీ మానప్రాణాలు ఉంటాయి. ఒకవేళ నువ్వు అంగీకరించక, యుద్ధానికి సిద్ధమయ్యావనుకో! నిన్ను నేను సంహరించడం ఖాయం.

ఆ మాటలకి నా ఆగ్రహావేశాలు కట్టుతప్పాయి. విచిత్రవీర్యునిసహా ఉగ్రాయుధునిపై యుద్ధానికి సిద్ధమయ్యాను. మంత్రులూ, ఋత్విజులూ, మిత్రులూ నన్ను వారించారు.

భీష్మా! సూతకంతో మైలపడి ఉన్నావు. నువ్విప్పుడు ఆయుధాలేవీ అంటరాదు. దివ్యాస్త్రాల సంగతి ఇక చెప్పనవసరం లేదు. అందుకని ముందు సామదానభేదోపాయాలు ఉపయోగించు. కాలయాపన చెయ్యి. పితృకర్మ పూర్తికానీ! తర్వాత మరీ తప్పదనుకుంటే యుద్ధం చేద్దాగాని అన్నారు. దౌత్యం చేసేందుకు ఉగ్రాయుధుణ్ణి సమీపించారంతా. ఎన్ని విధాలుగా నచ్చజెప్పినా, ఇంకెన్ని విధాలుగా బ్రతిమలాడినా ఉగ్రాయుధుడు విని పించుకోలేదు. పైగా మాపై చక్రాయుధం ప్రయోగించాడు. ముందు ఆ చక్రాయుధం యుగాంతంలో సూర్యునిలా ప్రజ్వరిల్లినా తర్వాత తర్వాత వెలుగులు కోల్పోయి నిప్పుకణికలా మారి చల్లారిపోయింది. దానికి కారణం ఉగ్రాయుధుడు నీతి తప్పి, నా తల్లిని కోరుకోవడమే! ఉగ్రాయుధుడు అది గమనించి, ఆశ్చర్యపోయాడు. అయినా పట్టు వదల్లేదు. ఈలోపు అశౌచదివసాలు గడిచిపోయాయి. పరిశుద్ధుణ్ణై, సైన్యసమేతుణ్ణై ఉగ్రాయుధుణ్ణి ఎదుర్కొన్నాను. మూడురోజులపాటు భీకరంగా యుద్ధం చేశాం. ఆఖరికి నా చేతిలో ఉగ్రాయుధుడు మరణించాడు. మరణించిన మరుక్షణం అతన్ని అంటిపెట్టుకుని ఉన్న సైన్యాలు చెల్లాచెదురయ్యాయి. పారిపోయాయి.

ఉగ్రాయుధుని సంహరణ అనంతరం కాంపిల్యనగరాన్ని రాజ్యభ్రష్టుడై ఉన్న వృషతునికి అప్పగించాను. అతన్ని ఏలుకోమన్నాను. అతడు అహిచ్ఛత్రపురంతో పాటు కాంపిల్యనగరాన్ని కూడా పాలించాడు. అయితే వృషతుని కుమారుడైన ద్రుపదుణ్ణి అర్జునుడు ఓడించి, ఆ పురాలు రెంటినీ ద్రోణాచార్యునికి అప్పగించాడు. ద్రోణాచార్యుడు కాంపిల్యాన్ని మాత్రమే ఉంచుకుని, అహిచ్ఛత్రపురాన్ని ద్రుపదునికి ఇచ్చివేశాడు. అసలు విషయం దారి తప్పింది. నేను నీకు చెప్పాలనుకున్నది వేరు, చెప్పింది వేరు. నీకు నేను చెప్పాలనుకున్నది పితృసమారాధన గురించి. పితృసమారాధన ఫలితంగా కౌశికుని కుమారులు ఏ రకంగా శుభాలు అందుకున్నారన్నది వివరిస్తాను, విను. ఇది నేను మార్కండేయముని దగ్గర తెలుసుకున్నది అన్నాడు భీష్ముడు. చెప్పసాగాడిలా.

-అరణి




# ప్రేమంటే?

**రెండు అక్షరాల పదం ప్రేమ!**
**అది అనిర్వచనీయం..అద్భుతం!**
**ఇద్దరు మనుషుల్ని దగ్గరకు చేర్చేదీ, రెండు మనసులను ఏకం చేసేదీ ప్రేమ!**
**దండలో దారంలా రెండు హృదయాల్ని బంధించి ఉంచుతుంది.**
**ప్రేమ ఉంటే చాలు దేన్నైనా సాధించగలం! ఎలాగైనా బతకగలం!!**

ఇవే టీనేజర్ల చుట్టూ తిరిగే ఆలోచనలు.

రీల్ లైఫ్‌లోనే కాదు రియల్ లైఫ్‌లో కూడా టీనేజ్ ఆలోచనలు ఇలాగే ఉంటాయి. ఎవరైనా కాస్త అందంగా కనిపించారంటే వారి గుండెజారి గల్లంతవుతుంది. ఓరగా ఓచూపు చూసి చిన్న స్మైలిస్తే గుండెల్లో గోదారి పొంగి పొరలుతుంది. అది ప్రేమో, ఆకర్షణో తెలియదు. కానీ మన సారా ప్రేమిస్తారు, అయ్యో కాదు కాదు ప్రేమిస్తున్నామనుకుంటారు. ఎక్కడన్నా ఎవరివైపునుంచైనా చిన్న పొరబాటు జరిగినా లేక ఇద్దరిలో ఒకరు ప్రేమను తిరస్కరించినా ఇక శాడిజం కట్టలు తెంచుకుంటుంది.

అసలు ఇంతకీ ప్రేమంటే ఏంటి? ప్రేమకు, ఆకర్షణకు తేడా ఏంటి? ప్రేమిస్తే ఏంచేయాలి? ఇంట్లో పెద్దవాళ్ళకు చెప్పి ఒప్పించడం కరెక్టా? పారిపోవడం కరెక్టా? ఈ ప్రశ్నలకు సమా



**భావోద్వేగం, సాన్నిహిత్యం, నిబద్ధత ఈ మూడూ మేళవించిన ప్రేమ నిజమైనదనేది సైకాలజిస్ట్ స్టెన్‌బర్గ్ ప్రేమ గురించి వ్యక్తం చేసే అభిప్రాయం. ఈ మూడింటిలో ఏ ఒక్కటి తగ్గినా అది ఆకర్షణే. అందుకే ప్రేమలో రకాలెన్నో ఈ కింద పేర్కొన్నాం. అవి చదువుకుని మీలో ఉన్నది ఆకర్షణా? లేక నిజమైన ప్రేమా? ఎలాంటి ప్రేమ అనేది తేల్చుకోండి!**

## ప్రేమలో రకాలు



**ఇన్‌ఫాచ్యుయేషన్:** అంటే వ్యామోహం. ఒకరు నచ్చితే వారితోనే జీవితం అని ఫీల్ అవుతారు. ఎవరు ఎంత చెప్పినా వినిపించుకోరు, వినరు, చిన్న చిన్న కారణాలతో విడిపోతారు. ఎంతగా విడిపోని బంధం అనుకుంటారో అంతలా విడిపోవడమే దీని లక్షణం.

**వన్ వే లవ్:** ఇష్టపడేవారి గురించి విపరీతంగా ఆలోచిస్తారు. ఎదుటివారిని ఇంప్రెస్ చేయడానికి చేయాల్సిన పనులన్నీ చేస్తారు. చివరికి నిరాశ, నిస్పృహలే వారికి మిగులుతాయి.

**ప్రాక్టికల్ లవ్:** ఒకరంటే మామూలు స్థాయిలో అభిమానం ఉంటుంది. చేసే ప్రతి పనీ ఉపయోగకరంగా ఉంటుందా లేదా అని ఆలోచించే ప్రాక్టికల్ టైప్ వీరిది. నేను చేస్తున్నది కరెక్టేనా? అని పదే పదే చెక్ చేసుకుంటారు. చివరికి భేదాభిప్రాయాలతో విడిపోతారు.

**మిరేజ్ లవ్:** ఎదుటివాళ్ళు ఏం చేసినా మన గురించే అనిపించడం ఈ లవ్ లక్షణం. వారు అందరిలాగే వీరిని ట్రీట్ చేస్తారు. కానీ వీరే ఎక్కువగా ఊహించుకుంటారు. జస్ట్ ఊహాత్మక రిలేషన్‌షిప్. చివరికి పగ, ద్వేషం, తీవ్ర మనస్తాపమే ఇలాంటి వారికి మిగులుతాయి.

### వర్చువల్ రియల్ లవ్

నిజమైన ప్రేమకుండే లక్షణాలివి. ఎదుటివ్యక్తి తమను ప్రేమించినంతగా వీరు ఎదుటి వ్యక్తిని ప్రేమించలేరు. పెళ్ళయ్యాక అన్నీ బాగుంటే ఓకే. తేడా వస్తే విడిపోవడానికి కారణాలు వెతుక్కుంటారు.

**టైమ్‌పాస్ లవ్:** ఈమధ్యకాలంలో ఎక్కువగా కనిపించే లవ్ ఇది. పరస్పరం ఇష్టపడతారు. కానీ డీప్ లవ్ కాదు. ఒకవేళ వెళ్లినా మన స్ఫూర్తిగా పరస్పరం త్యాగం చేసుకునేంత మ్యాటర్ ఉండదు. చివరివరకూ కలిసి ఉండరుగానీ, ఎప్పుడైనా ఎదురుపడితే ఇబ్బంది పడతారు.

**ఇంటర్నెట్ లవ్:** చూసుకోకుండా పుట్టే ప్రేమ! సోషల్ మీడియాలో ఆన్‌లైన్ చాటింగ్‌లో కలిసే పరిచయాలు కేవలం ఉద్వేగభరితాలు. చేదు అనుభవాలు కూడా ఎదురుకావచ్చు.

**బిజినెస్ లవ్:** ఫలానా వారిని ప్రేమిస్తే ఏంటి ఉపయోగం? అని ఆలోచించాక పుట్టే లవ్. కేవలం టీనేజర్లకే కాదు, అన్ని వయసులలోనూ ఇది పుడుతుంది. లాభనష్టాలు బేరీజు వేసుకుని పుట్టే ఈ ప్రేమలో నష్టం వస్తే తెగతెంపులు చేసుకునేవరకూ వెళ్తుంది.

**ఇన్‌స్టంట్ లవ్:** ఆకర్షణీయమైన, అందమైన వ్యక్తులను చూడగానే పుట్టే ప్రేమ. విపరీతమైన భావావేశం, ప్రతిస్పందనలతో ఒక్కసారి మాట్లాడాలని, తాకాలని ఉవ్విళ్లూరే ప్రేమ. దీన్ని ప్రేమ అనేకంటే భావావేశం అనడం కరెక్ట్. ఈ ప్రేమే లైంగిక దాడులకు కారణంగా చెప్తున్నారు. మళ్లీమళ్లీ చూడాలన్న తపనవల్ల తరచూ చూసీ చూసీ ఆకర్షణ తగ్గిపోతుంది. ప్రేమ ఆవిరైపోతుంది.

ధానాలు లేక దొరక్క టెంప్టేషన్‌తో తొందరపాటు నిర్ణయాలు తీసుకుంటారు టీనేజర్లు. ప్రేమించామని ఇంట్లో చెప్పగానే, 'అంతా నీ ఇష్టమేనా ఇలా చేస్తే కుటుంబం పరువేంగాను? అసలు నీకేమైనా భయభక్తులున్నాయా?' అంటూ విరుచుకుపడతారు తల్లిదండ్రులు.

దీంతో ప్రేమను వదులుకోలేక, తల్లిదండ్రులను వీడివెళ్ళలేక సతమతమవుతుంటే, ఎలా నచ్చజెప్పాలో, ఎవరు చెబితే వింటారో, అర్థమవుతుందో తెలియక తల్లిదండ్రులు ఆందోళన పడుతుంటారు. దాంతో సహనం కోల్పోయి ప్రవర్తిస్తుంటారు. ఈ నేపథ్యంలో అసలు ప్రేమంటే ఏంటో ముందు తెలుసుకుందాం!

### ప్రేమంటే?

మనిషిలో ఉండే భయం, కోపం, సెక్సులాంటిదే ప్రేమ కూడా! అది ఒక ఇన్‌స్టింక్ట్ కాదు. మనస్తత్వవేత్తలు దీన్ని సెంటిమెంటుగా పేర్కొంటారు. ఇక్కడ సెంటిమెంటు అంటే ఏంటో అనుకునేరు! ఒక వస్తువు, లేక ఒక వ్యక్తి లేదా ఒక భావం చుట్టూ అల్లుకున్న ఉద్వేగభరిత అనుభూతుల సమూహాన్ని సెంటిమెంటు అనొచ్చు. ప్రేమను రేకెత్తించేందుకు ఫలానా అంశమే కారణమై ఉంటుందనే నిబంధన ఏమీలేదు.

ఒకరు దేశాన్ని ప్రేమించవచ్చు, మరొకరు పిల్లల్ని ప్రేమించవచ్చు, మరొకరు తనకళను, మతాన్ని ఇలా ఏదో ఒకదాన్ని ప్రేమిస్తూ ఉంటారు. మరొకరు తనను తానే ప్రేమించవచ్చు. ఇలా ప్రేమ ఆయా వ్యక్తులను బట్టి దేనిచుట్టూనైనా అల్లుకునే అవకాశం ఉంటుంది.

### అందాల హరివిల్లు!

ఒక వ్యక్తిలో ఉండే లాలిత్యం, మర్యాద, మెచ్చుకోలు, గర్వం, భక్తి, స్నేహం, ప్రేమ, సెక్స్, కాపాడేతత్వం ఇలాంటి భావావేశాలన్నీ ప్రేమోద్వేగ రూపాలనే చెప్పవచ్చు. సెక్స్ అనేది ప్రేమ తాలూకు ఒక మధురిమేతప్ప ప్రేమకు మరో రూపం కాదు.

మనిషి వ్యక్తిత్వానికి పరిపూర్ణత సిద్ధించాలంటే ప్రేమకు సంబంధించిన ఈ లక్షణాలన్నీ పక్వం చెందాలి. ఈలక్షణాలన్నీ టీనేజ్ వయసులో ఒకటితర్వాత ఒకటి పిల్లలమనసులో రాజ్యమేలుతుంటాయి. ఒక లక్షణం పిల్లవాడి మనస్సును లొంగదీసుకున్నప్పుడు దాని ప్రభావం అతడిమీద తీవ్రంగా ఉంటుంది. ఆ భావజాల తీవ్రతలో, ఆ సుడిగాలిలో అతడు దాదాపు కొట్టుకుపోతుంటాడు.

దాంతో ఏం చేయాలో తోచక ఎటువైపు మళ్లాలో తెలియక ఊగిసలాడుతూ ఉంటాడు. ఈ లక్షణం తాలూకు మంచీచెడూ తెలిసిన తర్వాత ఆ తీవ్రత జీరోస్థాయికి చేరుకుంటుంది. ఆ స్థానాన్ని మరో లక్షణం భర్తీచేస్తుంది. అలా ఆయా లక్షణాలన్నీ ఒకదాని తర్వాత మరొకటి ఒంటబడతాయి. ఈ విధంగా అవన్నీ అబ్బుతాయి. టీనేజర్ వ్యక్తిత్వం పరిపూర్ణస్థితికి చేరుకుంటుంది. కేవలం మగపిల్లలనేకాదు ఆడపిల్లల విషయంలో కూడా ఇదే ప్రక్రియ కొనసాగుతుంది.

ప్రేమ తాలూకు ఉద్వేగం ఒక్కొక్కటీ ఒక్కోలా ఉంటుంది. ఈ దశలో అసలైన ప్రేమ ఎలా ఉంటుంది? కేవలం వాంఛతో కూడిన ప్రేమ ఎలా ఉంటుంది? దాన్ని గుర్తించడం ఎలా? టీనేజర్లలో ఏర్పడే ప్రేమతాలూకు టెంప్టేషన్స్ పరిష్కరించడం ఎలా? వంటి అంశాల్ని ముందు ముందు తెలుసుకుందాం!

**- లతాకమలం**

lathakamalam@gmail.com



## ప్రేమికుల దినోత్సవం

నిర్వచనానికి దొరకని చిన్నపదం రెండక్షరాల ప్రేమ. మనిషిని స్థాయిని, పరిసరాలను బట్టి వ్యక్తీకరణలో చిన్నపాటి తేడాలుంటాయేమోగానీ ప్రేమలేని జీవితం ఉండదు. అందుకే ప్రేమ అనే పదం వింటే చాలు ఎటువంటి మనసులోనైనా ఏదో అలజడి మొదలుకాక మానదు. ఫిబ్రవరి 14 వస్తుందంటే చాలు, ప్రేమికులు సంబరంగా ఫీలవుతుంటారు. ఆ రోజు ఎలా సెలబ్రేట్ చేసుకోవాలా అని నెల రోజుల ముందు నుంచే ప్లాన్ చేస్తారు. నలుగురికీ ప్రేమ పంచుతూ, ప్రేమ ఆస్వాదిస్తూ జీవితాన్ని ప్రేమమయం చేసుకున్న జంటలూ ఉన్నట్టే కళ్ళతో పలకరిస్తూ కాఫీడేలో మాట్లాడుకుని, పబ్‌లో హగ్ చేసుకుని, అర్ధరాత్రి దాటాక సారీ డియర్ నువ్వు నాకు సెట్‌కావు అనేసి వెళ్ళిపోయే ప్రేమజంటలూ ఉన్నాయి. పాశ్చాత్య దేశాలలో రకరకాలపేర్లు పెట్టి వారం రోజుల పాటు ప్రేమికులరోజు జరుపుకున్నా మనదేశంలో మాత్రం ఒక్క ఫిబ్రవరి 14న వాలెంటైన్స్ డే జరుపుకోవడానికి మాత్రమే యువత ఆసక్తి కనబరుస్తున్నారు.

ప్రేమికులకు ప్రత్యేకరోజుగా చెప్పుకునే వాలెంటైన్స్ డే సెలబ్రేషన్స్ వెనక ఇప్పటి వరకు కచ్చితమైన సమాచారం ఏదీ ఉన్నట్టు తెలియదు. వీటిల్లో పలు కథనాలు ప్రచారంలో ఉన్నాయి. వాటిల్లో ముఖ్యంగా చాలా ఎక్కువ ప్రాచుర్యం వాలెంటైన్ కథనానికే ఉంది.

మూడో దశాబ్దంనాటి రోమ్ సామ్రాజ్యంలో వాలెంటైన్ అనే పేరుగల ఒక క్రైస్తవ సన్యాసి ఉండేవారు. వివాహితులతో పోలిస్తే అవివాహితులే సైనికులుగా బాగా పనిచేస్తారని అప్పటి క్లాడియస్-2 చక్రవర్తి భావించాడు. దాంతో యువకులు పెళ్ళిళ్ళు చేసుకోరాదనే ఆంక్షలు విధించాడు చక్రవర్తి. వాలెంటైన్ సన్యాసికి ఇది అన్యాయంగా తోచింది. రహస్యంగా యువకులకు పెళ్ళిళ్ళు చేయించడం మొదలుపెట్టాడు వాలెంటైన్. క్లాడియస్‌కు ఈ విషయం తెలిసింది. చక్రవర్తి ఆదేశాలు ధిక్కరించినందుకు వాలెంటైన్‌కు మరణశిక్ష అమలు చేశారు. అతను జైలు నిర్బంధంలో ఉండగా తన కుమార్తెకు రాసిన ఒక లేఖలో చివర్న 'నీ వాలెంటైన్' అని రాసి ఉరికంబానికి ఎక్కుతాడు.

మరో కథనం ప్రకారం, వాలెంటైన్ ఒక రోజు జైలర్ కుమార్తెను చూసి మనసు పారేసుకుంటాడు. తనకు ఉరిశిక్ష అమలుచేసే ముందు ఆమెకు ఓలేఖ రాసి అందులో 'నీ వాలెంటైన్' అని ముగిస్తాడు. ఇలా మరికొన్ని కథనాలు కూడా ప్రచారంలో ఉన్నాయి. వాలెంటైన్ చనిపోయిన రోజు కూడా ఫిబ్రవరి 14 కాదు కనీసం ఆరోజు అతని పుట్టినరోజు కూడా కాదు.



మరోవైపు సంతానం కోసం జట్టుకట్టడానికి ఫిబ్రవరి నెల అనువైనదిగా వెనకటి రోమన్ చక్రవర్తులు భావించినట్లు చెబుతారు. అలా సంతానం కోసం జట్టుకట్టేందుకు ఒకరోజు నిర్ణయించారని కూడా అంటారు.

ఐదవ శతాబ్దంలో పోప్ గెలాసియస్ ఫిబ్రవరి 14వ తేదీని అధికారికంగా వాలెంటైన్స్ డే ప్రకటించారు. ఆ తర్వాత దీన్ని పెద్దగా జరుపుకున్నట్లు లేదు. మరీ ముఖ్యంగా 20వ శతాబ్దంలోనే వాలెంటైన్స్ డే బాగా ప్రాచుర్యం పొందింది.

# అదృష్టానికి అడుగు దూరం

## -బోయినపల్లి వెంకటేశ్వరరావు

**సాయంత్రం నీరెండకిరణాలుపడి హుస్సేన్‌సాగర్‌లో నీళ్ళు తళతళ మెరుస్తున్నాయి. పరుగులిడుతూ తీరంవరకు వచ్చినకెరటం మళ్ళీ నీళ్ళలోనే కలిసిపోతోంది. టాంక్‌బండ్‌పై నిలబడి తదేకంగా నీళ్ళవైపు చూస్తున్న సుధాకర్ పెదవులపై విరక్తితో నిండిన చిరునవ్వు కదిలింది. ఏదో సాధించాలని ఉవ్వెత్తునలేచే కెరటం మళ్ళీ అంతలోనే ప్రవహించే నీటిలోనే కలిసిపోతోంది. అందుకే అంటారు, వ్యక్తిజీవితానికి వాహినికి దగ్గర సంబంధం ఉన్నదని. ఎగిసిపడే ప్రతికెరటం తీరం చేరుకోనట్టే, మనిషి జీవనవాహినిలో ఆశలు ఆశయాలు సంతోషం, దుఃఖం.. ఇలా అనేక కెరటాలులేచి మళ్ళీ అంతలోనే పడిపోతూ ఉంటాయి. కొద్దిమంది జీవితాల్లో మాత్రమే ఆ కలలకెరటాలు సురక్షితంగా తీరం చేరుతూ ఉంటాయి.**

తన బ్రతుకులోమాత్రం ఎప్పుడూ నిరాశ నిస్పృహల తరంగాలు జీవననౌకను ముంచేస్తూనే ఉన్నాయి. అట్టడుగువరకు వెళ్ళి ఆటుపోట్లు ఎదుర్కొంటూ మళ్ళీ పైకితేలుతూ జీవనకడలిలో బ్రతుకునౌక ప్రయాణిస్తూ వస్తుంది.

సుధాకర్ చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయాడు. ఇంటికి తనే పెద్దదిక్కు. తల్లి, ఇద్దరు తమ్ముళ్ళు, చెల్లెల్ని సుధాకర్ చేతిలోపెట్టి కన్నుమూశాడు. అప్పటికి సుధాకర్ స్కూల్ ఫైనల్ పాసయ్యాడు.

తండ్రి హఠాన్మరణంతో సుధాకర్ కుటుంబ పరిస్థితులు తలకిందులయ్యాయి. తల్లి సీతమ్మ ఎంతో కష్టపడి కూలీనాలీ చేస్తూ పిల్లల్ని పోషిస్తూ వస్తోంది. పిల్లలందరికీ సరైన తిండిబట్టా లేకున్నా పెద్దవాడు సుధాకర్‌ను కాలేజీలో చేర్పించింది. ఆ విధంగా తల్లికష్టంతో సుధాకర్ ఎం.ఏ. ఫస్టు క్లాసులో ఉత్తీర్ణుడయ్యాడు. ఎం.ఏ. పూర్తయ్యేనాటికి ఇంటి పరిస్థితులు మరీ అధ్వానంగా తయారయ్యాయి.

చదివించే స్తోమత లేకపోవడంతో, తల్లితో పాటే ఏదోఒక కూలిపనికెళుతూ పదోపాతికో సంపాదిస్తూ సంసార రథాన్ని భారంగా లాక్కునివచ్చే తోబుట్టువులను చూస్తుంటే సుధాకర్ మనసు విలవిలలాడిపోతోంది. తను ఈ రోజు పోస్ట్ గ్రాడ్యుయేట్ అయ్యాడంటే తనవాళ్ళ నిరంతర శ్రమేనని సుధాకర్‌కు తెలుసు. తనమీద ఎన్నో ఆశలు పెట్టుకుని తమ జీవితాలు త్యాగంచేసి తనను చదివించారు. చదువు పూర్తయ్యాక తనకు మంచి ఉద్యోగం వస్తుందని అప్పటివరకు పడిన కష్టాలన్నీ గట్టెక్కుతాయని తనవాళ్ళు ఎంతగానో ఆశిస్తున్నారు. తనూ అలాగే అనుకుంటున్నాడు. తనకు ఉద్యోగం వస్తే చెల్లెలికి మంచి సంబంధం చూసి పెళ్ళి చెయ్యాలనీ, తమ్ముళ్ళకు మంచి భవిష్యత్తు ఏర్పరచాలనీ చాలా ఆశలు పెట్టుకున్నాడు. కానీ కాలేజీ ఆవరణ దాటి జీవనసమరంలోకి అడుగుపెట్టిన సుధాకర్‌కు, ఉద్యోగం సంపాదించడం అనుకున్నంత సులభం కాదన్న చేదునిజం అర్థం కావడానికి ఎంతోకాలం పట్టలేదు. ఊహలకు, వాస్తవాలకు మధ్య జీవన పోరాటంతోనే ఆరుసంవత్సరాలు గడిచాయి.

ఈ ఆరేళ్ళలో సుధాకర్ ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదు. ఘోర తపస్సు చేసిన భక్తుడికి భగవంతుడు ప్రత్యక్షమవుతాడేమోగాని ఎంత ప్రయత్నించినా ఎన్ని అర్హతలున్నా ఒక ప్రభుత్వ ఉద్యోగం సంపాదించడం గగనమైపోతోంది. ఏదైనా ఇంటర్వ్యూకి వెళితే, అది నామమాత్రమేననీ, అప్పటికే ఆ ఉద్యోగం 'ఉత్తర దక్షిణాలు' సమర్పించుకున్న అభ్యర్థికి వచ్చిందన్న విషయం తరువాత గాని తెలియదు.

ఉద్యోగవేటలో తిరిగితిరిగి అలసిపోతున్న సుధాకర్ రోజు రోజుకు నిరాశ నిస్పృహలతో కృశించిపోతున్నాడు. కుటుంబసభ్యులు చెమటోడ్చి తెచ్చిపెడుతుంటే సుధాకర్‌కు విషం తిన్నంత నరకప్రాయంగా ఉన్నది.

ఒకరోజు తల్లితో అన్నాడు. "అమ్మా ఇక ఉద్యోగం కోసం తిరగలేను. మీతోపాటు నేను కూడా కూలిపనికి వస్తాను" కొడుకు గొంతులోంచి వచ్చిన ఆ మాటల్లో అంతులేని ఆవేదన, జీవితంలో రాజీకివస్తున్న నైరాశ్యం తొంగి చూసింది.

ఒక్కక్షణం కొడుకు ముఖంలోకి ఆర్ద్రతతో చూసింది సీతమ్మ. ఆప్యాయంగా కొడుకు తల నిమిరి, "పిచ్చి తండ్రీ, ఇంత చదువు చదివి కూలి పని చేస్తావా? ఇందుకా నిన్ను మేమంతా కష్టపడి చదివించింది. ఉద్యోగం ఈరోజు కాకపోతే మరో నాలుగురోజులు గడిచిన తరువాతైనా వస్తుంది. దేనికైనా కాలం కలిసిరావాలి. జీవితంలో ఎప్పుడూ కష్టాలే ఉండవు! చీకటి తరువాత వెన్నెల తప్పకవస్తుంది. ఓర్పును మించింది ఏదీలేదు" తల్లి ముఖంలో నమ్మకాన్ని చూడలేకపోయాడు సుధాకర్. పిచ్చి అమ్మ మనుషులమీద, వారి నిజాయితీమీద ఎంత నమ్మకం!

తరాలు మారుతున్న కొద్దీ మనుషుల్లో మానవత్వం, నిజాయితీ, ఇతరులపట్ల దయాగుణం సన్నగిల్లిపోతున్నాయి. మనిషిలోని ఈ భావాలన్నింటినీ డబ్బు డామినేట్ చేస్తోంది.

నేటి విద్యార్థి వ్యవస్థ ఎంత అస్తవ్యస్తంగా ఉన్నదో విద్యార్థి దశనుండి బైటకువచ్చిన నిరుద్యోగి జీవితం అంతకు రెట్టింపు అయోమయంగా, నిరాశాజనకంగా ఉంది. ఎక్కడో ఎవరికోతప్ప ఉన్నతాధికారుల్లోకూడా చిత్తశుద్ధి, న్యాయదృష్టి అడుగంటిపోయింది. వాటి స్థానంలో స్వార్థం సంకుచిత ధోరణి ప్రబలిపోతున్నాయి.

సుధాకర్ ఉద్యోగవేటలో మరో ఆరునెలలు గడిచాయి. అతడు కన్న కలలన్నీ కల్లలు కావడంతో అతడిలో చాలా ఆవేశం పెరిగింది. తనలాంటి విద్యాధికులకు ఉపాధి కల్పించలేని ఈ ప్రభుత్వాలమీద, తన ఆశలు వమ్ముచేసిన వ్యవస్థమీద, ఏ మాత్రం సహాయ పడకపోగా హేళన, వ్యంగ్యంతో గాయపరచే సమాజంమీద ఎంతో కసిగా ఉంది. తనలాంటి నిర్భాగ్యులు, నిస్సహా



యలు ఈ కుళ్ళువ్యవస్థను ఏమీ చేయలేరు. ఎంతమాత్రం మార్చలేరు. ఈ లోకంలో నీతి, న్యాయం, ధర్మం, మంచితనం అనే బీజాలు మట్టిలో కలిసిపోగా అక్రమం, అన్యాయం, అవినీతి, దుర్మార్గం అనే మొక్కలు రోజురోజుకు ఏపుగాపెరిగి మహావృక్షాలుగా మారుతున్నాయి. ఈ వృక్షాలను సమూలంగా నరికివేయడం ఎవరికీ సాధ్యం కాదు. ఈ విషవృక్షాల పెనుగాలి తాకిడికి ఎంతోమంది జీవితాలు కొట్టుకుపోయి అగాధంలో పడిపోతున్నాయి. ఈ విధంగా ఎన్నాళ్ళు? చదువుకుని తమ బ్రతుకులు ఆనందంగా గడచిపోతాయని ఆశించి చివరకు ఏమీ పొందలేక జీవితంలో ఏదీ సాధించలేక కృశించి పోవడమేనా ఈ చదువుల పరామార్థం? చదువుకున్నారన్న నెపంతో కూలి పనైనా ఇవ్వని యజమానులు, ఇటు ఉద్యోగాలివ్వని ప్రభుత్వాలు రెంటికీ చెడిన రేవడిలా మారిన తనలాంటి నిరాశావాదుల జీవితాలకు గమ్యం ఏది? ఎటువైపు సాగాలి?

టాంక్‌బండ్‌పై నిలబడిన సుధాకర్ అంతరంగంలో ఎన్నో సుడిగుండాలు చెలరేగుతున్నాయి. దాహంవేసిన వ్యక్తి నీటికోసం ఎండమావులవెంట పరుగెత్తినట్టుంది అతని మస్తిష్కం. ఏదో చేయాలన్న తపన, ఏదీ చేయలేని నిస్సహాయం, ద్వైదీభావం. ఎన్నాళ్లీ బ్రతుకు? ఇక తనవల్ల కాదు.

వారం రోజులక్రితం ఇంటర్వ్యూకు కాల్‌లెటర్ వస్తే వెళ్ళాడు సుధాకర్. అధికారులు అడిగే ప్రశ్నలు ఆ ఉద్యోగానికి సంబంధం లేనివీ, మరికొన్ని సంబంధించినవీ! అసహనంతో అంతరంగం కుతకుతలాడుతున్నా, పైకిమాత్రం శాంతంగా జవాబులు చెప్పాడు సుధాకర్.

**ఇంటికి పెద్దకొడుకు అతను. తండ్రి హఠాన్మరణంతో తల్లి, తోబుట్టువులు కూలీనాలీచేస్తూ అతన్ని పోస్ట్‌గ్రాడ్యుయేషన్ వరకు చదివించారు. బాహ్య ప్రపంచంలోకి అడుగుపెట్టగానే తెలిసిందతనికి, ఉద్యోగం సంపాదించడం అంత తేలికేంకాదని! ఎంతోమంది నిరుద్యోగుల్లానే అతడూను. ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఆరేళ్ళు గడిచిపోయాయి. చదువుకున్నవాడు కదా, కూలి పనికి కూడా అర్హత లేకపోయిందతనికి! మరేం చేశాడు?**

"మీరు వెళ్ళండి, సెలక్ట్ అయితే ఆర్డర్స్ పంపిస్తాం" అన్నారు అధికారులు. నిర్జీవంగా నవ్వి బైటకువచ్చాడు సుధాకర్. ఇంటర్వ్యూల్లో ఇలాంటిమాటలు వినడం నిరుద్యోగులకు అలవాటే. ఉద్యోగం వస్తుందన్న ఆశ తన కుటుంబ సభ్యులలో కూడా కొరవడింది.

ఆ రోజు ఇంటర్వ్యూనుండి ఇంటికిరాగానే తల్లి అడిగింది. "ఏమైందిరా?" ఆ కంఠంలో ఇదివరకు ఉన్న నమ్మకం, ఆశ మచ్చుకైనా లేవు.

"ఏమౌతుంది? ఈయనకు ఉద్యోగం వస్తుందన్న ఆశ నీకు ఇంకా ఉందా అమ్మా?" అన్నాడు తమ్ముడు, తల్లివైపు చురచుర చూస్తూ. అన్నయ్య అంటే తోబుట్టువులకు మొదట్లో ఎంతో అభిమానం ఉండేది. తనవల్ల వారి జీవితాలు చక్కబడతాయనే నమ్మకం వాళ్ళల్లో ఉండేది. కానీ తనకు ఉద్యోగం రాకపోవడం, తనవాళ్ళు తనపై పెట్టుకున్న ఆశలు చెల్లాచెదురైపోవడంతో తనంటే చులకనభావం ఏర్పడింది. 'నీవల్ల మా జీవితాలేమీ బాగుపడవు. మేం కష్టపడి తెచ్చిపెడు




అలాగని పెద్ద బాధా కాదూ
అదేం లేదని తీసి పారేసేదీ కాదు
నదీ తీరాన నీటికీ ఒడ్డుకీ నడుమ
అసహనంగా తిరుగాడే
పొట్టికాళ్ళ నీటి పక్షిలా
వెంటాడుతూ వచ్చే మెలకువో

## తారాస్థాయి

గడియపడని తలుపుల వెనుక
సుప్తచేతనమో... ఏమో!
ఈ దిశ నేనుంటే ఆకొసన కన్ను గీటుతూ...
కమ్మని పరిమళ తుపాను అలల ఒంపులపై
వేదనా తరంగ సారంగిలా
వెదురులాంటి వెలితి దేహంలోకి
మోహనంగా వచ్చిచేరే మురళీ స్వనంలా
ఒంటరి పట్టాల దిగులు నిర్వేదంపై
దయగా వాలే వెన్నెల కాంతిలా
గాజుకుప్పె బిరడా పొడిచి
ప్రాణవాయువును కానుకిచ్చే వెలుతురు పిట్టలా
శీతకాలపు ఊదారంగు గాలులు ఒంపే
వయొలిన్ రాగాల దుఃఖపు జీరలా
బతుకు చీలికల కూర్పును
పెనవేసుకునే చిలకాకు పచ్చదనంలా
దృశ్యం మారుతుంది. ధోరణి మారుతుంది
పలువన్నెల హోళీ చివరకు మిగిల్చేది
ఏకవర్ణ దేహళి
ఏ ఋతువు పాటైనా సందేశం ఒక్కటే
బిసజ పత్రజల బిందుతత్వం
లెక్క కుదరక విసిగి ఉన్నప్పుడు
మిత్రుడన్నాడు



చీకటి తెరలు తొలగి
నిర్మలాకాశ దిశగా సాగే
పరిణామ పరిపక్వ ప్రక్రియ ఇది
ఇక తూర్పులోగిలిలో నువ్వు పోగొట్టుకున్న
నవజాత శిశు దరహాసం వచ్చి చేరుతుంది
త్వరలోనే నీలో అస్తమించని
సూర్యుడొకడు ఉదయించబోతున్నాడని.

-శారద ఆవాల
సెల్: 92956 01447

తుంటే దర్జాగాతింటూ ఉద్యోగం వంకతో ఊరు మీదపడి తిరుగుతున్నావు' అని శూలాల్లాంటి మాటలతో తన మనసును ముక్కలు చేయ సాగారు. తనకంటే చిన్నవయసులోవాళ్ళు తోబుట్టువులతో మాటలుపడటంతో సుధాకర్‌కు జీవితం దుర్భరం అనిపించసాగింది. కుటుంబ సభ్యులు తనను ఆదరించడం లేదు. ఇంటిలో తను అనవసరమైన వ్యక్తిగా భావిస్తున్నారు. కానీ సంపాదన లేదు. ఏ కూలిపని చేయడానికి కూడా తన డిగ్రీలే అడ్డుపడుతున్నాయి. ఎలా? ఏం చేయాలి? ఇక తనముఖం ఇంట్లో చూపించలేడు. ఈరోజు ఉదయం తనవాళ్ళు తనపై తీవ్రంగా మండి పడ్డారు. ఆ ఆవేశంలో టాంక్‌బండ్‌వద్దకు వచ్చిన సుధాకర్‌లో రోజంతా మానసిక సంఘర్షణ. అంతర్మథనంలో ఎన్నో భావాలు. అప్పుడే సుధాకర్‌కు 'తను ఈ నీళ్ళలోకిదూకి ఆత్మహత్య చేసుకుంటే...' అనే ఆలోచన వచ్చింది. తన ఆలోచనకు తనే మనస్సులో హాయిగా నవ్వుకున్నాడు. మరణించాలనుకుంటే ఏ రకంగానైనా మరణించ వచ్చు.

ప్రపంచంలో బ్రతికేమార్గం దొరక్కపోయినా, మరణించేందుకు ఎన్నో మార్గాలున్నాయి. జీవితంలో అన్నివిధాల ఓడిపోయిన నిర్భాగ్యులకు ఆ మార్గాలన్నీ వరాలుగా మారిన శాపాలేమో?

అర్థరాత్రి వరకు సుధాకర్ అలాగే నిలబడి పోయాడు. 'నీకు బ్రతుకులో కంటే చావులోనే సుఖశాంతులు లభిస్తాయి' అని మనసు పదే పదే హెచ్చరించసాగింది. ఆలోచనల్లోంచి బైట పడి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆఖరిసారిగా పరిసరాలు చూశాడు. 'ఈ' రోజుతో ఈ లోకం నుండి విముక్తి' అనుకుని నీళ్ళలోకి దూకేశాడు. విద్యాధికుడు, అపారమైన తెలివితేటలున్నవాడు, వృద్ధిలోకి రావలసిన సుధాకర్‌ని హుస్సేన్‌సాగర్ జలాలు ఆత్రంగా తనగర్భంలో చేర్చుకున్నాయి.

'నిరుద్యోగి ఆత్మహత్య' మర్నాడు దినపత్రికల్లో వార్త వచ్చింది. పోస్టుమార్టం తరువాత సుధాకర్ శవాన్ని ఇంటికి తీసుకువచ్చారు. సుధాకర్ కుటుంబ సభ్యులు అతనిశవంపై పడి విలపించసాగారు. చుట్టుపక్కల జనం గుమిగూడారు. సుధాకర్ మరణంపై తలోరకంగా వ్యాఖ్యానం చేస్తున్నారు.

ఒక గంట గడిచింది. పోస్ట్‌మాన్ సుధాకర్ అడ్రసుకు ఒక కవరు తెచ్చి ఇచ్చాడు. అక్కడే ఉన్న సుధాకర్ స్నేహితుడు కవరుతీసి చించి చదివాడు. వారంరోజుల క్రితం ఒక ప్రభుత్వ ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వెళ్ళిన సుధాకర్ ఆ ఉద్యోగానికి సెలక్టయ్యాడు. వెంటనే ఉద్యోగంలో చేరాలని ఆ శాఖాధికారులు పంపిన అపాయింట్‌మెంట్ ఆర్డర్ అది.

అక్కడ గుమిగూడిన జనం విషయం తెలుసుకుని చెమర్చిన కళ్ళతో సుధాకర్ మృతదేహాన్నే చూశారు. ఎన్నాళ్ళుగానో, ఎన్నేళ్ళుగానో ఎదురు చూసి భంగపడిన సుధాకర్ ఇక జీవితంతో పోరాడే శక్తిలేక తనకు ఈ జన్మలో ఉద్యోగం రాదని నిర్ధారించుకుని ఈ లోకంనుండి వెళ్ళి పోయాడు. తన దేహం పక్కనే పడి ఉన్న ఉద్యోగ నియామక ఉత్తర్వులు చూడలేనంత సుదూరతీరాలకు వెళ్ళిపోయాడు. మంచిరోజులు వస్తాయన్న నమ్మకంతో బ్రతుకుబాటలో కష్టాల ముళ్ళ పొదలు, నిరాశనిస్పృహల మిట్టపల్లాలను దురదృష్టం, అపజయం, అవమానం అనే మలుపులను ఎంతో సహనంతో దాటివచ్చాడు. తీరా అదృష్టం అనే మలుపుకు అడుగుదూరం చేరువగా వచ్చి ఇక అక్కడితో ఆగిపోయాడు. ముందుకు సాగే సహనం, ధైర్యం లేక జీవితాన్ని అంతం చేసుకున్నాడు. కానీ లోకంలో అక్కడక్కడా ఇంకా నీతినిజాయితీ, మంచితనం మిగిలే ఉన్నాయనీ, ప్రతిభ, అర్హతలకు విలువిచ్చే మానవత్వం నిండిన ఉన్నతాధికారులు ఇంకా సమాజంలో మిగిలే ఉన్నారని ఏ మాత్రం గ్రహించగలిగినా మరణాన్ని వాయిదా వేసుకునేవాడు సుధాకర్. అతడి జీవితం ఇలా అర్థాంతరంగా ముగిసేదే కాదు.

సెల్: 98482 05441



# హార్మోన్ సమస్యలు

మనిషి జీవించడానికి శ్వాస ఎంత ముఖ్యమో మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోన్లు అంతే ముఖ్యం. గర్భాశయంలో పిండంగా ఏర్పడినప్పటి నుంచి మనిషి కాలం తీరేంతవరకు శరీరము మీద హార్మోన్ల ప్రభావం కలిగి ఉంటుంది. శరీరంలోని ఒక కణము నుండి మరొక కణంకు రసాయనిక సమాచారం అందజేయబడి, సంకేతంను తెలిపే కెమికల్స్‌ను హార్మోన్లు అంటారు. మెదడు భాగంలోని హైపోథలామస్ మరియు పిట్యూటరిగ్రంథి హార్మోన్ల ఉత్పత్తికి దోహదపడి శరీరంలోని కణాల క్రమబద్ధనకు ప్రాముఖ్యత వహించును. ఈ హార్మోన్లు శరీర ఉష్ణోగ్రతను, ఆకలిని, మానసిక స్థితిని, నిద్రను, దాహము, కామక్రోధమును అదుపులో వుంచుతాయి. ఈ మధ్య కాలంలో హైపోథైరాయిడ్, పి.సి.ఒ.డి, సంతానలేమి, డయాబెటీస్ వంటి దీర్ఘకాలిక జబ్బు లన్ని హార్మోన్ అసమతూల్యత వల్ల వచ్చేవే. చాలా రకాల హార్మోన్లు మన శరీరాన్ని ప్రభావితం చేస్తాయి. హార్మోన్లు పాలిపెప్టైడ్‌తో నిర్మితమైన రసాయన వాహకాలు. ఇవి శరీరంలో ఒక ప్రాంత కణజాలం.. అవయువాల నుంచి ఉత్పత్తిఅయి, వివిధ శరీర భాగాల కు రక్తం ద్వారా ప్రవహించి నిర్దిష్ట అవయువాన్ని ప్రభావితం చేసి జీవప్రక్రియల సమతుల్యతకు తోడ్పడ తాయి. ఈ హార్మోన్ల సమతూల్యం దెబ్బతిన్నప్పుడు దీర్ఘకాలిక వ్యాధులు బారిన పడతారు. ఈ హార్మోన్లు ఎండోక్రైన్, ఎక్సోక్రైన్ గ్రంథుల నుంచి ఉత్పత్తి అవుతాయి. శరీరంలో ఇవి సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ, శారీరక, మానసిక ఎదుగుదల, మానసిక సమతూల్యత జీవక్రియలకు తోడ్పడతాయి. థైరాయిడ్ హార్మోన్లు టీ3, టీ4 ఇవి థైరాయిడ్ గ్రంథి నుంచి ఉత్పన్నమవుతాయి. వీటి అసమతూల్యత వల్ల హైపో థైరాయిడ్, హైపర్ థైరాయిడ్, గాయిటర్ అనే దీర్ఘకాలిక జబ్బులు వస్తాయి.

**స్త్రీలలో హార్మోన్స్ సమస్యలు:** ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, ప్రోలాక్టిన్, ఆక్సిటోసిన్ హార్మోన్లు స్త్రీలలో నెలసరి, ద్వితియ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి, ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్లు అసమతూల్యత వల్ల స్త్రీలలో నెలసరి సమస్యలు, అవాంఛిత రోమాలు, సంతానలేమి సమస్యలు వస్తాయి. స్త్రీలలో మెనోఫాజ్, నెలసరి వచ్చే సమయంలో హార్మోన్ల హెచ్చు తగ్గుల వల్ల వేడి ఆవిర్లు, మానసిక అశాంతి, నీరసం, కీళ్లనొప్పులు వస్తాయి.

**పురుషుల్లో హార్మోన్స్‌సమస్యలు:** మగవారిలో ముఖ్యంగా టెస్టోస్టిరాన్ అనే హార్మోన్ ఉత్పత్తి అయి ఎముకల సాంద్రతకు, కండరాల పటుత్వానికీ, వీర్య కణాల వృద్ధికి ఉపయోగపడుతుంది. ఈ టెస్టోస్టిరాన్ లోపం వలన సెక్స్‌ప్రాబ్లమ్స్, కండరాల పటుత్వం తగ్గిపోవటం, డిప్రెషన్, టైప్2 డయాబెటీస్ అంతే కాక ఎల్.హెచ్ & ఎఫ్.యస్.హెచ్ డెఫిసియెన్సీ వలన హైపోగోనాడిజమ్ వచ్చేఅవకాశం ఉంది.టెస్టోస్టిరాన్ హార్మోన్ అసమతూల్యత వల్ల శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, వీర్యకణ లోపాలు, సంతాన లేమి సమస్యలువస్తాయి. పిల్లల్లో బరువు, ఎత్తు, ఎదుగుదల సమస్యలు వస్తాయి.




డా. మురళి అంకిరెడ్డి
M. D (Homeo)
స్టార్ హోమియోపతి


**హోమియో చికిత్స:** హార్మోన్ల ప్రభావము శరీరము మీద ఎంతో వుంది. థైరాయిడ్ సమస్యలో బాధ పడేవారు జీవితాంతం మందులు వాడాల్సి వస్తుందని వాపోతుం టారు. అంతేకాక మందులు మానేయుట వలన సమస్య పెరిగే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య కాకుండా ఇతర హార్మోన్ల సమస్య లను తొలగించడానికీ ఇప్పుడు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. హోమియోపతిలో రోగి యొక్క శారీరక, మానసిక, అనువంశిక, వంశపారంపర్య తత్వాలనువిశ్లేషించి చికిత్సచేయుటం జరుగుతుంది. ఉదా॥ థైరాయిడ్‌కు కల్కేరియా కార్బ్, థైరాడిసమ్, ఐయోడమ్, బ్రూమియం, సల్ఫర్ మరియు ఇతర సమస్యలకు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణ లో వాడాలి. తద్వారా వ్యాధిని సమూలంగా నయం చేయువచ్చు.



# కీళ్లనొప్పులు - ఆయుర్వేద పరిష్కారాలు

ఆయుర్వేదం అతిపురాతన భారతీయవైద్యశాస్త్రం, ఇందులో జీవితానికి సంబంధించిచర్చించని విషయాలు లేవంటే అతి శయోక్తికాదు. 'కీళ్ళనొప్పులు' ప్రస్తుతకాలం లో అతిచిన్న (30-40) వయసులోనే మొదలవుతున్నాయి. ప్రస్తుత జీవన విధానంలో అనేక మార్పులు ఇందుకు ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. ముఖ్యంగా ఆహారపు అలవాట్లలో మార్పు, సరియైనసమయంలో భోజనం చేయక పోవడం, ఫాస్ట్‌ఫుడ్స్ ఎక్కువగా తినడం, పోషక విలువలు కలిగిన ఆహారంతినక పోవడం సామాన్య కారణాలుగా చెప్పవచ్చు. అలాగే దినచర్యలో సరైన వ్యాయామం, సరియైన సమయంలో నిద్రపోక పోవడం. (స్వప్నవిపర్యం అనగా పగలునిద్రించడం, రాత్రి ఎక్కువగా మేల్కొనిఉండటం వంటివి)కూడా సామాన్య కారణాలుగా చెప్పవచ్చు. అలాగే మానసికంగాఎక్కువగా ఆలోచించ టం, ఆందోళన,డిప్రెషన్ వంటివి కూడా ఈ కీళ్ళనొప్పుల కు సామాన్య కారణాలుగా పరిగణించవచ్చు.

**ఈ కీళ్లనొప్పులను ఆయుర్వేద శాస్త్రంలో 3 విధాలుగా వర్ణించారు.** 1.సంధివాతం-(Oesteo Arthritis) సంధివాతాన్ని ఆస్టియోఆర్థరైటీస్‌గా ఆయుర్వేదం పరిగణి స్తుంది. ఇక్కడ ముఖ్యంగా త్రిదోషపరంగా చూసినట్లయితే సంధులలో వాత ప్రకోపం జరుగుతుంది. తద్వారా కీళ్లలోనొప్పి, వాపు, కదిలినప్పుడు కీళ్ల నుండి శబ్దాలు ఉంటాయి. ముఖ్యంగా సందులలో (సైనోవియల్ ఫ్లూయిడ్) శ్లేషకకఫం తగ్గిస్తుంది. సంధివాతంలో కదలికల వలననొప్పి ఎక్కువ అవటం. విశ్రాంతిఉంటే నొప్పి తగ్గటం జరుగుతుంది. ముఖ్యంగా ఈ సమస్య 50-60 సం॥రాల మధ్య వయసు వారికి వస్తూ ఉంటుంది. పురుషులతో పోలిస్తే స్త్రీలలో ఈ వ్యాధి ఎక్కువగా వస్తుంది. **ఈసమస్యకు ప్రత్యేకకారణాలు:** మధుమేహం, స్థూల కాయం, సోరియాసిస్‌వంటి వ్యాధులు ఉన్నవారికి ఎక్కువ గా వస్తూఉంటాయి. ఆహారంలో పోషక విలువల లోపం వలన కూడా(విటమిన్-డి, కాల్షియం, ప్రొటీన్) ఈ వ్యాధి వస్తుంది. 1.ఆమవాతం-Rheumatoid Arthritis. రుమటా యిడ్ ఆర్థరైటీస్‌ని ఆమవాతంగా ఆయుర్వేదం లో పరిగణి స్తారు. ముఖ్యంగా ఆమం, వాతం అనే రెండు దోషాల ప్రభావం వలన ఈ సమస్య వస్తుంది. మానసిక ఒత్తిడివలన ఎక్కువగా ఆలోచించటం, ఎక్కువగా విచారించడం, కోపంవలన, సరియైనఆహారనియ మాలు పాటించకపోవడం వలన, వ్యాయామం లేకపోవటం వలన, జీర్ణవ్యవస్థ సరిగా పని చేయకపోవటం లాంటి కారణాలవల్ల ఈసమస్య వస్తుంది. ముఖ్యంగా ఈవిధమైన కీళ్లసమస్యల లో ఎక్కువగా వాపు, తీవ్ర వేదన, కొద్దిపాటి జ్వరం, కీళ్లు బిగుసుకుపోవటం, ఆకలి మందగించటం, మలబద్ధకం లాంటి లక్షణాలు ప్రధానంగాఉంటాయి. ఈవ్యాధి అన్నికీళ్ల లో వస్తుంది. 3.వాతరక్తం-(Gout) గౌట్‌ను వాతరక్తంగా పరిగణిస్తాం. ఇది మధ్యవయసు వారిలో ఎక్కువగా అధిక మాంసం, మధ్యపాన సేవనం (హైప్రోటీనిక్‌ఆహారం) ఎక్కువగా పులుపు,ఉప్పు, మసాలా లు ఆహారపదార్థ సేవన, ఎక్కువగా ప్రిజర్వేటివ్స్, కెమికల్స్ ఉండే ఆహారపదార్థాలు తినటంవలన అలాగే వీటితో పాటు శారీరక శ్రమ చేయక పోవటం, ఎక్కువ సమయం ద్విచక్రవాహనాలపై ప్రయాణిం చటం, ఎక్కువ దూరం నడవటం వీటన్నిటివలన వాతం, రక్తం ఈ రెండు దుష్టి చెంది వాతరక్తంగా సమస్య ఏర్పడు తుంది. క్లీనికల్‌గా చూసినట్లయితే ఈ సమస్యలో యూరిక్‌ఆసిడ్ లెవెల్స్ రక్తంలో పెరుగుతాయి. **లక్షణాలు:** ఎరుపు, వాపు, నొప్పితో కూడిన కాలిబొటన వేలు నుండి ప్రారంభమై, తర్వాత మిగిలినటువంటి కీళ్లకు వ్యాపి స్తుంది. దీనిలో కీళ్లనొప్పుల తో పాటు పైన చర్మంరంగు కూడా మారుతుంది. **ఆయుర్వేదంలో పరిష్కారమార్గాలు:** ఆయుర్వేదంశాస్త్రం లో.. మూడు పద్ధతుల ద్వారా ఈ వ్యాధులకు పూర్తిగా చికిత్స చేయవచ్చు. 1.నిదానపరివర్జనం: వ్యాధికారణాలను తెలుసుకుని, వాటికి దూరంగా ఉండటం. ఉదా॥పగలు నిద్రపోవటం, రాత్రి మేల్కొనటం వంటి కారణాలను విడిచిపెట్టటం. 2.ఆహారవిహార నియమాలు: ఆహారం సరైనటైమ్‌కి తినటం, వ్యాధిస్వభావాన్ని బట్టి పోషక విలువలు కలిగిన ఆహారంతినటం, తగువ్యాయామం, సరైన టైమ్‌కి విశ్రాంతి లాంటి నియమాలు పాటించడం. 3.ఔషదసేవన: ఔషదసేవన విషయానికివస్తే, ఇందులో రెండు పద్ధతులున్నాయి. ఎ) శమనం: అనగా వ్యాధి దోషాల ను బట్టి అభ్యంతరంగా ఔషదాలను సేవించటం. బి) శోధనం: అంటే పంచకర్మ. పంచకర్మలో స్నేహకర్మ, స్వేదకర్మ తరువాత వామన, విరేచన, వస్తి తరువాత పశ్చాంత్‌కర్మలు చేయించవలసిన అవసరం ఉంటుంది. ఇవికాక అభ్యంగ, శిరోధార, కటివస్తి, గ్రీనవస్తి,జానువస్తి, పత్రపోటలీ, వాలుగా స్వేదం మెదలగు బాహ్యచికిత్సలు కూడా అవసరాన్నిబట్టిప్రయోగిస్తే మంచి ఫలితాలు ఉంటాయి.


డా. లక్ష్మీ M. D (Ayurveda)
స్టార్ ఆయుర్వేద



తగా మారిపోయింది. తనకూ బలం ఉన్నట్టు కాంగ్రెస్ చెప్పుకోగలుగుతోంది. రాష్ట్రంలో దాని ఓట్ల వాటా సుమారు 11 శాతం ఉంటుంది. ఇక్కడి పార్టీలతో పోల్చి చూస్తే ఇది నాలుగవ స్థానం. ఏది ఏమైనప్పటికీ, ఉత్తరప్రదేశ్ ఎన్నికలకు సంబంధించినంత వరకూ రాహుల్ గాంధీ కంటే ప్రియాంక గాంధీయే పైమెట్టులో ఉన్నారని అనుకోకుండా రుజువయింది. పార్టీలో ఆమె ముమ్ముందు మరింత కీలక పాత్ర పోషించనున్నారని గతంలో కూడా వదంతులు వినవచ్చాయి కానీ, ఈసారి మరింత గట్టిగా వినిపిస్తున్నాయి.

పార్టీ సంగతి ఎలా ఉన్నా, ప్రస్తుతానికి ఎన్నికల ప్రచారంలో ప్రియాంక పెద్ద పాత్ర పోషించాలని పార్టీ భావిస్తోంది. వాస్తవానికి ఆమె తమ కుటుంబ నియోజకవర్గాలైన అమేథీ, రాయబరేలీలకే ఇంతవరకూ పరిమితమవుతూ వచ్చారు. ఈ నియోజకవర్గాల నుంచి రాహుల్ గాంధీ, సోనియా గాంధీ పోటీ చేస్తూ వచ్చారు. ప్రియాంక కూడా ఈ నియోజకవర్గాల్లో ప్రచారం చేయడం తప్ప ఏనాడూ పెద్ద పాత్ర పోషించలేదు. ఈ మధ్య కాలంలో సోనియా గాంధీ ఆరోగ్యం బాగా లేకపోవడం, రాహుల్ గాంధీ కూడా ఇతర పార్టీ కార్యకలాపాలతో క్షణం కూడా తీరిక లేకుండా ఉండడంతో అడపాదడపా ప్రియాంక గాంధీ పార్టీ వ్యవహారాల్లో పార్టీ అగ్ర నాయకులకు సహాయం చేస్తూ వస్తున్నారు. ఇప్పుడిక ఆమె పెద్ద పాత్ర పోషించడానికి సమయం ఆసన్నమైనట్టు కని

# ప్రియాంక సరైన ప్రత్యర్థి!

**పార్టీ వ్యవహారాల్లో ప్రియాంక అడపాదడపా ఓ పాత్ర పోషిస్తుంటారు. అది గణనీయమైన పాత్రే అవుతుంది. అంతే తప్ప, ప్రధాన స్థానానికి మాత్రం రారు.**

సీట్ల పంపకాల గురించి చర్చించడం, నెగ్గుకు రావడం అంత తేలికైన విషయం కాదు. తమకు స్థానబలం ఉన్నా లేకపోయినా, తమకు కొన్ని సీట్లలో విజయావకాశాలు ఉన్నా లేకపోయినా కొన్ని పార్టీలు బేరమాడడం మొదలుపెడతాయి. అందువల్ల సీట్ల చర్చలు అంత తేలికగా ఒక కొలిక్కి రావు. ఇటువంటి చర్చల్లో పాల్గొనాలంటే ఓర్పు ఉండాలి. రాజకీయ పరిణతి ఉండాలి. సమాజ్‌వాదీ పార్టీతో చర్చలు జరిపి కాంగ్రెస్ పార్టీ 105 సీట్లు చేజిక్కించుకుందంటే, పార్టీ ఎంతో గొప్పగా చర్చలు జరిపినట్టే లెక్క. ఉత్తర ప్రదేశ్‌లో కాంగ్రెస్‌కు ఏ కొద్ది స్థానాల్లోనో తప్ప ఏమాత్రం బలం లేదు. అది అందరికీ తెలిసిన విషయమే. అయినా కాంగ్రెస్ బేరమాడింది. తాను కోరిన స్థానాలను చేజిక్కించుకుంది. ఉత్తరప్రదేశ్ ఎన్నికల ప్రచారంలో ఉన్న కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీకి ఈ ఘనతంతా దక్కాలి.

అయితే, ఈ ఘనత దక్కాల్సింది ఆయనకు కాదనే సంగతి ఇక్కడ గుర్తుంచుకోవాలి. అనేక సందర్భాల్లో ఈ చర్చలు కుప్పకూలే పరిస్థితి ఎదురైంది. అయితే, ప్రియాంక గాంధీ మధ్యలో కల్పించుకోవడంతో పరిస్థితి ఓ దారికి వచ్చింది. సమాజ్‌వాదీ పార్టీలో ఒప్పందం కుదరకపోయి ఉంటే కాంగ్రెస్ ఎంతగానో నష్టపోయేది. నిజానికి కాంగ్రెస్‌కు మరో ప్రత్యామ్నాయం లేదు. అఖిలేశ్ యాదవ్ పార్టీ చిహ్నాన్ని గెలుచుకోగానే కాంగ్రెస్ ఆ పార్టీతో తాము సీట్ల పంపిణీ ఒప్పందం కుదుర్చుకోబోతున్నట్టు ప్రకటించేసింది. రాహుల్, ఆయన సన్నిహితులు సీట్ల పంపిణీపై అఖిలేశ్ బృందంతో చర్చలకు కూర్చున్నారు. అయితే, తమకు కావాల్సిన సీట్ల విషయంలో అఖిలేశ్‌ను ఒప్పించడం రాహుల్ బృందానికి దాదాపు అసాధ్యమైపోయింది. ఇటువంటి సమయంలో ప్రియాంక గాంధీ కాంగ్రెస్ అధ్యక్షురాలి తరఫున రంగంలోకి దిగారు. అసాధ్యమనుకున్నదాన్ని ఆమె సాధ్యం చేశారు.

### పొత్తు ఉపయోగమేనా?

ఈ పొత్తు ద్వారా కాంగ్రెస్ పార్టీకి ఏయే స్థానాలు లభిస్తాయన్నది ఇంకా తెలియలేదు. సమాజ్‌వాదీ పార్టీ గెలవలేని సీట్లలో అధిక భాగం కాంగ్రెస్‌కు దక్కుతాయనడంలో సందేహం లేదు. నిజానికి పోటీకి నిలబెట్టడానికి కాంగ్రెస్ దగ్గర అభ్యర్థులు కూడా లేరు. అయితే, 105 స్థానాలలో పోటీచేయడమన్నదే కాంగ్రెస్ పార్టీకి ఓ ఘన

పిస్తోందని కాంగ్రెస్ నేతలు అభిప్రాయపడుతున్నారు.

ఉత్తరప్రదేశ్ ఎన్నికలతో ప్రారంభించి ప్రియాంక గాంధీ పార్టీ వ్యవహారాల్లో కీలక పాత్ర పోషిస్తున్నందువల్ల పార్టీ శ్రేణులు రాహుల్ గాంధీకి చెల్లు చీటి పాడి, ప్రియాంకకే పెద్ద పీట వేయబోతున్నారని అనుకోవాలా? వాళ్లకు రాహుల్ గాంధీ




మీద నమ్మకం పోయిందనడానికి ఇది సంకేతమా? ఇటువంటి ప్రశ్నలకు పార్టీ నాయకుల నుంచి బహిరంగంగా సమాధానాలు రాకపోవచ్చు. ఓ నాయకుడిగా రాహుల్ గాంధీ ఎవరినీ ఉత్తేజపరచలేకపోతున్నారనే మాట మాత్రం నిజం. గత కొంత కాలంగా రాహుల్ గాంధీ వివిధ రాష్ట్రాల్లో విస్తృతంగా పర్యటిస్తున్నారు. వివిధ రాష్ట్రాల్లో కాంగ్రెస్ పార్టీలో ఉన్న సమస్యల్ని పరిష్కరిస్తూ వస్తున్నారు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా ఆయన పట్ల

కాంగ్రెస్ శ్రేణుల్లో సుహృద్భావం కూడా నెలకొని ఉంది. అయితే, ఇదంతా పార్టీలో ఆయనకు మద్దతు పెరగడానికి మాత్రం ఉపయోగపడడం లేదు.

### ప్రియాంక విజయం సాధిస్తారా!

ఆసక్తికర విషయమేమిటంటే, జాతీయ స్థాయిలో సరైన ప్రతిపక్షం లేకుండా పోతోంది. ఓ ప్రతిపక్షంగా కాంగ్రెస్ ఎదగడానికి ఎంతో అవకాశం ఉంది. రాహుల్ నాయకత్వంలో కాంగ్రెస్ ఓ శక్తిమంతమైన ప్రతిపక్షంగా ఎదుగుతుందని, 2014 ఓటమితో పట్టిన దుమ్ము వదిలిపోతుందని కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తలంతా ఆశించారు. రెండున్నరేళ్ల గడిచినా అటువంటిదేమీ జరగలేదు. పార్టీ శ్రేణుల్ని ఉత్తేజపరచి, ఉత్సాహపరచి దిశానిర్దేశం చేయడంలో రాహుల్ ఘోరంగా విఫలమయ్యారు. పార్టీని సంస్థాగతంగా పునర్నిర్మించి, భవిష్యత్తుకు తగ్గట్టు తీర్చిదిద్దుతాడన్న ఆశలు కూడా సమీప భవిష్యత్తులో కనిపించడం లేదు. బహుశా ఈ కారణాల వల్లేమో సోనియాగాంధీ ఆయనకు ఇంత వరకూ పార్టీ అధ్యక్ష పదవి అప్పగించలేదు.

ప్రియాంకగాంధీలో మాత్రం నాయకత్వ లక్షణాలు కనిపిస్తున్నాయి. ఆమెలో జనాకర్షణ ఉంది. ఆయన కంటే ఆమెకే రాజకీయాలను అర్థం చేసుకునే శక్తి కాస్తంత ఎక్కువగా ఉంది. ఆమె శక్తి ఎంతన్నది, ఆమెలో రాజకీయ పరిణతి ఎంతన్నది మాత్రం ఇంతవరకూ బయటపడలేదు. ఆ శక్తియుక్తులు ఇంకా పరీక్షకు గురి కాలేదు. ఆమె తేలికగా సామాన్య ప్రజానీకంతో మమేకం అయిపోతారు. అందుకనే ఆమె సమాజ్‌వాదీతో ఒప్పందం కుదర్చుకోవడంలో సఫలమయ్యారు. అంతేకాదు, తన అన్న కంటే ఆమెలోనే రాజకీయ చతురత, చొరవ ఎక్కువ. ఓ రాజకీయవేత్తగా శీఘ్రంగా ఎదగగలగడం ఆమెకే చేతనవును.

దీన్ని బట్టి ఆలోచిస్తే, పార్టీ అగ్రనాయకత్వం రాహుల్ స్థానంలో ఆమెను కీలక పాత్రకు ఎంపిక చేసే అవకాశం ఉందా అనే ఆలోచన వస్తుంది. అందుకు ప్రస్తుతానికి అవకాశం లేదు. ఆమెను ఇప్పటికిప్పుడు అందలం ఎక్కిస్తే రాహుల్ గాంధీ అప్రతిష్ఠపాలవుతారు. ఆయన నాయకుడుగా ఎదగాలని పార్టీ చాలా కాలంగా శ్రమిస్తోంది. ఆయన మీద ఇంకా ఎన్నో ఆశలు పెట్టుకుని ఉంది. ఇటువంటి పరిస్థితుల్లో ఆయనను మధ్యలో వదిలేయడం సమంజసమైన పని కాదు. కష్టమైనా నష్టమైనా కుటుంబమంతా కలిసే ఉంటుంది. కుటుంబమంతా ఒక్క తాటి మీదే



నిలుస్తుంది. రాహుల్, ప్రియాంకల మధ్య విభేదాలు సృష్టించడానికి పార్టీ సిద్ధపడదు. పార్టీ వ్యవహారాల్లో ప్రియాంక అడపాదడపా ఓ పాత్ర పోషిస్తుంటారు. అది గణనీయమైన పాత్రే అవుతుంది. అంతే తప్ప, కేంద్ర స్థానానికి మాత్రం రారు. కీలక పాత్ర కూడా పోషించరు. ఆమె గణనీయమైన పాత్ర పోషించడానికి మాత్రం ఉత్తర ప్రదేశ్ ఎన్నికలే తొలి మెట్టు అవుతుంది.

### వ్యతిరేక వాదనా ఉంది!

అయితే, ఇక్కడ మరో వాదన ఏంటంటే, కాంగ్రెస్ తరపున ప్రియాంకాగాంధీ ఎన్నికల ప్రచారంలోకి దిగినంత మాత్రాన జరిగేదేమీ ఉండదు. సోనియాగాంధీ కుటుంబమంటే గుడ్డిగా ఓట్లేయడానికి ఇప్పటి తరం ఏమంత సంసిద్ధంగా లేదు. అది వెనుకటి తరంతోనే ముగిసిన చరిత్ర. ప్రియాంకగాంధీ విషయానికి వచ్చేసరికి ఆమె భర్త రాబర్ట్ వద్రా అక్రమాల కారణంగా ఆమె కూడా కొంత అప్రతిష్టపాలయింది. పైగా బోఫోర్స్ విషయంలో కొత్తగా వెలుగు చూస్తున్న విశేషాలు ఆ కుటుంబాన్ని మళ్లీ పెనుభూతంలా వెంటాడు

**యూపీలో అఖిలేశ్ పార్టీ నుంచి కాంగ్రెస్ 105 సీట్లు సంపాదించుకుంది. ఇది చిన్నవిషయం కాదు. అంటే చర్చలు బాగానే జరిపినట్టులెక్క. ఈ ఘనత రాహుల్‌గాంధీది కాదు. ప్రియాంకగాంధీ రంగంలోకి దిగబట్టే అన్ని సీట్లొచ్చాయి. రాహుల్ కంటే ఆమె ఒకమెట్టు పైనే ఉన్నారు. ఆమెను చూస్తే ఇందిరను చూసినట్టే ఉంటుంది. రాజకీయానుభవం లేకపోయినా, జనాకర్షణశక్తి ఉందామెకు. మరి ప్రియాంక క్రియాశీల రాజకీయాల్లోకి వస్తారా? లేదా?**

తున్నాయి. అయితే, 'ప్రియాంక' అనే మాట కాంగ్రెస్ చేతిలో చివరి బ్రహ్మాస్త్రం. అయిదు రాష్ట్రాలకు ఎన్నికలు జరుగుతున్న సమయంలో ఈ బ్రహ్మాస్త్రాన్ని ఉపయోగించడం తప్ప కాంగ్రెస్‌కు మరో మార్గం లేదు. ఈ అస్త్రాన్ని ఉపయోగించినంత మాత్రాన కాంగ్రెస్‌కు నష్టమేమీ లేదు. ప్రయోజనం ఉంటే పరవాలేదు. ప్రయోజనం కలగకపోయినా పరవాలేదు.

ఈ చిట్టచివరి అస్త్రం వల్ల ఎటువంటి ప్రయోజనం కలగబోతోంది? ఇందిరాగాంధీకి, ప్రియాంకా గాంధీకి దగ్గర పోలికలున్నాయి. ఆమెను చూడగానే ఇందిరాగాంధీ, ఆమె పాలనా కాలం, ఆమె పాలనా సామర్థ్యం వంటివి గుర్తుకు వచ్చి ప్రియాంక వైపు మొగ్గు చూపే అవకాశం ఉంది. ఇందిరాగాంధీకి, ప్రియాంకాగాంధీకి దగ్గర పోలికలు ఉన్నంత మాత్రాన జనం ప్రియాంక వైపు మొగ్గు చూపుతారా? ఎన్నికల ఫలితాలు కాంగ్రెస్‌కు అనుకూలంగా మారతాయా? ఫలితాలు మారతాయనే అంటున్నారు కాంగ్రెస్ పార్టీలోని సీనియర్ నాయకులు. ఇందిరాగాంధీ పాలనకు సంబంధించి పాత రోజులు తప్పకుండా గుర్తుకు వస్తాయని వృద్ధ తరం గట్టిగా చెబుతోంది.

ప్రియాంకకు ఉన్న మరో సానుకూల అంశమేమిటంటే, ఆమె ఎవరికీ అంతుబట్టని వ్యక్తి.




ఆమె ఓ మిస్టరీ. ఆమె సాధారణంగా జనంలో కలవరు. ఎవరికీ అందుబాటులో ఉండరు. అందుకని ఆమె చుట్టూ ఓ మిస్టరీ అల్లుకుపోయి ఉంది. ఆమె హుందాగా ఉంటారు. మంచి వక్త. ఆకర్షణీయంగా కూడా ఉంటారు. పైగా యువతి. దేశంలో మహిళలంతా ఆమె వైపు ఆకర్షితులయ్యే అవకాశం ఉంది. ముఖ్యంగా యువతను ఆమె ఆకట్టుకోగలుగుతారు. యువతకు ఆమె ప్రతీక. మహిళా ఉద్యమానికి, మహిళా చైతన్యానికి కూడా ఆమె కేంద్రబిందువు. అమెరికాలో జరుగుతున్న మహిళా ఉద్యమాన్ని దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే, ప్రియాంక వంటి మహిళా నాయకుల అవసరాన్ని దేశ ప్రజలు గుర్తించే అవకాశం ఉంది.

ఆమెకు తగినంత రాజకీయ అనుభవం లేకపోవడం ఓ మైనస్ పాయింటే కావచ్చు. విమాన పైలట్‌గా ఉన్న ఆమె తండ్రి రాజీవ్ గాంధీ ప్రధాని కాగా లేనిది, ఆమె అయితే తప్పా? ఆమె తండ్రికి రాజకీయ అనుభవం ఉందా? అప్పుడు ఉదయించని ప్రశ్న ఇప్పుడు ఉదయిస్తుందా? ముఖ్యంగా వివిధ రాజకీయ పార్టీల్లో ఉన్న నాయకుల అనుభవం, వారి వ్యవహార శైలి చూసిన వారికి ఈ రాజకీయ అనుభవం పెద్దగా అవసరమేమీ కాదనే అనిపిస్తుంది. ఆమె వయసు కూడా ఆమెకు అనుకూలిస్తుంది. ఓ ఆధునిక యువతికి ప్రతిరూపంగా ఉన్న ప్రియాంక యువత పట్ల ప్రపంచవ్యాప్తంగా ఉన్న సానుకూల వైఖరిని తనకు అనుకూలంగా చేసుకోవచ్చు. ఆమెను ప్రజాకర్షణకు దూరంగా ఉంచాలన్నా, ఆమె ఖ్యాతి పెరగకుండా చూడాలన్నా ఆమెను పట్టించుకోకపోవడమే మార్గమని ప్రత్యర్థులు భావించవచ్చు. కానీ, ఆమె విషయంలో అటువంటిది జరిగే అవకాశమే లేదు. ఆమె రంగ ప్రవేశం చేస్తే మాత్రం ఆమె తప్పకుండా ఓ శక్తిమంతమైన ప్రత్యర్థిగా మారడం తథ్యం. బీజేపీ కూడా ఆమెను విస్మరించే అవకాశం లేదు. ఆమె విమర్శలకు, ఆరోపణలకు సమాధానం చెప్పాల్సిన అగత్యం ఆ పార్టీకి కూడా ఏర్పడవచ్చు. ఆమె రాజకీయాల్లోకి ప్రవేశించినా, ఎన్నికల ప్రచారంలోకి ప్రవేశించినా ఆమె ఓ రాజకీయశక్తిగా ఎదగడానికి, ప్రత్యర్థులకు ఓ సవాలుగా మారడానికి అవకాశం ఉంది. కీడెంచి మేలెంచాలి కదా!...ఆమె క్రియాశీల రాజకీయాల్లోకి ప్రవేశించడమే మంచిది.

నవ్య



# మహానంది

(19)

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**రెండు పాయల మధ్య ఉన్న ద్వీపం మీద ఉన్న వృక్షశాఖల్లోంచి రకరకాల పక్షులు బృందగానం చేస్తున్నట్టు కూస్తున్నాయి. అవి పక్షి జాతులు చేస్తున్న సాయంకాల సంకేత శబ్దాలు. ఆ శబ్దాలు లాలసకు మేలుకొలుపులు పాడినట్టున్నాయి. తన వీపుమీద నీరసంగా వాలిపోయి, అలసటతో నిద్రపోయిన లాలస శరీరంలో కదలిక ప్రారంభమైనట్టు గుర్తించాడు నంది.**

"రాకుమారిగారూ...అదే...లాలసా...సురక్షితంగా ఉండే విశ్రాంతి స్థానానికి చేరుకున్నాం. నదీప్రవాహం రెండు పాయలుగా చీలి, ద్వీపకల్పాన్ని రూపొందించింది. రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకుందాం...లే!" నంది లాలసను హెచ్చరిస్తూ చేతులకి అందిన రాతిని పట్టుకుని ద్వీపం అంచు మీదికి ప్రాకసాగాడు.

తమకు స్వాగతం చెబుతున్న నునుపుగా ఉన్న బండరాతి మీదకు అతను చేరేసరికి, లాలస నెమ్మదిగా అతని వీపు మీద నుంచి కిందకి జారింది. నంది వెంటనే బండరాతి మీద వెల్లకిలా తిరిగి, ఒళ్ళు విరుచుకున్నాడు. లాలస దగ్గరగా కూర్చుంది. మోకాళ్ళ మీద గెడ్డాన్ని ఆన్చుకుని, చేతుల్ని మోకాళ్ళ చుట్టూ అల్లుకుని, అతని వైపు నిదానించి చూసింది. ఆమె కళ్ళల్లో కృతజ్ఞతా, జాలీ కలిసి ప్రత్యక్షమయ్యాయి.

"మిమ్మల్ని కష్టపెడుతున్నాను. ఎద్దు మీద మొద్దులాగా నిద్రపోయాను." లాలస కంఠంలో సిగ్గు కంపించింది.

నంది చిరునవ్వు నవ్వాడు. "మిమ్మల్ని అనకూడదుగా!"

లాలస తన పొరపాటును తెలుసుకుని, నాలుక కరుచుకుంది. "అదే...నిన్ను..." అంది దిద్దుకుంటూ.

"ఎద్దుతో పోల్చినందుకు ధన్యవాదాలు" నంది నవ్వుతూ అన్నాడు. "కష్టంలో ఉన్న నిస్సహాయులకు సహాయం చేయడం కష్టం కాదు; అదృష్టం. పైగా నా పేరు ఎద్దు పేరే!"

"నువ్వు తారసిల్లడం నా అదృష్టం" లాలస అంది, పొడుగాటి శిరోజాల నుండీ జారుతున్న నీటిని పిండుకుంటూ.

నంది పైకి లేచాడు. పూర్తిగా చీకట్లు కమ్ముకోకముందే పరిసరాలను పరిశీలించాలి. తమకు కుడి ఎడమలా వెనక ఉన్న చెట్లనూ, పొదలనూ చూస్తూ వాటి వైపు వెళ్ళాడు. అతను పొదల మాటుకు వెళ్ళగానే లాలస లేచి నిలుచుంది. కుచ్చెళ్ళనూ, పైటనూ మెలిపెడుతూ పిండుకుంది. దాంతో తడిసి ముద్దయిన వస్త్రాల బరువు కొంత తగ్గింది. కాస్సేపట్లో నంది తిరిగి వచ్చాడు.

"ప్రదేశం సురక్షితం. పాముల భయం లేదు!" అన్నాడు లాలస ఎదురుగా కూర్చుంటూ. అతని చేతిలో వెడల్పాటి ఆకులున్నాయి.

"ఎలా తెలుసు? అవి పుట్టల్లో ఉంటాయిగా?" లాలస భయంగా ప్రశ్నించింది.

"ఈ పొదల్లో సర్ప శత్రువులు సంచరిస్తున్నాయి. సర్పాలు ఉండవు."

"సర్ప శత్రువులా?"

"ముంగిసలు!" నంది చిరునవ్వు నవ్వాడు. "ముంగిసలూ, నెమళ్ళూ సంచరించే చోట సర్ప సంచారం ఉండదు. ముంగిస కుటుంబాలు చాలానే ఉన్నాయి."

లాలస తేలికగా, ధైర్యంగా నిట్టూర్చింది. "ఇక నిర్భయంగా నిద్రపోతాను!"

"ఆకలిగా ఉంది. అలసటగా ఉంది. విందు ఆరగించి, విశ్రాంతి తీసుకుందాం!" అంటూ ముందు జాగ్రత్తతో తన తలమీద కట్టి ఉంచుకున్న మూటను విప్పాడు. రొట్టెలు తడిసిపోయి ఉన్నాయి. జలపాతం వలన కావొచ్చు! తడిసినా తప్పదు, ఆకలి తీర్చుకోవాల్సిందే! నంది రొట్టెలను ఇద్దరి ముందు ఆకుల మీద సర్దాడు.

•••

ముఖం మీద వెచ్చగా తగుల్తున్న సూర్యకిరణాలు నందిని మేలుకొలిపాయి. రెండు అరచేతుల్తో కళ్ళను రుద్దుకుంటూ లేచి కూచున్నాడు. ఒళ్ళు తెలియని నిద్ర అలసటను నూతనోత్సాహంగా మార్చింది. ఒకసారి సూర్యుడికి నమస్క

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. పొరుగురాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. రాకుమార్తెను కళింగ యువరాజు కళింగరత్న అపహరిస్తాడు. కళింగరత్న తన ఉపాయాల్లో తానుండగానే, లాలస తప్పించుకుంటుంది. లాలసను నంది రక్షిస్తాడు. ఆమెను కామరూప యువరాణిగా తెలుసుకొని ఆశ్చర్యపోతాడు నంది. తనను బంధించేందుకు ప్రయత్నించిన ఉలూకుడిని, అతడి భటులను చావ మోదుతాడు. ఉలూకుడు మళ్లీ దాడిచేసే అవకాశం ఉండటంతో అక్కడినుంచి లాలససహా కళింగ రాజ్యం నుంచి బయటపడాలని బయలుదేరుతాడు నంది. దారిలో అడ్డుపడిన ఉలూకుడి నుంచి తప్పించుకునేందుకు నదిలో దూకుతారు ఇద్దరూ.

ఆ తర్వాత....



రించి, తలతిప్పి చూశాడు. పడుకున్న చోట లాలస లేదు. రాత్రి తనకు అయిదారడుగుల దూరంలో పడుకుందామె. ఆకాశంలో మినుకు మినుకు మంటున్న చుక్కలను చూస్తూ తాను చాలాసేపు మేలుకునే ఉన్నాడు. అనుకున్నంత త్వరగా తనకు నిద్ర పట్టలేదు. అపరిచిత ప్రదేశం కారణం కావచ్చు. కాసేపట్లో లాలస ప్రారంభించిన సన్నటి గురక తనకు జోలపాటలాగా వినిపించసాగింది. తెలియకుండానే నిద్రలోకి జారుకున్నాడు తను.

లాలస దంతధావనానికో, స్నానానికో వెళ్ళి ఉంటుంది. నంది పైకి లేచాడు. శిలాద్వీపాన్ని తాకుతూ, రెండుగా విడిపోతూ, ప్రదక్షిణగా ప్రవహించుకుపోతున్న నీళ్ళ వైపు నడిచాడు. స్నానం అవసరం లేదు. ఇవాళ కూడా చేపలాగా జలయానమే తనది!

నిమిషాలు గడుస్తున్నాయి. సూర్యకిరణాలు చురుక్కుమంటున్నాయి. లాలస ఇంకా తిరిగి రాలేదు. నందిలో ఆందోళన ప్రారంభమైంది. ఒక వేళ..ఆమె...కాలుజారి నదిలో పడి...నంది ఒక నిర్ణయానికి వచ్చి, పొదల దగ్గరగా వెళ్ళాడు. రెండు చేతుల్నీ నోటికి రెండువైపులా అర్థచంద్రాకారంలో ఉంచుకున్నాడు. "లాలసా!" నంది గొంతెత్తి పిలిచాడు.

లాలస సమాధానం కోసం మౌనంగా ఎదురు చూసిన అతనికి ప్రవాహం చేస్తున్న గలగల ధ్వనులే వినిపించాయి. నంది పొదల్ని తప్పుకుంటూ లాలసను పిలుస్తూ ఉండిపోయాడు. పక్షుల కిలకిలలు, నీళ్ళ గలగలలు అతనికి సమాధానంగా మారు పలుకుతున్నాయి. నంది గుండె దడదడ కొట్టుకుంది. తనను నిద్ర లేపకుండా ఆమె నీళ్ళ అంచుకు ఎందుకు వెళ్ళాలి? లాలస ఏకాంతంగా ఉందేమో, స్నానం చేస్తూ ఉందేమో అన్న అనుమానాలను పక్కకు నెట్టివేస్తూ నంది అన్నివైపులా ఆమె కోసం చూస్తూ పిలుస్తూ ఉండిపోయాడు. సమయం భయాందోళనలను కలిగిస్తూ సాగిపోతూనే ఉంది. లాలస కనిపించలేదు; ఆమె కంఠధ్వని వినిపించలేదు.

ముఖాన్ని కమ్ముతున్న చెమటల్ని రెండు చేతుల్తో తుడుచుకుంటూ నంది నీరసంగా ఒక రాతి మీద కూర్చున్నాడు. లాలస ఏమైంది? లాలసకు ఏమైంది? తనేం చేయాలి? తను నిద్రపోకుండా, మెలకువగా, ఆమెకు రక్షగా ఉండాల్సింది. నిద్రపోయి తను తన బాధ్యతను విస్మరించాడా? రకరకాల ప్రశ్నలు నంది మస్తిష్కంలో మడుగులో క్రిక్కిరిసిన చేపపిల్లల్లా గెంతులేస్తూ అలజడి సృష్టిస్తున్నాయి.

ఉన్నట్టుండి రకరకాల పక్షులు విభిన్న స్వరాలతో చేస్తున్న శబ్దాలు మేళవింపులేని బృంద గానంలా అతని చెవుల్ని తాకాయి. ఆ శబ్దాలలో మార్దవం లేదు. ఆత్రుత ఉంది. ఆవేశం ఉంది. కనిపించని లాలసకూ, వినిపిస్తున్న విహంగ శబ్ద విన్యాసానికీ ఏదైనా సంబంధం ఉందా? నంది అసంకల్పితంగా లేచాడు. శబ్దాలు వస్తున్న దిశగా పరుగు ప్రారంభించాడు.

చెట్ల బోదెల మధ్యా, దట్టంగా ఉన్న పొదల మధ్యా నంది గాలిలా దూసుకెళ్తున్నాడు. బాగా కిందకి వాలిన వృక్ష శాఖలూ, ముళ్ళపొదలూ, అడ్డదిడ్డంగా ఉన్న రాళ్ళూ నంది వేగాన్ని నియంత్రిస్తూ, అతన్ని ఆపడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాయి. చేతుల మీదా, కాళ్ళ మీదా చర్మాన్ని చీరుతూ, పిచ్చి రక్తాక్షరాలు లిఖిస్తున్న ముళ్ళ పొదల్ని ఏ మాత్రం పట్టించుకోకుండా నంది ఎవరినో వెంటాడుతున్న వాడిలా ముందుకు పరిగెడుతున్నాడు. శ్రుతీలయా లేని పక్షుల అరుపులు క్రమంగా దగ్గరవుతున్నట్టు శబ్దం తెలియజేస్తోంది.

నంది ఎదురుగా ఉన్న చెట్టు బోదెను ఢీకొన్నట్టు తటాలున ఆగి, తన ముందు సాక్షాత్కరించిన దృశ్యాన్ని నిర్ఘాంతపోతూ చూశాడు.

కొన్ని వందల పక్షులు అయిదడుగుల ఎత్తున్న పొద మీద, కింద నుండీ పై దాకా వాలినట్టు, గందరగోళంగా అరుస్తున్నాయి. చిలుకలు, పావురాలు, గోరువంకలు, పిచ్చుకలు, పొట్టి తోకల పిట్టలు, పొడవు తోకల పక్షులూ-తాను ఇంత వరకూ చూడని, పేర్లు తెలియని అడవి పక్షులు ఎన్నో, ఎన్నో రంగులలో, ఎన్నో పరిమాణాలలో పొద కనిపించకుండా ఆవరించి గోలగా అరుస్తున్నాయి. చాలా పక్షులు రెక్కల్ని టప

## అందుకే పెళ్లి చేసుకోదట!

ఇష్టాఇష్టాలు కలవకుండా పెళ్లి చేసుకుంటే ఆ తరువాత తేడాలు వచ్చి విడిపోయే ప్రమాదం ఉంది అంటోంది శృతిహాసన్. తనకు సాంబార్ రైస్ అంటే చాలా ఇష్టమనీ, అలాగే దైవభక్తి ఎక్కువే ననీ ఈ రెండూ ఇష్టపడని వ్యక్తిని చేసు కుని కష్టపడేకన్నా పెళ్లి మానుకుంటే బెటర్ కదా అనుకుంటోందట! ఇలాంటి ఇష్టాలున్న వ్యక్తి దొరక లేదా? లేక తండ్రిని చూసి పెళ్లి మానేయాలని డిసైడ్ అయ్యిందా? అనే అనుమానం సినీ జనా లకు వస్తోంది.



టపలాడిస్తూ కిందకి పడిపోకుండా తమను ఆపు కుంటున్నాయి. పొదను అంటిపెట్టుకుని ఉండ డానికి ప్రయత్నిస్తున్నాయి. నంది కళ్ళు చించు కుంటూ చూస్తున్నాడు. అది...అది... పొద కాదు... చెట్టు కాదు...నిలువెత్తు శిల కాదు...అది...అది... లాలస! పక్షుల సజీవ కవచంలో దాగి ఉన్నది లాలస అని కొద్దిగా బైటపడి, గాలికి ఎగురుతున్న పైట కొంగు చెప్తోంది! అడవి పక్షులు తమ శరీ రాలతో దాచిపెట్టి, దండయాత్ర చేస్తున్నాయి. చేతులు కూడా కదపలేని నిస్సహాయ స్థితిలో ఉన్నట్టుందామె! తలమీద చిలుకలు తిష్ట వేశాయి!

నంది ముందుకు దూకి, పక్షి బంధనంలో ఉన్న లాలసను సమీపించాడు. అరుస్తూ, అద లిస్తూ పక్షుల్ని బెదరగొట్టే ప్రయత్నం చేశాడు. చేతులకు అందిన పక్షుల్ని పట్టుకుని, విసురుగా విసిరి వేయసాగాడు. విసరబడిన విహంగాలు నూతనోత్సాహంతో వెనుదిరిగి, మళ్ళీ వాలుతు న్నాయి; ఆమె మీద కాదు; అతని మీద!

"లాలసా! భయపడకు! నేనొచ్చాను!" నంది లాలసను హెచ్చరిస్తూ పక్షుల చెరలోంచి ఆమెను తప్పించే ప్రయత్నం కొనసాగిస్తున్నాడు. కాస్సే పట్లో లాలస తల ప్రత్యక్షమైంది. ఆమె ముఖంలో, కళ్ళల్లో భయం ఎర్రగా కనిపి స్తోంది.

కాసేపట్లో పక్షులు కూడబలుక్కున్నట్టు తమ మధ్య లాలసనూ, నందినీ పంచుకు న్నాయి! చేతుల్ని ఉపయోగిస్తూ తను పక్షు లను దూరం చేయలేడని నందికి అర్థమై పోయింది. ఏం చేయాలి? వేళ్ళతో పీకల్ని బిగించి, అవలీలగా ప్రాణాలు తీసి పారే యొచ్చు. కానీ అవి క్రూర జంతువులు కావు. భూలోకంలో ప్రకృతికి అందాలు అందించడానికి సృష్టికర్త ప్రసాదించిన వరాలు! ఏం చేయాలా అని ఆలోచిస్తూ, లాలసను కమ్మిన పక్షుల్ని తొల గించే కార్యక్రమాన్ని కొనసాగిస్తున్న నంది బుర్రలో ఒక ఉపాయం మెరుపులా మెరిసింది. క్షణం ఆలస్యం చేయకుండా నంది పక్షులతో పాటు లాలసను రెండు చేతుల్తో పైకి ఎత్తుకు న్నాడు. అతని చేతులకి అడ్డుగా ఉన్న పక్షులు ఉక్కిరిబిక్కిౌవుతూ, తప్పించుకుని, కొంచెం ఎడంగా ఎగిరి, మళ్ళీ లాలస శరీరం మీద వాలాయి!

"నం...దీ..." లాలస నీరసంగా అంది. ఆమె కంఠంలో భయం వణుకుతూ వినిపించింది.

"భయం లేదు! ఒక్క క్షణం!" అంటూ నంది పొదలు అంతగా లేని ప్రదేశం గుండా పరుగు ప్రారంభించాడు. లాలస అతని రెండు చేతుల మీదా, పసిపాపలా అడ్డంగా ఉంది. చెట్టు బోదెలకు ఆమె తల ఢీకొట్టే ప్రమాదం ఉంది. లాలస శరీరం మీద తిష్ట వేసి రెక్కలు టపటపలాడి స్తున్న పక్షుల్నీ, తన శరీరాన్ని ఆక్రమించిన వాటినీ నిర్లక్ష్యం చేస్తూ నంది లాలసను తన కుడి భుజం మీదుగా బోర్లా ఉండేలా మార్చుకున్నాడు. ఏట వాలుగా మారిన ప్రదేశం మీద నడకను పరు గులా మార్చాడు. చెవుల్ని పగలేస్తున్న పక్షుల అరుపుల్ని పట్టించుకునే స్థితిలో లేడతను.

తన ఊహ నిజమైతే కాస్సేపట్లో అనుకున్న చోటికి, తనకూ లాలసకూ పక్షుల నుండి రక్షణ ఇచ్చే చోటికి చేరుకోగలడు తను. నంది ఊహ నిజమైంది. అనుకున్నదాని కన్నా ముందుగా, నీటి అంచుకు చేరుకోగలిగాడు నంది.

"లాలసా! నదిలోకి దిగుతున్నా! జాగ్రత్త!" అంటూ ఆమె సమాధానం కోసం ఎదురు చూడ కుండా ప్రవాహంలోకి దిగేశాడు. మరుక్షణం అతని శరీరం, లాలస శరీరం నీళ్ళల్లో మునిగిపోయాయి. నీళ్ళు తగలగానే పక్షులు రెక్కలకు బుద్ధి చెప్తా యనీ, తమ శరీరాల్ని వదిలేసి గాలిలోకి ఎగురు తాయనీ నందికి తెలుసు! కొంచెం దూరం నీళ్ళ లోపల ముందుకు వెళ్ళిపోయి, నంది పైకి లేచాడు. భుజం మీదున్న లాలస ఉక్కిరిబిక్కిరవుతూ శ్వాస క్రియ జరుపుతోంది. నంది వెనుతిరిగి చూశాడు. తనూ, లాలసా నీళ్ళల్లో మునిగిన ప్రాంతంలో, పది పదిహేను అడుగుల దూరంలో రంగుల పక్షులు గాలిలో ఎగురుతున్నాయి! నంది లాల సను అవలీలగా తన వీపు మీదికి మార్చుకు న్నాడు. "ఇంక భయం లేదు. నది మనల్ని వేగంగా, దూరంగా తీసుకెళ్తుంది!" ముందుకు సాగుతూ అన్నాడు నంది.

"అవి...అవి...మళ్ళీ వస్తే?" లాలస ప్రశ్న వణు కుతూ నంది చెవిలో దూరింది.

"రానీ! మనకు 'జలకవచం' ఉందిగా!" నంది చిన్నగా నవ్వాడు. "మునుగుతూ, తేలుతూ ముందుకు వెళ్ళిపోదాం!" నదీప్రవాహం వాళ్ళిద్దరినీ పక్షుల బృందగానానికి దూరంగా తీసుకెళ్తోంది. కాసేపు వాళ్ళను అనుసరిస్తూ ఎగురుతూ వచ్చిన పక్షులు తమ ప్రయత్నాన్ని విరమించుకున్నాయి.

•••

నదీతీరంలో, పచ్చిక దుప్పటి మీద విశ్రాం తిగా కూర్చున్నారు లాలసా, నందీ. అప్పటిదాకా ఎత్తుగా ఉన్న కొండల మధ్య పరవళ్ళు తొక్కిన నది సమతల ప్రదేశంలోకి ప్రవేశించి, నెమ్మదిగా ప్రయాణం సాగిస్తోంది.

తడిసిన వస్త్రాలతో నీరెండలో కూర్చున్న లాల సను పరిశీలనగా చూశాడు నంది. ఆమె ముంజే తుల మీద పక్షుల కాలిగోళ్ళు చేసిన గీరలు కనిపి స్తున్నాయి. అయితే ఆమె ముఖం మీద గీరలు కానీ, గాట్లు కానీ లేవు! విచిత్రం!

"లాలసా, పక్షులు ఎందుకు నిన్ను చుట్టు ముట్టాయి? ఏం జరిగింది? కాసేపు విశ్రాంతి తీసుకున్నాక అడిగాడు నంది.

లాలస శరీరం ఒక్కసారిగా జలదరించింది. "గుర్తొస్తే భయమేస్తోంది..." లాలస నెమ్మదిగా అంది.

నంది అర్థం చేసుకున్నట్టు తలాడించాడు.

"నిద్ర లేచి, నదిలో నీళ్ళు రాళ్ళ మధ్య నిలక డగా ఉన్న చోట స్నానం చేశాను. గట్టు మీదికి చేరుకుని పైటని రెండు చేతులతో పట్టుకుని,

గాలి వీచేందుకు ఎదురుగా నిలుచున్నాను. ఎండ తగిలితే త్వరగా ఆరుతుందన్న ఉద్దేశంతో చెట్ల నీడలలోంచీ ముందుకు నడుస్తున్నాను. గాలికి పైట నా తల మీద రెపరెపలాడుతోంది. ఎక్కణ్ణుంచీ వచ్చాయో తెలీదు. పావురాలూ, చిలకలూ, పిచ్చుకలూ ఎన్నో రంగురంగుల పక్షులు గోలగా అరుస్తూ వచ్చి నన్ను చుట్టుముట్టేశాయి. పైటను వదిలేసి రెండుచేతుల్తో ముఖం కప్పుకున్నాను. అమ్మో...ఉక్కిరిబిక్కిరి చేసేశాయి. భయపడి పోయాను. వణికి పోయాను. ముక్కులతో పొడిచి చంపేస్తాయనుకున్నాను..." లాలస విశ్రాంతి కోసం అన్నట్టు ఆగింది.

నంది ఆశ్చర్యంగా చూస్తున్నాడు. లాలస ముఖం మీద గాట్లు ఎందుకు లేవో అర్థమవుతోంది.

"పక్షులు నామీద ఎందుకు దాడి చేశాయి?" లాలస నంది వైపు ప్రశ్నార్థకంగా చూసింది.

నంది సాలోచనగా చూశాడు. "పక్షులు దాడి చేయడానికి కారణం నీ పైట...అనిపిస్తోంది.."

"పైటా?!"

"ఆ! రెండు చేతుల్తో పట్టుకున్నావా? గాలికి తెరచాపలా రెపరెపలాడుతోందా? నిన్నూ, గాలిలో రెపరెపలాడుతున్న పైటనూ చూసి, పెద్ద రెక్కలున్న ఏదో వింతపక్షి అని అవి అనుకున్నట్టున్నాయి..."

"నిజంగా?!"

"నాకు అలాగే అనిపిస్తోంది. తమ రాజ్యంలోకి వింత పక్షిని రాకుండా తరిమి వేయాలనుకున్నట్టున్నాయి. అందుకే నిన్ను చుట్టుముట్టాయి!" నంది చిరునవ్వు నవ్వాడు.

"నేను మనిషని వాటికి తెలీదా?" లాలస ఆశ్చర్యంగా అడిగింది.

"ఏమో...నాకు తెలీదు. నిన్ను మనిషి అనుకున్నా, వింతపక్షి అనుకున్నా, వాటి భయం ఒక్కటే కావచ్చు. అది నీ మూలంగా అపాయం! నిన్ను వెళ్ళగొట్టాలనుకున్నాయి. నీ మీద విరుచుకు పడ్డాయి."

"అయితే ముక్కులతో పొడవలేదే?" లాలస అంది.

"ఆపకుండా అరుస్తున్నాయిగా! పొడవడానికీ, రక్కడానికీ ముక్కులకు తీరిక లేదుగా!" నంది అన్నాడు.

"చచ్చిపోతానేమో అని భయపడిపోయాను. చిలకలూ, పావురాలూ మనుషులతో మచ్చికగా ఉంటాయనుకున్నాను."

"అవి అడవి పావురాలూ, అడవి చిలుకలూ! జనావాసాల్లోకి వస్తే మనతో కలిసిపోతాయేమో! కారణం తెలీకపోయినా అదొక అనుభవం!" నంది పైకి లేస్తూ అన్నాడు. "ఏవైనా పళ్ళూ, కాయలూ దొరుకుతాయేమో చూస్తాను."

లాలస కంగారుగా లేచింది. "నేనూ వస్తాను. ఒంటరిగా ఉండాలంటే భయమేస్తోంది.."

"సరే.." నంది నదీతరంలో ఉన్న చెట్ల వైపు దారితీస్తూ అన్నాడు.

"నందీ, మనమిప్పుడు ఏ రాజ్యంలో ఉన్నాం? ఆ కళింగరాజ్యం దాటేశాంగా?" నంది దగ్గరగా నడుస్తూ అడిగింది లాలస.

"కళింగరాజ్యానికి ఈ నది పొలిమేర అనుకున్నా కూడా, ఎక్కడ ఏ రాజ్యంలో ఉన్నామో ఊహించలేం. నది లెక్కలేనన్ని మలుపులు తిరిగింది..."

"కళింగ సామ్రాజ్యంలో ఉండాలంటేనే భయమేస్తోంది" లాలస అంది.

నంది ఆగి, ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు. "చెరలోంచి ధైర్యంగా తప్పించుకున్నదానివి. ఆ ధైర్యాన్ని పెంపొందించుకో! నువ్విప్పుడు ఆ కళింగరత్న కబంధ హస్తాలలో లేవు. స్వేచ్ఛా విహంగానివి!"

"ఆ దుర్మార్గుడికి బలి అయిపోతానేమో అన్న భయం తప్పించుకునే ధైర్యాన్నిచ్చింది!" లాలస అంది.

నంది ఆమె కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "నీ రక్షణ బాధ్యత ఇప్పుడు నీది కాదు! నిశ్చింతగా, నిర్భయంగా ఉండు!"

లాలస పెదవుల మీద చిరునవ్వు మెరిసింది. "నిజం చెప్పనా? అప్పుడు నా భయం నాకు ధైర్యాన్నిచ్చింది. ఇప్పుడు నీ ధైర్యం ధైర్యాన్నిస్తోంది!"

"నీ మీద ఈగ కూడా వాలనివ్వకూడదనుకున్నాను. కానీ వందల కొద్దీ పక్షులు వాలాయి" నంది నవ్వుతూ అన్నాడు, ముందుకు నడుస్తూ.

"పక్షుల నుండీ రక్షించావుగా?" లాలస అతని వెంట నడుస్తూ అంది.

•••

నందీ, లాలసల ప్రయాణం చీకటి పడేదాకా నదీతీరం వెంటే సాగింది. ఎత్తుగా పెరిగి, దట్టంగా కొమ్మలు పరుచుకున్న చెట్ల కిందా, పొదల మధ్యా కొత్తగా దారి ఏర్పాటు చేసుకుంటూ నడిచారు ఇద్దరూ. నంది కనుచూపు మేరా పరిసరాలను జాగ్రత్తగా గమనిస్తున్నాడు. మానవ సంచారం వల్ల పుట్టే శబ్దాల కోసం అతను చెవులు రిక్కించే ఉన్నాడు. రకరకాల జంతువుల అరుపులు తప్ప, మనిషి కంఠస్వరం వినిపించలేదతనికి.

తమను గుర్రాల మీద వెంటాడుతూ వచ్చిన కళింగ యోధులు వేట చాలించి వెళ్ళిపోయారో, వెంటాడుతూనే ఉన్నారో తనకు తెలీదు. అప్పుడప్పుడు అరణ్యం అంచుకి వెళ్ళి, నది పక్కన చెట్ల చాటు నుండీ అవతలి తీరాన్నీ పరిశీలించి వస్తున్నాడు నంది. మనుషుల అలికిడి గానీ, గుర్రాల

**వెచ్చగా తగుల్తున్న సూర్యకిరణాలు అతణ్ణి మేలుకొలిపాయి. సూర్యుడికి నమస్కరించి పక్కకి తిరిగా చూశాడు నంది. లాలస కనిపించలేదు. దంతధావనానికో, స్నానానికో వెళ్ళి ఉంటుందనుకొని కాసేపు వేచి చూశాడు. నిమిషాలు గడుస్తున్నా లాలస జాడలేదు. ఆందోళన చెందాడు నంది. ఆమెకోసం వెతకనారంభించాడు. లాలస ఏమైనట్లు? ఆమెకు ఏమైనా అపాయం సంభవించిందా?**



## కీర్తినే కారణం!

రకరకాల కారణాల వలన 'నేను లోకల్' సినిమా విడుదల ఆలస్యమవుతోంది. దీని వెనుక ఎన్ని కారణాలున్నా ముఖ్యకారణం కీర్తీ సురేష్ అంటున్నాడు ఆ సినిమా హీరో నాని. ఈ సినిమా ప్రారంభ సమయానికి కీర్తి వేరేభాషలలో సినిమాలు అంగీకరించిందనీ, మధ్య మధ్యలో ఆ షూటింగ్‌లకు హాజరు అవుతుండడంతో షూటింగ్ బాగా లేట యిందనీ, ఈ కారణంగానే సినిమా వాయిదా పడిందని అంటున్నాడు. అయితే ఇప్పటి వరకూ తనతో నటించిన హీరోయిన్లలో కీర్తి ది బెస్ట్ అంటూ కాంప్లిమెంటు కూడా ఇస్తున్నాడు. ఓ పక్క సినిమా ఆలస్యానికి కీర్తి కారణం అంటూనే మరో పక్క ఆమె ది బెస్ట్ అనడంలో నాని ఆంతర్యం అర్థం కావడం లేదని టాలీవుడ్ జనం అంటున్నారు.

గిట్టల చప్పుడు గానీ వినిపించలేదు. వాళ్ళు తమ కోసం వేటాడ్డం మానేశారా? లాలస ఆ సందే హాన్నే వ్యక్తం చేసింది.

"అది మనం ఊహించలేం. కళింగరాజ్యం అవధులు దాటేదాకా మనం జాగ్రత్తగా ఉండాలి. మనం తప్పించుకున్నంత మాత్రాన కళింగ యువ రాజు తన ప్రయత్నం విరమించుకోడు. పట్టుదలా, కసీ పెరుగుతాయిగా?" అన్నాడు నంది.

లాలస ఆందోళనగా చూసింది. నంది చిరు నవ్వు నవ్వాడు. "నిజం చెప్తాను. ధైర్యంగా ఉండు. నువ్వు నీ అంతఃపురంలో అడుగు పెట్టేదాకా, అపాయం నీడలా అనుసరిస్తూనే ఉంటుంది. జన వాసాల్లోకి ప్రవేశించాక మనం ప్రయాణ సదు పాయం సంపాదించుకోవాలి. పాదయాత్రతో గమ్యం చేరడం బాగా ఆలస్యం అవుతుంది.."

"నందీ..." లాలస వణికేకంఠంతో అంది.

"దొరికిపోతామేమో అన్న భయం మనల్ని అనుక్షణం హెచ్చరిస్తూ కాపాడుతూ ఉంటుంది!" అన్నాడు నంది ధైర్యం చెబుతూ.

చీకట్లు ముసిరేవేళకు ఇద్దరూ చెట్లు దట్టంగా ఉన్న ప్రదేశం దాటి, అరణ్యం అంచుకి చేరు కున్నారు.

"లాలసా, ఆ బండరాళ్ళను చూశావా?" ఎదు రుగా పక్కపక్కనే నిలుచున్న రెండు బండ రాళ్ళను చూపిస్తూ అడిగాడు నంది.

"ఏం?" ఒకటి కొంచెం పొట్టిగా, ఒకటి కొంచెం ఎత్తుగా ఉన్న రాళ్ళను చూస్తూ అడిగింది లాలస.

"ఈ రాత్రికి మనకు విశ్రాంతి ఇచ్చే విడిది అదే!" నంది అన్నాడు. "ఈ పళ్ళు ఆరగించి, విశ్రాం తిగా పడుకుందాం. సూర్యోదయంతో మన ప్రయాణం ప్రారంభం".

"నదిలో హాయిగా ఉంది కానీ, నడకతో కాళ్ళు లాగుతున్నాయి!" లాలస చిన్నగా నవ్వింది.

"సీతమ్మ తల్లినీ, ద్రౌపది దేవినీ తలుచుకో!" నంది నవ్వుతూ ఉపాయం ఉపదేశిస్తున్నట్టు అన్నాడు.

•••

పచ్చిక మధ్య మెలికలు తిరుగుతూ వెళ్తున్న సన్నటి బాటలో నడుస్తున్నారు లాలసా, నందీ. రాత్రి రాతిబండల మీద నిద్రించిన ఇద్దరూ ఇప్పుడు త్వరత్వరగా నడవగలుగుతున్నారు. అరణ్యం నుండీ, నదీతీరం నుండీ మానవ సంచారం రూపొందిం చిన సన్నటి కాలిబాట సమీపంలో జనవాసాల ఉనికిని తెలియజేస్తోంది.

నిద్రలేచి, బయలుదేరే ముందు, ముందు జాగ్రత్తతో నంది రెండు మూడు రకాల పళ్ళూ, కాయలూ సేకరించాడు. మిట్టమధ్యాహ్నం అయ్యే సరికి చెట్టు నీడలో కూర్చుని ఇద్దరూ ఆకలి తీర్చుకున్నారు. నంది సూచనను పాటిస్తూ లాలస పచ్చిక మీద నడుం వాల్చింది. తల నేలను తాకిన క్షణంలోనే నిద్రలోకి జారుకున్న లాలసను నంది జాలిగా చూశాడు. తనంత తానుగా ఆమె మేలుకునేదాకా వేచి ఉండాలని నిశ్చయించుకుని, చెట్టు బోదెకు వీపు ఆన్చి కూర్చున్నాడు.

సూర్యుడు పశ్చిమదిశ వైపు వాలుతున్నాడు. లాలసకు మెలకువ రాగానే ప్రయాణం పునః ప్రారంభించాడు నంది. కొంత దూరం ప్రయాణం చేశాక కాలిబాట వెడల్పును సంతరించుకుంది. రెండు చక్రాల బళ్ళు ప్రయాణించిన ఆనవాళ్ళు స్పష్టంగా అగుపిస్తున్నాయి. ముఖ్యంగా మార్గా నికి ఇరువైపులా పంట పొలాలు...

నంది నడకలో వేగం పెరిగింది. త్వరలో తాము ఏ రాజ్యంలో ఉన్నామో తెలిసిపోతుంది. ఎటు వెళితే ఏ నగరం వస్తుందో, ఏరాజ్యం తగు ల్తుందో తెలిసిపోతుంది. ప్రయాణం సాగుతోంది. ఎండ వేడిమి తగ్గుముఖం పడుతోంది.

ఎదురుగా పచ్చికబయళ్ళలో ఆవులూ, గేదెలూ మేస్తున్నాయి. పల్లెపట్టులు దగ్గరవుతున్నాయి! ఆ విషయాన్ని వివరిస్తూ నంది లాలసకు ఉత్సాహం అందిస్తున్నాడు. దారి పక్కనే ఒక గేదె, ఒక ఆవు ఉన్నాయి. గేదె మీద ఒక కుర్రవాడూ, ఆవు మీద ఒక కుర్రవాడూ కూర్చున్నారు! ఇద్దరి చేతుల లోనూ సన్నటి బెత్తాలున్నాయి. తమ మూపుల మీద కాపరి కుర్రవాళ్ళు కూర్చున్న విషయాన్ని పట్టించుకోకుండా, గేదె , ఆవు ఏకాగ్రతతో పచ్చిక మేస్తున్నాయి.

తమ వైపు వస్తున్న కుర్రవాళ్ళ దగ్గరగా ఆగి, నంది చిరునవ్వుతో చూశాడు.

"ఎవరు మీరు?" గేదె మీద కూర్చున్న కుర్ర వాడు తలపాగాను ఒక చేత్తో సర్దుకుంటూ అడి గాడు.

"మీరెవరు?" నంది నవ్వుతూ ప్రశ్నించాడు.

"నేను యమధర్మరాజు.." గేదె కుర్రవాడు అన్నాడు.

"నేను శివుడు!" ఆవు కుర్రవాడు అందుకున్నాడు.

నందీ, లాలసా పక్కున నవ్వారు. "మరి నీ వాహనం దున్నపోతు కదా? గేదెనెక్కావేం?" నంది అన్నాడు.

"నేను నిజం యమధర్మరాజును కాను గదా! అందుకు" కుర్రవాడు తెలివిగా అన్నాడు.

"నేనూ అంతే...నిజం శివుణ్ణి కాను. అందుకే ఎద్దును ఎక్కకుండా ఆవునెక్కాను!" రెండో కుర్ర వాడు అన్నాడు.

"మీది ఏ ఊరు?" నంది అడిగాడు.

"పెద్దకొండపల్లి!" గేదె కుర్రాడు సమాధానం చెప్పాడు.

"ఇది ఏ రాజ్యం నాయనా?" లాలస ఆవు కుర్రవాడిని అడిగింది.

"ఇది...అంటే...మాది...సారంగ రాజ్యం!" కుర్రాడు అన్నాడు.

కొంచెం దూరంలో గంటల చప్పుడైంది. నంది తలతిప్పి చూశాడు. రెండెడ్ల బండి వస్తోంది. ఎడ్ల మెడలోని గంటలు గలగల మ్రోగుతున్నాయి.

"మీరెవరు?" గేదె కుర్రవాడు అడిగాడు.

"మాది పక్కరాజ్యంలే!" నంది అన్నాడు బండి నొగల మీద కూర్చున్న రైతును చూస్తూ.

కాస్సేపట్లో బండి వాళ్ళ దగ్గరగా వచ్చింది. నంది చెయ్యెత్తి ఆగమన్నట్టు సైగచేశాడు. రైతు పగ్గాలు లాగి, బండిని ఆపి, ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇది సారంగ రాజ్యమని చెప్పారు పిల్లలు. సారంగ రాజ్యం కళింగ రాజ్యానికి సామంత రాజ్యమా?" నంది అడిగాడు.

"సారంగ రాజ్యం స్వతంత్ర రాజ్యం నాయనా! పాడిపంటలతో సుభిక్షంగా, వీర సైనిక బలగాలతో సురక్షితంగా ఉన్న రాజ్యం. చిన్నదైనా మాది సామంత రాజ్యం కాదు!" రైతు సగర్వంగా అన్నాడు.

"రాజధాని.."

"రాజధాని ఆనందసాగర నగరం. కొంచెం ముందుకు వెళ్ళి ఎడమకు తిరగండి. ఆగకుండా నడిస్తే చీకటి పడేవేళకు నగరం చేరుకుంటారు. ఒక యోజన దూరం అంతే!" రైతు వివరించాడు. బండి ముందుకు సాగింది.

నంది లాలసను చిరునవ్వుతో చూశాడు. "దారీ తెన్నూ తెలియకపోయినా, శత్రురాజ్యాన్ని దాటేశాం."

**(ఇంకా వుంది)**




ఉన్నప్పుడు,
తిన్నప్పుడు
అమ్మా నాన్నలు
ఆది దేవుళ్ళు

## సమాధిరాళ్లు

ఉన్నది కాస్త
ఆరిపోయాక
వారా ఇంట్లో మిగిలిన
సమాధి రాళ్ళు.



## గాజుపెట్టె

తొమ్మిది నెలలు
నిన్ను కడుపులో మోసింది
గాజుకన్నా భద్రంగా
చూసింది.
నువ్వూ చూసావు
గాజు పెట్టెలో
ఒకట్రెండ్రోజులు
ఇంకా భద్రంగా చల్లగా
కాకపోతే
నాడు ఆమె
నీకు ప్రాణం ఇచ్చింది.
నేడు నువ్వామెకు
పరలోక స్థానమిచ్చావు!

-మోదు రాజేశ్వరరావు
సెల్:93964 47227

# విగ్రహాల పార్కు

పార్కుకు ఎవరయినా ఎందుకు వెళతారు? పెద్దవాళ్ళయితే సరదాగా గడపడానికి, చిన్నపిల్లలయితే ఆడుకోవడానికే కదా! మరి వీటికి కాకుండా పొద్దుపొద్దునే వాకింగ్‌కే ఉపయోగిస్తారు. కానీ ఆ పార్కులో మాత్రం అలాంటివేమీ ఉండవు. ఎటువైపు చూసినా, అడుగు కదిపినా విగ్రహాలే కనిపిస్తాయి.



పురేయో సేకిబుట్సు నౌశాటో అనే గ్రామంలో ఈ పార్కు ఉంది. ముట్సువో పురుకావా 1989లో ఈ పార్కును నిర్మించాడు. ఒక పర్యాటక ప్రాంతంగా తీర్చిదిద్దాడు. ఇక్కడ కొంత మంది బౌద్ధుల విగ్రహాలు, ముట్సువో పురుకావాకు తెలిసిన కొంతమంది వ్యక్తుల విగ్రహాలు ఏర్పాటు చేశారు. చైనా శిల్పిని రప్పించి, అతనికి ఫోటో లను చూపించి విగ్రహాలను చెక్కించాడు.

ఎందువల్లో కానీ ఈ పార్కును పట్టించుకోవడం మానేశారు. ఎందుకో ఎవరూ చెప్పలేకపోతున్నారు. ఇప్పుడు ఆ పార్కులో విగ్రహాల ఎత్తుకు గడ్డి పెరిగి చాలా విగ్రహాలు సరిగ్గా కనబడకపోయినా సందర్శకులు మాత్రం ఈ విగ్రహాలను చూడటానికి వస్తూనే ఉన్నారు.

# ఆకర్షణ

అయస్కాంతం దొరికితే చాలు అదేపనిగా ఇనుప వస్తువులను వాటికి అంటించేస్తుంటారు పిల్లలు. అదో ఆనందం వాళ్లకి! మరి ఏకంగా వస్తువులే వచ్చేసి శరీరానికి అతుక్కుంటే...అయస్కాంతం వంటి శరీరమే ఉంటే... ఇంక చెప్పేదేముంది పళ్లాలు, ఫోర్కులు, కత్తులు అన్నీ పోయి శరీరానికి అతుక్కుంటాయి. నా శరీరం కూడా అలాంటిదేనంటున్నాడు నర్మిన్ హాలిలాజిక్! ఇతడు బోస్నియా అండ్ హెర్జ్‌గోవినా నివాసి. ఇతని శరీరానికి ఇనుప వస్తువులు, స్టీలువే కాదు ప్లాస్టిక్ వస్తువులు కూడా అతుక్కుంటాయట. విడ్డూరంగా ఉందికదూ! ఇతనొక్కడే మొదటి హ్యూమన్ మాగ్నెట్ అనుకుంటే పొరపాటే! చైనాకు చెందిన వాంగ్ బావోకియాంగ్ కూడా ఇలాంటి మాగ్నెట్ శరీరాన్నే కలిగి ఉన్నాడట.



# పత్రికల ఇల్లు

చదివిన దినపత్రికలను ఎవరైనా ఏంచేస్తారు? అమ్మడమో, పక్కన పడేయడమో చేస్తారు. కానీ ఆయన ఏకంగా పేపర్లతో ఇంటినే కట్టేశాడు. ఈ వైవిధ్యమైన ఇంటిని చూడాలంటే అమెరికా వెళ్లాల్సిందే!



అమెరికా, మసాచుసెట్స్ దగ్గరలోని పిజియన్ హిల్ స్ట్రీట్‌కు వెళితే ఈ పత్రికల ఇల్లు కనిపిస్తుంది. ఎలిస్ స్టెన్‌మన్ అనే ఇంజనీర్ 1922లో మొదలుపెట్టి, రెండు సంవత్సరాల పాటు కష్టపడి ఈ ఇంటిని నిర్మించుకున్నాడు. ఈ ఇంట్లో వంట చేసే ప్రాంతం మినహాయించి, మిగిలినవన్నీ పత్రికలతో చేసినవే. ఎలిస్ మరణించాక 1942లో ఈ ఇంటిని మ్యూజియంగా మార్చారు.

# సురభి

## మార్కులు కావాలా నాయనా!

అవసరానికి చేతిలో డబ్బులు ఆడకపోతే పక్కింటివాళ్ల దగ్గరో, ఎదురింటివాళ్ల దగ్గరో అప్పులు చేసి, డబ్బులు రాగానే తిరిగి తీర్చేస్తుంటారు. మరి పరీక్షల్లో పాసవ్వాలంటే మినిమమ్ మార్కులు కూడా రాక ఫెయిలైతే... ఒక సంవత్సరం వృథా అవుతుంది. మళ్లీ పరీక్ష రాయాలి. కానీ ఇవేవీ లేకుండానే చైనాలోని ఓ స్కూలు వారు ఫెయిలైన విద్యార్థులకు మార్కులను అప్పుగా ఇస్తున్నారు.



తూర్పు చైనాలోని నాంజింగ్ నగరంలో ఉన్న ఓ స్కూల్లో 'గ్రేడ్స్ బ్యాంక్'ను ఏర్పాటు చేశారు. విద్యార్థులు ఫలితాల వల్ల మానసికంగా కుంగిపోకూడదని ఈ బ్యాంకును ఏర్పాటుచేశారు సదరు స్కూలు నిర్వాహకులు. విద్యార్థులు తాము ఫెయిలైన సబ్జెక్టు పాస్ కావడానికి ఎన్ని మార్కులు కావాలో, వాటిని ఈ బ్యాంకు ద్వారా అప్పుగా తీసుకుంటారు. తిరిగి రెండో టర్మ్ పరీక్షల్లో ఎక్కువ మార్కులు సాధించి, చేసిన అప్పును తీర్చేస్తారు. అంటే రెండో టర్మ్‌లో వచ్చిన మార్కుల్లో అప్పుగా ఇచ్చిన మార్కుల్ని కట్ చేస్తారు. ఎవరైతే సమయానికి అప్పు చెల్లించలేదో వారిని బ్లాక్‌లిస్టులో పెట్టి మరోసారి అప్పు ఇవ్వరట. ఇప్పటివరకు 13 మంది విద్యార్థులు ఈ సదుపాయాన్ని ఉపయోగించుకున్నారట.

## ఒంటరి జీవితం

కాసేపు ఒంటరిగా ఉండాలంటేనే ఏదో బెరుకు, దాంతోపాటు కాస్తంత భయం కూడా మొదలవుతుంది. నోరు తెరిచి మాట్లాడే వీలుండదు. పిచ్చెక్కినంత పనవుతుంది ఎవరికైనా. కానీ ఓ పెద్ద మనిషి మాత్రం ఒంటరిగా ఓ మంచుపర్వతంపై నివసిస్తున్నాడు. అదీ నలభై యేళ్లుగా!



అమెరికా, న్యూజెర్సీకి చెందిన 60 ఏళ్ల బిల్లీబర్ ఎన్విరాన్‌మెంటల్ సైన్స్ చదివాడు. 1972లో పరిశోధన నిమిత్తం రాకీ మంచు పర్వత ప్రాంతం కొలరాడోలోని గౌతిక్ పట్టణానికి వెళ్ళాడు. 1920 నుంచే ఆ పట్టణంలో జనసంచారం లేదు. దీంతో దాన్ని దయ్యాల ఊరుగా పిలుస్తారు. బిల్లీకి ఆ పట్టణం బాగా నచ్చింది. అక్కడే ఒంటరిగా జీవించాలని నిర్ణయించుకున్నాడు. ఆ ఊర్లోనే ఉన్న ఓ భవనంలో మకాం పెట్టాడు. సమీపంలోని పట్టణంలో కావాల్సిన సరుకులు తెచ్చుకుంటున్నాడు. అవసరమైతే తప్ప ఇతరులతో మాట్లాడడు. ఒంటరిగా ఉండటం వల్ల బోర్ కొట్టి, కెమెరాతో అక్కడి అందాల్ని, ప్రకృతిలో జరుగుతున్న మార్పులను వీడియో తీయడం మొదలెట్టాడు. ఇలా ప్రకృతిలో మార్పులను నలభై ఏళ్లుగా వీడియో తీస్తూ వస్తున్నాడు. అయితే బిల్లీ తీసిన వీడియో ప్రస్తుతం గ్లోబల్ వార్మింగ్ పరిశోధనలకు ఎంతో ఉపయోగకరంగా మారింది.

-నర్మద వాసిరెడ్డి



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 19

(గతవారం తరువాయి)

**రాజమండ్రి దగ్గర రామచంద్రాపురంలో చిన్నరాయుడు సినిమా షూటింగ్ జరుగుతోంది. బాబూమోహన్ అర్జంట్‌గా సాయంత్రమే ట్రైన్‌కి వెళ్ళిపోవాలి. దాంతో లంచ్‌కూడా మరచిపోయి విరామంలేకుండా షూటింగ్ చేస్తున్నాం.**

ఒక షాట్‌లో నేను వేలుపైకెత్తి ఓ వైపు చూపించి 'ఆ చెట్టుకి కొబ్బరికాయలు ఎన్ని ఉంటాయిరా' అని అడిగా.

బాబూమోహన్ అటువైపు తిరిగి 'ఒకటీ, రెండూ..' అని లెక్కపెట్టసాగాడు.

# ప్రతిభావంతుడైన నటుడు బాబూమోహన్

కాలితో నడ్డిమీద తన్నా. మామూలుగా నేను తంతే కాలు అలా టచ్ అవుతుందో, లేదో వెంటనే పడిపోయేవాడు. కానీ ఆ వేళ నా కాలు కాస్త బలంగా తగిలింది.

వాడు బొక్కబోర్లాపడ్డాడు. ఆ చెరువు గట్టు మీంచి 50 అడుగులు దొర్లుకుంటూ పోయాడు. నాకు కంగారులో చెమటలు పట్టేశాయ్. మిగిలిన యూనిట్ అంతా అది నటన అనుకుంటున్నారు. కానీ నిజం నాకు మాత్రమే తెలుసు. వాడు అసలే వేరే షూటింగ్‌కి వెళ్ళాలి. ఏమైనా దెబ్బలు తగిలాయేమోనని నాకు ఒకటే ఆదుర్దా.

అంతలోనే పైకి లేచి 'టేక్ ఓకేనా సార్' అన్నాడు.

డైరెక్టర్‌గారు 'ఓకే' అనగానే గబగబా పైకి వచ్చాడు.

నేను వాడికి ఎదురెళ్ళి 'సారీరా ఏమీ అనుకోకు.. కాస్త కాలు తగిలింది' అన్నా.

'ఫర్వాలేదన్నా. ఏం ఫర్లేదు. మనకి సీన్ బాగా రావాలి అంతే. సీన్ బాగొచ్చిందిగా.. సరే రెండు మెతుకులు తిందాం పదన్నా.. అవతల టైమ్ అవుతోంది' అన్నాడు.

### ముద్దలు కలిపి పెట్టేవాణ్ణి

బాబూమోహన్ కమిటెడ్ ఆర్టిస్టు. ప్రతిభావంతుడు. నటనంటే అభిలాష ఉన్న మనిషి. తను నమ్ముకున్నదాన్ని బతికించాలనుకునే తత్వం గలవాడు. 'నేను చేసినట్టు ఎవరూ చేయకూడదు. అందర్నీ మించిపోయేటంత బాగా నటించాలి' అని నిత్యం అనుకునే వ్యక్తి. నాకు ఇంకో మంచి తమ్ముడు దొరికాడని నాలో నేను అనుకున్నా.

అప్పటినుంచి ఎన్నోసార్లు తనకి ముద్దలు కలిపి పెట్టేవాణ్ణి. రాజమండ్రి అనుకుని బెజవాడలో దిగిపోయాం. అప్పట్లో ఏసీ టూ టైర్లు వంటివి లేవు. అందరికీ ఫస్ట్ క్లాసే ఇచ్చేవాళ్ళు. మేమిద్దరం చాలా వరకు కలిసే ట్రావెల్ చేసేవాళ్ళం.

ఒకసారి తిరుపతిలో ఏదో షూటింగ్ చేశాం. అక్కడ రైలెక్కి మరుసటి రోజు ఉదయాన్నే రాజమండ్రి చేరుకోవాలి. షూటింగ్ ప్యాకప్ చెప్పగానే మేకప్ తీసేసి గబగబా స్టేషన్‌కి చేరుకుని ట్రైన్ ఎక్కాం. రాత్రి పదిన్నరదాకా ఏవో కబుర్లు చెప్పుకుని పడుకున్నాం.

'తెల్లారుజామున ఐదుగంటలకి లేవాల్రోయ్. నాకు కాస్త నిద్రపట్టినా, నువ్వు రవ్వంత మెలకువగా ఉండు' అని వాడితో చెప్పా.

'సర్లేన్నా పడుకో, లేపుతాలే' అన్నాడు.

అలా నిద్రలోకి జారుకున్నట్టు అనిపించింది.. అంతలోనే,

'అన్నా లేలేలే. బ్రిడ్జి వచ్చేసింది. మనం అన్నీ సర్దుకుని దిగాలి' అని లేపుతున్నాడు.

'అప్పుడే వచ్చిందేరా' అని అడిగా నిద్ర మత్తులో.. నాకేమో అప్పుడే పడుకున్నట్టుంది.

'వచ్చింది. లేలేలే' అన్నాడు.

స్టేషన్‌లో దిగి సూట్‌కేస్ పోర్టర్‌కిచ్చి నడుస్తున్నాం. చుట్టూచూస్తే స్టేషన్ చాలా పెద్దగా ఉంది. ఎందుకో అనుమానం వచ్చి,

'ఏమయ్యా.. ఇది రాజమండ్రి స్టేషనేనా' అన్నా..

'ఇది రాజమండ్రి ఏమిటండీ.. బెజవాడండీ' అన్నాడు పోర్టర్.

'ఓరి నీ దుంపదెగ..' అని బాబూమోహన్‌ని ఏదో అనబోయేసరికి మేం దిగిన ట్రైన్ కదులుతోంది.

ఒక్కక్షణం ఇద్దరికీ భయమేసింది.

నిద్రమత్తు ఒక్కసారి వదిలినట్లైంది.

పోర్టర్ చేతిలో ఉన్న సూట్‌కేసులు లాగి ట్రైన్ లోపలికి విసిరేసి ఇద్దరం చకచకా ఎక్కేశాం.

ఎలా ఎక్కామో దేవుడికే తెలియాలి.

నిద్ర టైమ్‌లో అలా పరిగెత్తించాడని నాకు వాడిమీద చాలా కోపం వచ్చింది. సినిమాలో కొట్టినట్టు ఒకటి కొట్టా.

'ఏరా.. ఏంట్రా ఇది. రైలెక్కేటప్పుడు కాస్త కాలు జారి ఉంటే ఏమయ్యేదిరా..' అని తిట్టా.

'ఏం లేదన్నా... సారీ! బెజవాడ కృష్ణా బ్యారేజ్ సౌండ్ వినేసరికి గోదావరి బ్యారేజ్ సౌండ్‌లానే



# మా కాంబినేషన్ మారినప్పుడు నటనలో తృప్తి ఉండేది కాదు



## -బాబూమోహన్

బి.గోపాల్‌గారు తెరకెక్కించిన 'బొబ్బిలిరాజా' షూటింగ్‌లో కోటన్నతో మంచి పరిచయం ఏర్పడింది.

'తెలంగాణ యాసలో డైలాగులు చెప్పండి' అని బి.గోపాల్‌గారు అన్నచేత డైలాగులు చెప్పించుకుని వినేవారు. నేనుకూడా పక్కనచేరి చాలా బాగా ఎంజాయ్ చేసేవాణ్ణి.

అలా మొదలైన మా పరిచయం 'మామగారు' నుంచి 'జంట' అనే పేరు తెచ్చుకుని వెండి తెరమీద ముమ్మరమైంది. 'బావ బావమరిది' సినిమాతో మా కాంబినేషన్ ముదరపాకానికి వచ్చింది. ఇక 'వీళ్ళ కాంబినేషన్ మస్ట్' అనే ఫీలింగ్ పరిశ్రమలోనూ, ప్రజల్లోనూ వచ్చింది. అప్పటినుంచి మామీద డిఫరెంట్ డిఫరెంట్ క్యారెక్టర్లు రాసేవారు. సెటైర్లుగానీ, ఎక్స్‌ప్రెషన్స్ గానీ 'ఈ టైపు పెడితే వీళ్ళ మీదనే పెట్టాలి' అన్నట్టు చేసేవారు. కోటన్న ఎలాంటివాడంటే గ్లాసులో పోసిన నీరులాగా, తనకు ఇచ్చిన పాత్రకు అనుగుణంగా అందులో నటుడు. అప్పటికే విలన్‌గా నెంబర్ వన్ పొజిషన్‌లో ఉన్నాడు. ఆయనలో గొప్పతనమేంటంటే నాతో చేసేటప్పుడు ఫ్యామిలీలకు నచ్చే విధంగా నటించేవాడు.

నేను 'అన్నా..' అని పిలిస్తే,

'ఆ.. ఏంటీ' అని వింత ఎక్స్‌ప్రెషన్ ఇచ్చేవాడు. దాంతో ఆబాలగోపాలానికీ నచ్చేవాడు.

'రాజేంద్రుడు గజేంద్రుడు'లో నీ భార్య డ్రెస్సు వేసుకుంటే చూశాను అనే సీన్ ఒకటి ఉంటుంది. ఆ సీన్‌లో ఆయన తంతాడు. నేను పడతాను. పడిపోయి స్టైల్‌గా కృష్ణుడులాగా పడుకుని 'ఆ ఏంటన్నా' అని ఎక్స్‌ప్రెషన్ పెడతా. ఆ సినిమాలు ఇప్పుడు టీవీల్లో వస్తుంటే 'అసలు ఇవన్నీ ఎలా చేశాం? చేసింది మేమేనా? ఇప్పుడు అలాంటి కామెడీ ఏదీ? రోజులు ఎలా మారిపోయాయి?' అనిపిస్తూ ఉంటుంది. మా జ్ఞాపకాలు ఒకటీ అరా కాదు.

### నా నటనకు మెరుగులు దిద్దినవాడు

నాకు నటనలో బెటర్‌మెంట్ నేర్పినవాడు కోటన్న.

పేర్లు ఎందుకులేగానీ, కోటన్న ప్లేస్‌లో కొన్ని సార్లు మిగిలిన ఆర్టిస్టులు వచ్చేవారు. నాకేమో వాళ్లతోకలిసి నటిస్తే తృప్తిగా ఉండేది కాదు. ఏదో చప్పగా ఉండేది. 'సమ ఉజ్జీ లేకపోయెనే' అనే ఫీలింగ్ ఉండేది.

మరలా ఇద్దరం మరుసటి రోజో, ఎప్పుడో కలుసుకునేవాళ్ళం.

'ఏరా.. ఎక్కడ?' అనేవాడు.

'ఫలానా షూటింగ్ అన్నా. ఇంతకీ నువ్వెక్కడ' అనేవాణ్ణి నేను.

'ఏదోరా.. ఫలానా దగ్గర. వాడెవడో చేశాడ్రా.. నాకు ఆనలేదు' అనేవాడు.

నేను కూడా వెంటనే 'నాక్కూడా అంతేనన్నా. నువ్వు లేకుంటే తోచలేదన్నా' అని చెప్పేవాణ్ణి.

అంటే ఇద్దరం చెప్పుకునేది ఒకటే. మేం ఇద్దరం కలిసి షాట్ చేశామంటే ఒకరికొకరం ఇచ్చుకునే రియాక్షన్లు కరెంట్ షాక్ కొట్టినట్టు ఉండేవి. అదే మిగిలిన ఆర్టిస్టుకైతే అంత తేలిగ్గా అవి వీలయ్యేవి కావు. మా ఇద్దరినీ దేవుడే కలిపాడని నా ఫీలింగ్. మా ఇద్దరికీ రాత కూడా ఒకలాగే రాశాడు దేవుడు. మా అబ్బాయి, కోటన్న కొడుకు ఇద్దరూ యాక్సిడెంట్‌లోనే కన్నుమూశారు. మా బాబుకి యాక్సిడెంట్ అయిన రోజు తను బైక్ మీద ఉన్నాడు. వెనుక మా చిన్నబాబు కారులో ఉన్నాడు. అలాగే అన్న వాళ్లబ్బాయి ముందు బైక్ మీద వెళ్తున్నాడు. వెనుక భార్యాపిల్లలు కారులో వెళ్తున్నారు. నా కొడుకు గుర్తొస్తే వెంటనే అన్న కొడుకు గుర్తొస్తాడు. అన్నకీ అంతే. అసలు అంత పెద్ద శోకాన్ని ఎలా దిగమింగుతున్నామో భగవంతుడికి తెలుసు. నేను రాజకీయాల్లో ఉన్నా, అన్న సినిమాల్లో ఉన్నా అప్పుడప్పుడూ వచ్చి కలుస్తూ ఉంటా. ఆ రోజుల్ని గుర్తుచేసుకుంటూ ఉంటాం.

వినిపించింది. అందుకే నిద్ర లేపా' అన్నాడు.

ఉదయాన్నే రైలు దిగి లొకేషన్‌కి వెళ్ళాం. అప్పటికే కోడి రామకృష్ణ అండ్ యూనిట్ మొత్తం అక్కడ ఉంది. మేం వెళ్ళగానే మా కాంబినేషన్‌లో సీన్లు తీసేలా ప్లాన్ చేసుకున్నట్టున్నారు. మేకప్ వేసుకుని మా సీన్లు చేస్తున్నాం. లంచ్ బ్రేక్‌లో కోడి రామకృష్ణ గారు వచ్చి 'మీరిద్దరూ కాస్త ఆ లొకేషన్‌కు వెళ్ళి రండి' అన్నారు.

ఏ లొకేషనా? అని ఆరా తీస్తే, అది రేలంగి నరసింహారావుగారి లొకేషన్. ఆయన 'ఎదురింటి మొగుడు పక్కింటి పెళ్ళాం' సినిమా తీస్తున్నారప్పుడు. మా ఇద్దరి కాంబినేషన్‌లో కొన్ని సీన్లు మిగిలిపోయాయి. వాటిని షూట్ చేసేందుకు మా కాల్షీట్లు దొరకలేదు. దాంతో రేలంగిగారు యూనిట్‌తో సహా రాజమండ్రికి వచ్చేశారు. ఆ విషయం తెలిసి ఆశ్చర్యపోయాం.

అక్కడికి వెళ్ళి 'ఎందుకండీ పాపం ఇంతదూరం రావడం.. ఎలాగోలా అడ్జస్ట్ చేసేవాళ్ళంగా' అన్నాం.

'ఫర్వాలేదండీ. మీ పరిస్థితి చూస్తూనే ఉన్నాం. మీరు రావడంకన్నా, మేం రావడమే నయమనిపించింది' అన్నారు రేలంగిగారు.

అప్పుడే కాదు, ఆ తర్వాతకూడా ఎన్నోసార్లు కాల్షీట్లు అడ్జెస్ట్ చేసేవాళ్ళం. ఆ అడ్జస్ట్‌మెంట్‌లో భాగంగా చాలా ఇబ్బందులు అవస్థలు పడాల్సి వచ్చేది. మరీ ముఖ్యంగా రైలు ప్రయాణంలో. హడావిడిగా వెళ్ళి రైలు ఎక్కేస్తే సీట్లు దొరికితే దొరికినట్టు, లేకుంటే లేదు. దొరకనప్పుడు బాత్రూమ్‌ల దగ్గర పేపర్లు పరుచుకుని కూర్చునేవాళ్ళం. ఆ పక్కనే మామూలుగా అటెండర్ పడుకోవడానికి ఓ చెక్క ఉండేది. అటెండర్ మమ్మల్ని గౌరవించి ఎప్పుడైనా ఆ చెక్క మాకు ఇచ్చి తను ఆ పక్కన ఎక్కడో పడుకునేవాడు. బాబూమోహన్ నా పక్కనే కింద పడుకునే వాడు. కొన్నిసార్లు నాకే బాధగా అనిపించేది.

'నువ్వు పైన పడుకోరా, నేను కింద పడుకుంటాలే' అనేవాణ్ణి. ఆ సమయానికి మనసులో ఏది తోస్తే అలా జరిగిపోయేది.

### టిక్కెట్ల గోల్‌మాల్

ఇప్పుడంటే రైల్వేలో కన్‌ఫర్మ్ టిక్కెట్లు పెద్దవి, ప్లాట్‌ఫామ్ టిక్కెట్లు చిన్నవి అని ఉన్నాయి. కానీ అప్పట్లో పరిస్థితి వేరు. ప్లాట్‌ఫామ్ టిక్కెట్ దగ్గర్నుంచి, రిజర్వేషన్ టిక్కెట్లవరకు అన్నీ చిన్నవే ఉండేవి. మేం ఏ రోజూ రైల్వేస్టేషన్‌కి ముందుగా వెళ్ళగలిగేవాళ్ళం కాదు. అప్పుడున్న బిజీ అలాంటిది మరి. ముందు ఎవరో ఒకరిని పంపేవాళ్ళం. ఎక్కువగా ప్రొడక్షన్ మేనేజర్లు వెళ్ళేవారు. మేమేమో ట్రైన్ బయలుదేరుతుందనగా స్టేషన్‌కి చేరుకునేవాళ్ళం. హడావిడిగా ట్రైన్ ఎక్కుతున్నప్పుడు వాళ్ళు మా చేతిలో టిక్కెట్లు పెట్టి 'సార్ మీ సూట్‌కేసు లోపల పెట్టాం. టీసీతో మాట్లాడాం. వెళ్ళి రండి' అనేవారు.

టీసీ వచ్చాక టిక్కెట్లు చూపించేవాళ్ళం.

'ఏం సార్.. జోక్ చేస్తున్నారా' అని అడిగేవాడు టీసీ.

'ఏమైంది సార్' అని అడిగితే

'ఇది ప్లాట్‌ఫామ్ టిక్కెట్ సార్' అనేవారు.

అంటే ఆ ప్రొడక్షన్ మేనేజర్లు హడావిడిలో మాకు ఒరిజినల్ టిక్కెట్ల బదులు ప్లాట్‌ఫామ్ టిక్కెట్లు ఇచ్చేవారన్నమాట. ట్రైన్ బయలుదేరి అప్పటికే అరగంటయ్యేది. ఇంక ఆలోచన వేస్ట్ అని, అప్పుడు టీసీ ఏం రాసిస్తే ఆ ఫైన్ కట్టేసేవాళ్ళం. ఆ తర్వాత మమ్మల్ని ట్రైన్ ఎక్కించిన వాళ్ళు ఎప్పుడో కనిపించేవారు. మాకేమో ఆ విషయం ప్రస్తావించాలనిపించేది కాదు.

**(ఇంకా ఉంది)**

**- డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**



# సాహస జంటలు... క్రేజీ పెళ్ళిళ్ళు

**పెళ్ళి**
**రెండు జీవితాలను ముడివేసే బంధం.**
**మనిషి జీవితంలో ముఖ్యఘట్టం.**

**ఈ కాలం పెళ్ళిళ్ళు అంగరంగ వైభవంగా జరుగుతున్నాయి.**

**ఒకే ముహూర్తానికి వేలాది పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి.**

**అందులో వింతా లేదు, గుర్తింపూ లేదు.**

**అందుకే జీవితంలో ఒకేఒక్కసారి వచ్చే ఈ మహాఘట్టాన్ని డిఫరెంట్‌గా, కోట్లాదిమందికి తెలిసేలా చేసుకోవాలని కొందరు తాపత్రయపడుతున్నారు.**

**సాహసకృత్యాలు చేస్తూ పెళ్ళాడేసేవారు కొందరైతే, ఖరీదైన పెళ్ళిళ్ళతో సత్తాచాటేవారు మరికొందరు!**

**ఇలా వింత వింత పోకడలతో పెళ్ళాడి ప్రపంచ దేశాలన్నీ గుర్తుంచుకునేలా వార్తల్లోకి, గిన్నిస్ రికార్డుల్లోకి ఎక్కుతున్నారు.**

మొత్తంమీద ఇప్పుడు 'మ్యారేజ్' కొందరికి క్రేజ్‌గా, మరికొందరికి డ్యామేజ్‌గా ఇంకొందరికి బాండేజ్‌గా తోస్తోంది! కానీ సాదాసీదా జనం పెళ్ళిని వేడుకగా మాత్రమే చూస్తుంటే సిరిగలవారు మాత్రం వందలకోట్లు ఖర్చుచేస్తూ అదనపు సొబగులతో పెళ్ళి వేడుకకు కొత్త నిర్వచనాలిస్తున్నారు.

చుట్టుపక్కల పదిఊళ్ళలో చెప్పుకునేలా పెళ్ళి ఘనంగాచేసి బంధువుల మన్ననలు అందుకుంటారు కొందరు. పెళ్ళి ఇప్పుడు ఈ దశదాటి వెళ్ళిపోయింది. కొందరు గాల్లో తేలుతూ, మరికొందరు నీటి అడుగున విహరిస్తూ, ఇంకొందరు శిఖరం అంచున నిలబడి పెళ్ళాడేస్తూ 'పంచభూతాల సాక్షిగా..' అనే పదానికి నిజమైన అర్థం చెప్పేందుకు సాహసాలు చేస్తున్నారు!

ఇలా సాహసాల పెళ్ళిళ్ళు, ఖరీదైన పెళ్ళిళ్ళతో వార్తల్లోకెక్కిన వాళ్ళ పెళ్ళిళ్ళ గురించి మీరూ తెలుసుకోండి!

### రోప్‌పై పెళ్ళి

అమెరికా హ్యూస్టన్ నగరంలో ఓ సర్కస్ సెంటర్‌నే వేదికగా చేసుకుని ఓ జంట ఒక్కటైంది. ముస్తాఫా డంగీర్, అన్నా లెబెదెవా ఇద్దరూ సర్కస్ విన్యాసాలు చేసేవారే. అందుకే విన్యాస భరితమైన వివాహంతో చరిత్రలో నిలిచిపోవాలనుకున్నారు. రోజూ రోప్‌వాక్ చేసే తాడునే పెళ్ళిమండపంగా మలచుకున్నారు. ముందుగా వరుడు రోప్‌వేపై చకచకా నడిచి మధ్య లోకి వచ్చేశాడు. ఆ తర్వాత వధూమణి మెరిసిపోయే తెల్లటి దుస్తుల్లో ప్రత్యక్షమైంది. హైహీల్స్ వేసుకుని ఏ మాత్రం బెరుకు లేకుండా రోప్‌పై ఎదురుచూస్తున్న వరుణ్ణి చేరుకుంది. మొదట ఒకరికొకరు ముద్దు లిచ్చు కున్నారు. ఆపై ఉంగరాలు మార్చుకున్నారు. పెళ్ళితంతు ముగియగానే ముప్పయ్ అడుగుల మీదున్న రోప్‌పై వడివడిగా నడిచి కిందకి చేరుకున్నారు. ఈ సాహస కల్యాణం వీక్షించిన సర్కస్ సావాసగాళ్లు వధూవరుల్ని ఆశీర్వదించారు. సర్కస్ జంతువు లన్నీ ఈవేడుకలో పాల్గొన్నాయి.

### కొండెక్కిన పెళ్ళి!

మనిషి జీవితంలో పెళ్ళి అతి ఉన్నతమైన ఘట్టం. అందుకే ప్రతి ఒక్కరూ పెళ్లికి అంత ప్రాముఖ్యమిస్తారు. ఒక్కరోజు జరిగే పెళ్ళికి స్థాయికిమించి ఖర్చు చేస్తుంటారు. మరికొందరైతే వివాహం వినూత్నంగా ఉండాలనుకుంటారు. గాలిలోనో, నీటిలోనో కాకుండా ఓ నవ జంట పర్వత శిఖ రాగ్రాన పెళ్ళిచేసుకుంది. ఆకాశాన్ని



### ఊరంతా సహజీవనమే!

ఆ ఊళ్ళో పెళ్ళిళ్ళు ఉండవు! అదేంటి? అనుకుంటున్నారా! సహజీవనమే దీనికి కారణం. అబ్బాయి అమ్మాయి ఇష్టపడితే చాలు. ఇద్దరూ కలిసి సహజీవనం చేస్తారు. ఇదంతా ఏ ఫారిన్ కంట్రీలోనో జరుగుతోందనుకుంటే పొరబాటు పడినట్లే. తెలంగాణ రాష్ట్రం అదిలాబాద్ జిల్లాలోని ఓ మారుమూల తండాలో ఇది జరుగుతోంది. జిల్లాలోని వేమనపల్లి మండలంలో రాజారాం తండా ఉంది. అక్కడ నివసించే వాళ్ళంతా గిరిజనులే. మూడు వందల కుటుంబాలు నివసిస్తున్నాయి. అయితే అక్కడ తండావాసులకు ఉపాధి లేదు. కేవలం అటవీ ఉత్పత్తులపైనే జీవనాధారం. వీటికి కూడా పొరుగుతండాల పోటీ ఉంటుంది. అందుకే కట్టెలుకొట్టి అమ్ముకుని జీవిస్తున్నారు. వీరు ఈ తండాలో ఎవరూ కనీసం కుటుంబ పోషణకూడా చేసుకోలేకపోవడంతో ఇరుగు పొరుగు తండాలవారు వీరితో వివాహాలకు ఇష్టపడటం లేదు. దీనివల్ల ఇక్కడ యువతీ యువకులకు వివాహ సంబంధాలు రాక పోవడంతో, గ్రామపెద్దలందరూ ఓ అంగీకారానికి వచ్చేశారు. తినడానికే తిండి లేనప్పుడు పెళ్ళి చేసుకునే ఆర్థిక స్తోమత ఎలా వస్తుంది? అందుకే గ్రామంలో ఏ ఇద్దరు యువతీ, యువకులైనా ఇష్టపడితే చాలు, గ్రామపెద్దలకు తమ అంగీకారం చెప్పి కలిసి ఉండవచ్చు అంతే. పెళ్ళి ఉండదు. ఒకే ఇంట్లో సహజీవనం చేస్తారు. పేదరికం వల్లనే పెళ్ళి సంబంధాలు రావడంలేదనీ, అందుకే మనసుకు నచ్చితే చాలు కలిసి ఒకే ఇంట్లో ఉంటున్నామని వారు చెబుతున్నారు.




తాకుతూ కనిపించే ఎత్తయిన కొండ మీద వారి పెళ్ళి అందరినీ ఆశ్చర్యపరిచింది. కాలిఫోర్నియాకి చెందిన 42 ఏళ్ల ఫొటోగ్రాఫర్ బ్రియాన్ ర్యాబ్స్ 4500 అడుగుల ఎత్తైన కొండపైకెక్కి ప్రియురాల్ని పెళ్ళాడాడు. యోసిమైట్ నేషనల్ పార్క్‌లో విందు చేశాడు. పెళ్ళికి ముందురోజే కొండపై మకాం పెట్టి అనుకున్న సమయానికి ప్రియురాల్ని పెళ్ళి చేసుకున్నాడు ర్యాబ్స్. పెళ్ళితంతును ఎంజాయ్ చేయలేకపోయానని బాధపడిన ర్యాబ్స్ ఇప్పుడు హుషారుతో పాటు గర్వంగానూ ఉన్నాడు. పెళ్ళి ఫోటోలు సూపర్‌గా ఉన్నాయనే పొగడ్తలతో హ్యాపీ ఫీలవుతున్నాడు 42 ఏళ్ళ నవ వరుడు.

## సముద్ర గర్భంలో వివాహం!

సముద్ర గర్భంలోకివెళ్ళి ఏం చేస్తారు, ఎంజాయ్ చేయడం తప్ప! అనుకునేరు! దాంతోపాటు అంగరంగ వైభవంగా వివాహం కూడా చేసుకోవచ్చు. ఇటీవలే ఓ జంట దీన్ని నిజంచేసి చూపించింది. సముద్రగర్భంలో పెళ్ళి చేసుకోవాలనే కల నెరవేర్చుకున్నారు. ఈ వింతపెళ్ళి ఎక్కడో విదేశాల్లో జరిగిందనుకునేరు! మనదేశంలోనే కేరళలో జరిగింది. ఇలా వినూత్నంగా పెళ్ళి చేసుకుని ఈ జంట దేశంలో రికార్డు సృష్టించింది. మహారాష్ట్రకు చెందిన నికిల్ పవార్, స్లొవేకియాకు చెందిన యూనికా పొగ్రాన్‌లు కేరళలో కోవలం వద్ద సముద్రం గర్భంలో వివాహం చేసుకున్నారు. గవ్వలతో తయారు చేసిన దండలు మార్చుకున్నారు. క్రైస్తవ సంప్రదాయంలో జరిగిన ఈ వివాహంలో, పరస్పర అంగీకారం తెలియజేసుకునేందుకు 'అవును' అనే ప్లకార్డులు ఉపయోగించారు వధూవరులు. బంగారుటుంగరాలు మార్చుకున్నారు. గంటపాటు జరిగిన వివాహంకోసం నీటిలో చిన్నపాటి ప్రత్యేక వేదిక సిద్ధం చేశారు. సముద్రంలో పెళ్ళి మొదట ఆనందంగా అనిపించినా, నీటిలోపలకి వెళ్ళేసరికి కొంత భయమేసిందని వధువు యూనికా చెప్తోంది.

## అమ్మో! ఎంత ఖరీదైన పెళ్ళో

పెళ్ళంటే తప్పెట్లు తాళాలు..తలంబ్రాలు..మూడే ముళ్ళూ, ఏడే అడుగులు అన్నాడో కవి. అయితే సింపుల్‌గా పెళ్ళి చేస్తే ప్రత్యేకత ఏముంటుందనుకున్నాడో ఏమో ప్రమోద్ మిట్టల్ తన కూతురు పెళ్ళి వేడుక భారీ ఖర్చుతో నిర్వహించాడు. ఉక్కు దిగ్గజం లక్ష్మీకాంత్ మిట్టల్ సోదరుడు ప్రమోద్ మిట్టల్. తన కూతురు శ్రీష్టి మిట్టల్ వివాహ వేడుక బార్సిలోనాలో అంగరంగ వైభవంగా జరిపించాడు ప్రమోద్. వరుడు బ్యాంకు పెట్టుబడిదారుడు గుల్‌రాజ్‌బెల్. ఈ వివాహ వేడుక ఖర్చు ఎంతో తెలుసా? అక్షరాలా 505 కోట్ల రూపాయలు ( 60 మిలియన్ యూరోలు).

ప్రపంచంలోనే ఖరీదైన రెండవ వివాహ వేడుక ఇదే అని ఫోర్బ్స్ పత్రిక వెల్లడించింది. అన్ని రకాల విందు, వినోదాలు, వసతి సౌకర్యాలు వివాహ ఆడిటోరియం అద్దె ఖర్చులు, హోటల్ గదుల అద్దెలు వగైరాలతో 500 కోట్ల రూపాయల పైచిలుకు ఖర్చు చేసినట్టు అధికారవర్గాలు అంచనా వేశాయి. 1981లో మహ్మద్ బిన్ జాయేద్ అల్ నయాన్ (అబూదాబి రాజు) ప్రిన్సెస్ సలామా వివాహ వేడుకే ఇప్పటి వరకూ అత్యంత ఖరీదైనదిగా రికార్డు పుటల్లో నమోదైంది. అప్పట్లో ఆ వివాహానికి 76.25 మిలియన్ యూరోలు ఖర్చు చేశారట. అదే ఏడాది జరిగిన ప్రిన్సెస్ వేల్స్ వెడ్డింగ్ ఖర్చు 53 మిలియన్ యూరోలు. ఇప్పటి వరకూ ఈ రెండే అత్యంత ఖరీదైన వివాహాలుగా చరిత్ర పుటల్లో స్థానం సంపాదించాయి. ఇప్పుడు శ్రీష్టి, గుల్‌రాజ్‌బెల్ వివాహం, ప్రిన్సెస్ వేల్స్ రికార్డును చెరిపేసి ఆ రెండవస్థానాన్ని ఆక్రమించింది.

## భూలోక అద్భుతం!

లండన్‌లో జరిగిన ఓ పెళ్ళి నిజంగా భూలోక అద్భుతాన్ని తలపించింది. అత్యంత ఖరీదైనదిగా రికార్డు సృష్టించింది. ఒక పశ్చిమ ఆఫ్రికా జంట లండన్‌లో చేసుకున్న ఈ పెళ్ళికి కేవలం వధూవరుల డిజైనర్ దుస్తులకు లక్ష యూరోలు, అతిథుల ఆల్కహాల్‌కి లక్షన్నర యూరోలు ఖర్చు చేశారు. వధువు ధరించిన డిజైనర్ డైమండ్ జ్యువెలరీకి 4.75 లక్షల యూరోలు వెచ్చించారట. చారిత్రక కట్టడం రాయల్ ప్యాలెస్‌లో జరిగిన ఈ పెళ్ళికి క్యాటరింగ్, వ్యాట్‌తో కాకుండా కనీసం 12,500 యూరోలు అయిందట. అంతేకాదండోయ్, వచ్చిన అతిథుల్ని వట్టి చేతుల్తో పంపిస్తారా? వాళ్ళకు 345 యూరోల పర్ఫ్యూమ్స్, 350 యూరోల ఖరీదైన కశ్మీరీ స్కార్ఫ్, ఐదువేల యూరోల ఖరీదైనవాచ్... ఇలా లక్షన్నర యూరోలఖర్చుతో రిటన్‌గిఫ్టు లిచ్చి మర్యాద చేశారు వధువు తల్లిదండ్రులు. ఇలా వివాహ సన్నివేశాలు జీవితాంతం అతిథులకు గుర్తుండిపోవాలని, ఒకర్ని మించి మరొకరు తమ ఉన్నతి చాటుకునేందుకు పోటీలు పడి పెళ్ళిళ్ళు చేస్తున్నారు.

**- విజేత**



## ప్రపంచ పొట్టిజంట వివాహం

*మనుషులందరూ ఒకేలా ఉండరు. కొందరు లావుగా, మరికొందరు సన్నగా, ఇంకొందరు ఎర్రగా, నల్లగా, పొట్టిగా, ఇలా రకరకాలుగా ఉంటారు. ఇలా ప్రపంచంలోనే అతి పొట్టివారుగా పాపులరైన ఓ జంట పెళ్ళి చేసుకుంది.*

*బ్రెజిల్‌కు చెందిన 31 ఏళ్ల పాలో గేబ్రియల్, 28 ఏళ్ళ కట్యూసియా ఎనిమిదేళ్ళ ప్రేమకు స్వస్తిచెప్పి ఒకింటివారయ్యారు. వరల్డ్‌లో అతిపొట్టి దంపతులుగా గిన్నిస్‌బుక్ రికార్డుల్లోకి ఎక్కారు. పాలో 35.54 అంగుళాల ఎత్తు, అతని భార్య కట్యూసియా 35.88 అంగుళాల ఎత్తు ఉన్నారు. గతంలో ఇలా వివాహం చేసుకున్న మరుగుజ్జు జంట డగ్లస్, క్లారియాల రికార్డును వీళ్ల బ్రేక్ చేశారు.*




**నిజంగా మాట్లాడితే తనకు పెళ్ళి చేసుకునే అర్హతలేదు. అంటే మగతనం లేదనికాదు. బతకడం వరకే తన సంపాదన పరిమితం అయింది. బతికించేస్థాయికి తను ఎదగలేదని తన నమ్మకం. ఎదగలేడని తనకు తెలుసు! ఏం ఎందుకని? అని అడిగితే తనకున్న చదువు, ఆ చదువుతోవచ్చిన ఓ చిన్నఉద్యోగం, ఎప్పుడు తెగుతుందో తెలియదు. ఒకేఒక్క అదృష్టం ఏంటంటే బద్ధకం తనకు బద్ధశత్రువు. పెళ్ళి చేసుకుంటే ఎన్నో మలుపులు చూస్తావంటే, అదేంటో చూడాలనుకున్నాడు లింగా. ఇంటిపేరు బోడి అది చాలామందికి తెలియదు.**

# మలుపుల చూపు!

తల్లిదండ్రి, తమ్ముడు ఉన్న గిరిసుతను కళ్ళు మూసుకుని చేసేసుకున్నాడు. కళ్ళుతెరిచిచూస్తే గిరిసుత, తన జీవితాన్ని మలుపుతిప్పే దేవతనే అనుకున్నాడు. బావమరిది ద్రష్ట డిగ్రీచేసి నిరుద్యోగంలో వేడికన్నా ఆటో నడపడంలో చల్లదనమే మేలనుకున్నవాడు. బావా ఈ రోజుల్లో మనిషన్న వాడికి కోపం, తాపం ఉండాలని సలహా ఇచ్చినవాడు. లింగా తల్లిదండ్రులు కాశీలో కాలక్షేపం చేస్తున్నారు.

•••

భార్యకు ప్రసూతి నొప్పులు మొదలయ్యాయి. తన ప్రతిబింబాన్ని జీవితమనే అద్దంలో చూసుకోబోతున్న ఆనందం తాండవిస్తున్నది.

ఆడపిల్లా!

నాకు ఆడపిల్ల పుట్టడం ఏంటి! దాన్ని బతకనీయను! కంసుడిలా కత్తి ఎత్తాడు లింగా.

అత్తమామలు, బావమరిది కాళ్లావేళ్లాపడి కత్తితీసి బైట పడేశారు.

"సరే! ఈసారి ఆడపిల్లయితే అత్తకు యముణ్ణవుతా" అని రంకేశాడు.

కవలలు ఆడపిల్లలు! అని తెలియగానే లింగాను గదిలోపెట్టి తాళంవేసి అప్పుడు అసలుసంగతి చెప్పారు. దాహం అంటే నీళ్ళు ఆకలి అంటే అన్నం కిటికీలోంచి అందిస్తూ వచ్చారు. లింగా కోపం చల్లారడానికి నెలరోజులు పట్టింది. కత్తులు, కఠారులు కనపడకుండాచేసి తాళంతీశారు.

"మూడో కాన్పుకైనా నాకు మగపిల్లవాడు పుట్టకపోతే, మీ ఖాన్‌దాన్ మొత్తాన్నీ పాన్‌దాన్లో పెట్టి తమలపాకుల్లా నమిలి పారేస్తా" గాండ్రించాడు. మళ్ళీ కవలలు! ఆడపిల్లలే!

భూకంపం వచ్చి కొంపలు కూలుతున్నభయం రగిలింది అత్తమామల గుండెల్లో. మళ్ళీ గదిలోకి పంపిస్తుంటే కనిపెట్టి తప్పించుకున్నాడు లింగా. ఎంతోతెలివిగా వలవేసి పట్టుకుని ఆ మూటను చెట్టుకి వేలాడదీశారు. నీళ్ళివ్వాలని దగ్గరకువెళ్తే చేయి కొరుకుతాడనే బెరుకుతో చెట్టుకి మించిన ఎత్తులో నుంచి నీటిధార వదులుతున్నారు. కుట్టినచోట కుట్టకుండా, కుట్టనిచోటంటూ లేకుండా కుడుతున్న దోమలు లింగా ఆవేశాన్ని కుట్టి కట్టిపడేశాయి! వలవీడిన లింగాచేష్టలు వికారాలయ్యాయి. పిచ్చికాక ఇంకోటి కాదన్న నిర్ధారణతో పిచ్చాసుపత్రికి తీసుకెళ్ళారు.

"ఇప్పటికే ఆసుపత్రి అంతా ఇటువంటి పిచ్చోళ్ళతోనే నిండిపోయింది. ఈ పిచ్చోడికోసం ఇంకోటి కట్టించాల్సిందే" అన్నారు డాక్టర్లు. నిరాశతో తిరిగి వస్తుంటే ఓ పిచ్చోడు నడుపుతున్న పిచ్చిరైలు కింద పడి చచ్చిమిగిలాడు లింగా. ముక్కులో గుడ్డ పెట్టారు! కానీ, వచ్చిన పదిమంది మాటలు వినబడుతున్నాయి.

"మగ పిల్లవాడో, మగ పిల్లవాడో! అని ఆవురావురన్నాడు. ఆయువు కాలి పోయాడు".

"రోడ్లు వెడల్పు చేస్తున్నారు, మెట్రో రైళ్ళు వేస్తున్నారు! అంతకంత రద్దీ పెరుగుతూనే ఉంది! జనాభా తగ్గించాలని ఎవరూ అనుకోరేం, అని ఆదర్శాలు పలికేవాడు పాపం!"

లింగా అసమర్థతనూ, అశక్తతనూ అప్రయోజకత్వాన్నీ రకరకాలుగా వర్ణిస్తూ, ఎవరినోట్లోనూ మాటలుకూడా దాగడంలేదు.

శవానికి అభిమానం దెబ్బతిన్నదా అన్నట్లు కోపంతో లేచి కూర్చున్నాడు లింగా!

అలసిపోవడం, అలసిపోయినసంగతి మరచిపోవడం, మళ్లీ అలసిపోవడం, అలసిపోయినప్పుడల్లా ఒళ్లుమరిచి నిద్రపోవడంతప్ప కలలెరుగనివాడు, కోపంఅంటే ఏంటో తెలియనివాడు లింగా! తనకొచ్చిన కల తలచుకుని కలవరపడ్డాడు. కలను పీడకలలా మరచిపోయాడు. ఏదిఏమైనా కల ఓ జాగ్రత్తను చెప్పింది. ఆ జాగ్రత్తగురించి ఎవడికి చెప్పినా పెడచెవిన పెడతాడనే అనుభవంతో చెప్పడం మానేశాడు!

•••

ఎవడో చేసిన తప్పుకి తన ఉద్యోగం పోయింది. పైగా తన్నులు కూడా తిన్నాడు. వాదించే పని లేదు, వాదించినా ఫలితం లేదు! కనీసం నిజమేంటో వినే చెవికూడాలేదు. తప్పుచేసినవాడు నవ్వులు కప్పుకుంటున్నాడు!

గిరిసుత ఓదార్చింది. ధైర్యం చెప్పింది.

కానీ, ఏం చేయాలి! ఏం చేయాలి!

•••

లింగా! ఇంట్లో కదలికలు లేకుండా ఉండలేక పోతున్నాడు. బయటికివెళ్లి కదలలేక పోతున్నాడు. ఎవరినన్నా పలకరిద్దామన్నా పనికిరానిముచ్చట్లే! తక్షకోటి డబ్బున్న నోటి బెరుసువాడు. భార్య నవ నాగరీక షోకులతో మొగుణ్ణిమొట్టే శీలశైలి! కూతురు భూగోళ చదువున్నా ప్రేమపోకడలున్నది. పొరపాటున తన పాటును తక్షకోటితో చెప్పాడు లింగా. శతకోటిలింగాల్లో నువ్వొకడివంటూ హేళనతో కాటువేశాడు తక్షకోటి. అంతటితో పలకరింపులనేమాటే మానేశాడు. మౌనమే మనసుకి బలాన్నిస్తోంది.

ఓ రోజు ఓ పార్కుచుట్టూ ఆలోచనలేని నడక నడుస్తున్నాడు. నడక అలవాటయింది. నడక పరుగైంది. 'సంపాదనలేని వ్యాపకం' అని నవ్వుకున్నాడు. ఆరోగ్యం ఆనందమై సాగుతున్నది.

ఉద్యోగం పోయిన భర్తల జీవితాలతో ఆడుకునే భార్యల్లాంటి భార్య కాదు తన భార్య!

తన వ్యాపకాన్ని నిరుత్సాహపరచలేదు. ఏదో మంచి జరుగుతుందనే ఆశ ఉదయించింది. అదే నిజమైందన్నట్లు ఒకరోజు తనకో పర్సు దొరికింది. అది చినిగిపోయిందికాబట్టే ఎవరో పడేసుంటారు. చెత్తకుండీ ఉన్నా వాడని చెత్తమనుషుల గురించి క్షణం ఆలోచించాడు.

పర్సులోపల ఓ విజిటింగ్‌కార్డు అతుక్కుని ఉంది. దానివెనుక వివరం రాసి ఉంది. అడ్రసు పట్టుకుని వెళ్ళాడు. కార్డుగలాయన పేరు ధర్మదత్త అనీ ఏదో క్రీడాసంఘంలో పనిచేస్తున్నాడనీ తెలుసుకున్నాడు. కార్డువెనుక వివరం నాకెంతో ముఖ్యమైంది. లింగాకు ఎంతో రుణపడి ఉంటాను

**పెళ్ళిచేసుకునే అర్హత తనకు ఇంకా రాలేదని చాలా గట్టినమ్మకం బోడిలింగాకి. ఎందుకంటే అతడు చిరుద్యోగిమరి! కానీ జీవితంలో ఎన్నో మలుపులు చూడాలంటే పెళ్ళి చేసుకుని తీరాల్సిందే అని హితోపదేశం చేశారు తల్లిదండ్రులు. అదేంటో చూడాల్సిందే అనుకుని కళ్ళుమూసుకుని గిరిసుతను పెళ్ళాడేశాడు లింగా! ఇక సంసార జీవితంలో అప్పుడు మొదలైంది, తల్లిదండ్రులు చెప్పిన మలుపుల జంజాటం. ఇంతకీ ఏమిటా మలుపులు? ఏమాకథ!**

అన్నాడు ధర్మదత్త.

●●●

జాతి వేడుకల పరుగు పందేల్లో పాల్గొన్నాడు లింగా. ఫస్టు ప్రైజు వచ్చింది. బహుమతితోపాటు కొంతడబ్బు కూడా వచ్చింది. ఎంతో సంతోషంతో ఆ డబ్బు భార్యకు ఇచ్చాడు!

ఆ తర్వాత కబడ్డీ ఆటలో తన చిన్నప్పటి నైపుణ్యానికి మెరుగు పెట్టాడు. లింగా క్రీడాకారుడయ్యాడు. ఆ అర్హతతో క్రీడాసంఘం కార్యాలయంలో ఓచిన్న ఉద్యోగస్థుడయ్యాడు. అది కొంచెం పెద్దది కావాలంటే ఓ విద్యార్హత కావాలి. ప్రైవేటుగా చదివి అదీ సాధించాడు లింగా. గిరిసుత ప్రోత్సాహంతో స్థిరపడటానికి నాలుగేళ్ళు పట్టింది.

●●●

తండ్రి కావాలన్న తనకోరిక భార్యతో చెప్పాడు, దగ్గరకు తీసుకుని! భార్య కంటతడి తనగుండెని తడిపింది. "ఎప్పటికైనా చెప్పాల్సింది, ఇప్పటిదాకా చెప్పంది, మీకు చెప్పాలండీ" అంది గిరిసుత. తనకు తల్లినయ్యే యోగ్యతలేదని. ఆ సంగతి చెప్పడానికి ఎందుకు తటపటాయించిందో అర్థమయింది లింగాకు. భార్యకంట తడి తుడిచాడు! మళ్ళీ ఆ ప్రస్తావన రాకుండా! తేకుండా! లేకుండా!

●●●

"ఏమండీ! చిన్నకోరిక!" అంది గిరిసుత.

"చెప్పడానికి నా అనుమతా, చెప్పకముందే తీర్చమని చెప్పడమా' అన్నాడు నవ్వుతూ.

"తల్లిప్రేమ.."

క్షణంలో ఊహలాగిపోయాయి. నిరుత్తరంగా చూశాడు లింగా.

"తల్లిప్రేమ అని శిశుసంరక్షణ కేంద్రం నడపాలనుకుంటున్నాను" అంది.

"ఇంకో ఆలోచనేలేదు. అధమాధమం ఇరవైవేలన్నా చేతిలో ఆడాలి. ఖర్చులూ, ధరలూ పోటీపడి పరుగులు తీస్తున్నాయి. అయినా సరే.... ఆలోచన లేదు... ఆచరణే!"

●●●

ధర్మదత్త! మనసు కంటికి కనిపించాడు. తన జీవితానికి వెలుగు ఇచ్చినవాణ్ణి అప్పు అడగడం మంచిదేనా.. తక్షకోటి డబ్బున్న బీదవాడు. ప్రస్తుతం దేశంలోలేడు. కనిపించడంలేదుకాబట్టి లేడనుకుంటున్నాడేమో! పరుగాగని అంగలతోపాటు ఆలోచనాపరుగు తీస్తూనే ఉంది. రెండు పరుగులూ ఒకేసారి ఆగాయి. కంటి ముందు ఓ తెగిన గొలుసు కనిపించింది. మెరుపుచూస్తే బంగారం లాగానే ఉంది. ఇత్తడో పుత్తడో అయితే అయిందని జేబులో వేసుకున్నాడు.



"సందేహంలేదు బంగారమే మన అవసరానికి మించే ధర పలుకుతుంది" అంది గిరిసుత. అంటున్నది విన్నవాడిలా వచ్చాడు తక్షకోటి.

"షుగరుకి పరుగే మందని నేనూ మొదలు పెట్టా. మొదటి రోజే మెళ్లో చైను తెగిపడింది. షుగర్ లెవెల్ పెరిగింది. తెలిసిన వాళ్ళందరినీ అడుగుతూ వస్తున్నాను" అన్నాడు తక్షకోటి.

'వంద నగల్లో అదోనగ. పోయినవి వంద కాదు. ఉన్న వందలో ఒకటి పోయిందనే" అన్నాడు లింగా. భర్త భావం అర్థం చేసుకున్న భార్య అదే అల వరసల్లో మాట్లాడింది.

దిగులుగావెళ్తూ ఏదో గుర్తొచ్చినవాడిలా వెనక్కు వచ్చి "ఏం లేదులే" అని వెళ్ళాడు తక్షకోటి.

●●●

ఆ సంగతి ధర్మదత్తకు చెప్పాడు లింగా. "ఆ నిర్ణయం నువ్వే తీసుకో. అది ఏదైనా నీకు నేను సహాయం చేస్తాను"అని ధర్మదత్త ఇచ్చిన మాటతో ఆ నగను తక్షకోటికి ఇద్దామని వెళ్తున్న లింగాకు ఊహించని సన్నివేశం ఎదురైంది. ఓ కన్య పసిపిల్లవాణ్ణి చెత్తకుండీ పక్కన వదిలిపెట్టి వెళ్తున్నది. ఎవరో కాదు తక్షకోటి కూతురు భూగోళ. కలకాదు నిజమే!

పసిపిల్లవాడితో ఇంటికి వచ్చాడు. భగవంతుడిచ్చిన వరమనుకున్నారు. భూగోళ ప్రేమించింది తన తమ్ముడు ద్రష్ట అని తర్వాత తెలుసు కుంది గిరిసుత. "చంపుతా" అన్న తండ్రి బెదిరింపుతో.. ప్రేమఫలాన్ని వదిలించుకుంది. తండ్రి చెప్పిన సంబంధం చేసుకుంది. అందుకు బలమైన కారణాలు ఇంకేవో ఉండొచ్చు! పుర పేరుతో పెరుగుతున్నాడు గిరిసుత సుతుడు.

●●●

సాగడం తప్పితే ఇంకోసంగతి పట్టించుకోని కాలం సాగుతూనే ఉంది!

భూగోళ తల్లిదండ్రులు ఓ రైలు ప్రమాదంతో కాలిపోయారు! కాలం జరుగుతూనే ఉంది. పరిస్థితుల ప్రభావంతో భూగోళ తన ధర్మతనయుణ్ణి తల్లి ప్రేమలో చేర్చింది!

విధివశాత్తు, కారుచెడిపోయి ఆటోలో వస్తున్న భూగోళభర్త గుండాగిపోయాడు. అది సహజ మరణంకాదన్న గొడవలో ఇరుక్కుని కొన్నాళ్ళు జైల్లో ఉండివచ్చాడు ద్రష్ట. ఆ ఆటో తనదికాబట్టి, ధర్మదత్త సహాయం లేకపోతే ద్రష్ట జీవితం భ్రష్టుపట్టేదే!

మనశ్శాంతి కోసం అక్క ఇంటికి వచ్చాడు! భూగోళని చూశాడు!

●●●

"అయ్యబాబోయ్! ఈ మలుపులు నేనిక చూడలేనుబాబో" అన్నాడు లింగా. భర్తను ఊరడించింది గిరిసుత. "పిల్లల విషయంలో ఈ మధ్య ఓ డాక్టరమ్మను ఎంతోమంది దేవతలా చూస్తున్నారట. నన్ను ఆవిడకు చూపిస్తారా" అడిగింది భర్తను.

●●●

"ఎవరు చెప్పారు గిరిసుతకు పిల్లలు పుట్టరని" గట్టిగా చెప్పింది దేవత!

నవ్య




**షూటింగ్ పూర్తయింది.**

**గుండెల్లో పేరుకుపోయిన ఏదో అవ్యక్తమైన భయం కరిగిపోయి, మనసు, శరీరం దూదిపింజల్లా తేలిక అయిపోతాయి సాధారణంగా. కానీ, నా మనసు మాత్రం ఇంకా రోదిస్తూనే ఉంది.**

**సినిమా అత్యద్భుతంగా వచ్చిందని అభిషేకం గారన్నారు. ఆయనే అలా అన్నాడంటే సినిమా బాగానే వచ్చినట్టు లెక్క.**

ఆయన మొహమాటాలకు పోయి మెచ్చు కోడు. ఎదుటివాడు ఎంత గొప్ప సినీ పర్సనాలిటీ అయినా వాళ్ళు తీసిన చెత్త సినిమాను పరమచెత్త సినిమా అని, మంచి సినిమాను చెత్త సినిమా అని, గొప్ప సినిమాను మంచి సినిమా అని మాత్రమే అంటాడు. ఆ సినిమాలో నటిం చిన అగ్రనటుల నటనను చీల్చి చెండాడు తాడు. అందుకే, అప్పుడప్పుడు, వారి అభిమానుల దూషణ భూషణలకు గురవు తుంటాడు.

ఈ మధ్య వచ్చిన ప్రపంచప్రఖ్యాతి గాంచిన సినిమానే 'ఏముందిసార్! వంద హాలీవుడ్ సినిమాలు, పది చందమామ కథలు మిక్సీలో వేసి రుబ్బి గ్రాఫిక్స్ తాళింపు బెట్టి, అమ్మాయిల ఛాతీలు చూపిస్తే, అదో గొప్ప సినిమా అయిపోతుందా?' అని చప్ప రించి పారేశాడు.

ఆయనమాట మొరటు. ఆయన ప్రెజె న్సును భరించలేం. ఆయన మాటల్లో వ్యంగ్యం కొట్టొచ్చినట్టు వినపడుతుంది.

కానీ, ఆయన జడ్జిమెంట్ మాత్రం సూపర్. ఆయనకు కూడా కమర్షియల్ సినిమాలంటే అంతగాపడదు. కానీ, పొట్టకూటికోసం చేస్తాడు. అక్కడ పనిచేస్తూనే వాళ్ళు తీసే సినిమానే విమ ర్శిస్తాడు. దానికి తోడు ఆయన నాలుక కంట్రోల్లో పెట్టుకోలేడు. నారదుడికి లక్షలకొద్దీ వారసులున్న ఈ సినిమా రంగంలో, మన మాటలు మోసే వాళ్ళు, మనం అన్నవి అననివి, కల్పించి మసాలాలు అద్ది మోసేస్తారు. దానివల్ల అందరి దృష్టిలో చెడ్డ వాడయి పోయాడు. దాంతో అక్కడి నుంచి ఉద్వా సన పలుకుతారు.

ఆయనకు రాం అంటే అస్సలు పడదు. రాం వ్యక్తిగత జీవితం గురించి తెలుసుకున్నాక, అతడంటే చులకన భావం ఏర్పడింది. కానీ, షూటింగ్ చివరి రోజు అతన్ని దగ్గరకు తీసుకుని,

"రాం! ఈ సినిమాలో నీ నటన అద్భుతం. నువ్వు నటనలో టెన్త్ క్లాస్ పరీక్ష రాయకుం డానే, పోస్ట్‌గ్రాడ్యుయేట్ పరీక్ష ఫస్ట్‌క్లాసులో పాసయినట్టు. ఇది కమర్షియల్ సినిమా కాదని బాధపడకు. జీవితంలో నువ్వు పైకి రావాలంటే, నీ పర్సనల్ లైఫ్‌ను చక్కగా తీర్చిదిద్దుకుంటే గొప్పవాడివి అవుతావు. ఓ పదేళ్ల పోయిన తర్వాత, నీ మొదటి సినిమా ఏదని ఎవరైనా ప్రశ్నిస్తే, నువ్వు గర్వంగా ఈ సినిమా గురించి చెప్పుకో వచ్చు' అన్నాడు.

యూనిట్ సభ్యులందరూ ఆశ్చర్యపోయారు. నేనయితే నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. రాం, అభిషేకంగారి కాళ్ళకు మొక్కాడు. నాకు, అప్పుడు అభి షేకం గారి గొప్పతనం అర్థమైంది.

ఆయన మా అందరివైపు కన్నీ ళ్ళతో చూశాడు.

"సార్! నా గురించి మీ అందరూ ఏమనుకుంటున్నారో నాకు తెలుసు సార్! నాలాంటి

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. నటి జలజ హత్య కేసులో సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. హీరోగా రాం, హీరోయిన్‌గా శ్రావణిని సెలెక్ట్ చేస్తాడు. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. డైరెక్టర్‌కి తన గతమేమిటో చెప్పి, అతడినుంచి దూరంగా వెళ్లిపోతుంది శ్రావణి. నవీన్ కూడా తనకో కమిట్‌మెంట్ కావాలని అడిగాడని శ్రావణి చెప్పడంతో, నవీన్ పక్కకు తప్పిస్తాడు డైరెక్టర్. ఆ రాత్రి అభిషేకంగారు తన గురించి చెబుతూ, సినీఫీల్డులోకి మాఫియా ఎంట్రీ గురించి చెప్పడం మొదలుపెడతాడు. షూటింగ్ పూర్తవడంతో గుమ్మడికాయ కొట్టడానికి ముహూర్తం పెడతారు. దానికి స్వయంగా శ్రావణిని ఆహ్వానిస్తాడు డైరెక్టర్.

ఆ తర్వాత.....

వాడు కూడా యూనిట్‌లో ఒకడుండాలి సార్, లేక పోతే చాలా బోరింగ్‌గా ఉంటుంది. టెన్షన్లు పెరుగు తుంటాయి. నేను ఒక వెంటిలేటర్‌లాంటివాణ్ణి సార్. కష్టాలు, బాధలు, బాధ్యతలను ఎప్పటికప్పుడు బయటకు తోసేస్తూ ఉండాలి సార్. లేకపోతే, సెట్లో గాలి ముగిగిపోతుంది. అందుకే, మీ అందరి ముందూ ఒక మెంటల్ గాడిలా ప్రవర్తించాను".

ఒక్క క్షణం ఆగి,

"మీకు తెలుసా సార్! గత పదేళ్ళలో నేను షూటింగ్ మొదలైనప్పటి నుంచి గుమ్మడికాయ కొట్టేవరకు పనిచేసిన ఒకేఒక్క సినిమా ఇదే సార్! ఏ సినిమా లోనైనా నన్ను మధ్యలోనే, వాళ్ళే తీసేసేవారు. లేకపోతే, నేనే వదిలేసేవాణ్ణి".

"మీ వ్యక్తిత్వమే అందుకు కారణం. మీరు ఒక లక్ష్యానికి కట్టుబడి సినిమా తీయడం, దానికితోడు టెక్నీషియన్లను, నటీనటులను మీరు ట్రీట్‌చేసే విధానం, మీ బాష, మీ కంపోజ్డ్ నేచర్ నాకు బాగా నచ్చింది" అన్నాడు.

మా యూనిట్ సభ్యులందరూ చప్పట్లు కొట్టారు.

నేను సిగ్గుపడ్డాను.

•••

సినిమా షూటింగ్ పూర్తికాగానే, గుమ్మడికాయ పగల కొట్టడమనేది ఒక ఆచారం. నాకు ఈ విష యాల్లో పెద్దగా నమ్మకం లేకున్నా, ఇన్ని రోజులు కలిసి పనిచేసిన యూనిట్ సభ్యులను వీడిపోతు న్నందుకు, ఒక సమావేశం ఏర్పాటుచేసి, మంచి భోజనం పెట్టి, వాళ్ళకు కృతజ్ఞతలు చెప్పడా నికి మాత్రం ఒక మంచి అవ కాశం.

గుమ్మడికాయ కొట్టడమనేది, ఒక సింబాలిక్ యాక్ట్.

ఒక సినిమాకు గుమ్మడికాయ కొట్టడమనే ఘట్టం, నిర్మాత, డైరెక్టర్ల కెరీర్లో ఒక గొప్ప సంతోష కరమైన సంఘటన. షూటింగ్ చివరి రోజు గుమ్మడి కాయ పగలగొట్టడమంటే - నిద్రలేని రాత్రులకు, హైటెన్షన్ ఎలక్ట్రికల్ వైర్లమీద చేసిన అసిధారవ్రతా నికి, బీపీలకు, టెన్షన్లకు వీడ్కోలు పలకడమే!

ఎందుకంటే, టాలీవుడ్‌లో రోజుకో రెండు మూడు సినిమాలకు కొబ్బరికాయ కొడుతుంటారు. ఎంతో ఉత్సాహంతో కొత్తకొత్త నిర్మాతలు సినిమాలు నిర్మించాలని ఉవ్విళ్ళూరుతుంటారు.

మన ఆర్థిక వ్యవస్థ శరవేగంతో దూసుకు పోతుండడంతో, అనేక రంగాలలో కనకవర్షం కురు స్తోంది. రియల్ ఎస్టేట్, మెడికల్, విద్యారంగాలు అపార లాభాలు ఆర్జిస్తున్నాయి. వీటికి తోడు, కొన్ని వ్యవస్థలలో అవినీతి డబ్బు ఇబ్బడి ముబ్బ డిగా జనరేట్ అవుతోంది. వీటిని మదుపు చేయ డానికి ఏకైక మార్గం సినిమారంగం.

ఒక స్థాయిలో డబ్బులు సంపాదించిన తర్వాత, ప్రతీ ఒక్కరి దృష్టీ సినిమారంగంపైనే పడుతుంది.

వీళ్ళకుతోడు జెన్యూన్‌గా సినీరంగంలో కెరీర్ నిర్మించుకున్న సీరియస్ నిర్మాతలు కూడా రెగ్యు లర్‌గా సినిమాలు నిర్మిస్తూనే ఉంటారు.

ఇలా, వీరందరూ సినిమాలకు కొబ్బరికాయలు కొడుతూనే ఉంటారు. కానీ, సగం కన్నా పైగా సినిమాలు మధ్యలోనే ఆగిపోతుంటాయి. కారణాలు అనేకం. కొత్త నిర్మాతలకు మొదట్లో ఉన్నంత ఉత్సాహం, సినిమా మొదలై, కొంత షూటింగ్ జరుపుకున్న తర్వాత, ఉండదు. అప్పటికే తాము అనుకున్న దానికన్నా బడ్జెట్ పెరిగిపోవడం, సినిమా షూటింగ్ మీద మోజు తీరిపోవడం, వాళ్ళకు రావాల్సిన డబ్బులు రాకపోవడం వంటివి కారణాలు. రియల్ ఎస్టేట్ నుండి వచ్చిన నిర్మాతల సినిమాలు చాలా వరకు ఆగిపోతుంటాయి.

అందుకే, సినిమా మొదలుపెట్టడం కన్నా అంటే కొబ్బరికాయ కొట్టడం కన్నా గుమ్మడికాయ కొట్టడం చాలా ముఖ్యం.

ప్రొడ్యూసరుకు, నీళ్ళ ప్రవాహంలా ఖర్చవుతున్న డబ్బుకు ఆనకట్ట పడ్డంత ఆనందంగా ఉంటే, డైరెక్టరుకు అనుకున్న ఔట్‌పుట్ వచ్చినందుకు,



తను సృష్టించిన ఊహాప్రపంచం ప్రాణం పోసుకుని తన కళ్ళముందు ప్రత్యక్షమయ్యే క్షణం ఆసన్నమవుతున్నందుకు కలిగే అనుభూతి వర్ణనాతీతం.

ఓ వంద రోజులపాటు, కొట్టుకుంటూ, తిట్టుకుంటూ కలిసి పనిచేసిన యూనిట్ సభ్యులు విడిపోతుంటే, ఎడబాటు బాధ కూడా గుండెను కోసేస్తుంది.

గుమ్మడికాయ కొట్టడమనే కార్యక్రమం నాకో అద్భుత అవకాశం ప్రసాదించింది. మన సినిమాలో నటించిన నటీనటులందరినీ, సాంకేతిక నిపుణులందరినీ పిలిచి వాళ్ళ సమక్షంలో గుమ్మడికాయ కొట్టడం ఆనవాయితీ.

ఇదే అవకాశంగా భావించి, నేనే స్వయంగా శ్రావణిని పిలవడానికి బయల్దేరాను.

శ్రావణి నన్ను వీడిపోయి సుమారు రెండు నెలలు గడిచాయి. నేను నడుస్తున్న శవంలా పనులు చేస్తున్నా కానీ, నాలోని చైతన్యం చచ్చిపోయింది. షూటింగులో ఉన్న సమయం ఎలాగో అలాగా గడిపేసినా, రాత్రులు మాత్రం కాళరాత్రులే.

నా బెడ్‌రూములో శ్రావణితో గడిపిన సుందర క్షణాలను 'ఫ్రీజ్' చేసి పెట్టుకున్నాను. ఒక్కోసారి ఆ దృశ్యాలు గుర్తుకొచ్చేవి. ఒక్కోసారి ఆ దృశ్యాలు నిజం కావనీ, నా ఊహాలోకం సృష్టించిన కల్పితాలనీ అనిపించేవి. ఎంత ప్రయత్నించినా శ్రావణి ముఖం గుర్తుకొచ్చేది కాదు.

భగవంతుడు ప్రత్యక్షమై, ఒకేఒక్క వరం కోరుకోమంటే, నేను శ్రావణి కౌగిలిలో ఉన్న ఆ ఒక్క మధురస్మృతిని లిప్తపాటైనా నిజం చేయమని కోరుకుంటాను.

శ్రావణికి ఆరోజు 'అన్నపూర్ణ స్టూడియో'లో షూటింగ్ ఉందని అభిషేకం గారు తెలుసుకున్నారు. కారు, గేటుదాటి ఏసి స్టూడియోకి దగ్గరగా చేరుకునేసరికి నా గుండె వందమైళ్ళ వేగంతో కొట్టుకోసాగింది.

స్టూడియోలోకి ప్రవేశించగానే, తెలిసిన ఒక అసిస్టెంట్ డైరెక్టర్ లోపలికి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. షూటింగ్ జరుగుతోంది, ఏదో ప్రేమ సన్నివేశం.

"నిజం రాహుల్! నన్ను నమ్ము. నేను నిన్ను తప్ప ఇంకెవరినీ ప్రేమించడం లేదు. నువ్వు కనపడకపోతే నాకు ఏమీతోచదు. ఆకలి దప్పులుండవు. నీ మాట వినందే నాకు పొద్దు పొడవదు. అట్లాంటిది నేను నిన్ను కాక ఇంకెవరినైనా ఎట్లా ప్రేమిస్తా చెప్పు?".

శ్రావణి చెప్పిన డైలాగులు నన్నుద్దేశించే అన్నట్లుగా ఉన్నాయి. నా మనసు ఉప్పొంగిపోయింది. నేను శ్రావణికోసం ఎంతగా తపిస్తున్నానో, తను ఏదో సినిమాలో చెప్పిన డైలాగుకే అంతగా పులకించిపోతున్న విషయాన్ని బట్టే అర్థమవుతోంది.

ఆ డైలాగ్ చెప్పి శ్రావణి, హీరోను గాఢంగా కౌగలించుకుంటుంది.

'కట్' అని అరిచాడు డైరెక్టర్.

అసిస్టెంట్ డైరెక్టర్ వెళ్ళి చెప్పగానే, శ్రావణి నా వైపు చూసింది. తన కళ్ళల్లో మెరుపును నేను పసిగట్టాను. వెంటనే, డైరెక్టర్ దగ్గర పర్మిషన్ తీసుకుని, నా దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చింది.

రాగానే, నా చేతులు పట్టుకుని నిలబడిపోయింది. తన చేతుల్లోంచి ప్రాణశక్తి నా ఒంట్లోకి ప్రవేశించి, నా కణకణంలోకి పాకింది. నేను మళ్ళీ మనిషినయ్యాను.

"ఎలా ఉన్నారు సార్?" అడిగింది.

నాకైతే శ్రావణిని గుండెలకు అదుముకుని తనివిదీరా ఏడవాలని ఉంది.

కానీ, అప్పటికే అక్కడ ఉన్న ప్రెస్ రిపోర్టర్లు మా ఇద్దరివైపు ఆసక్తిగా చూస్తున్నారు.

"బాగున్నాను!" అన్నాను. కానీ, నా మాటలు నాకే వినిపించలేదు.

అభిషేకం గారు పరిస్థితిని అర్థం చేసుకుని ముందుకొచ్చి,

"మేడం! మన సినిమా షూటింగ్ పూర్తయింది. గుమ్మడికాయ కొడుతున్నాం. మీరు తప్పక రావాలి!" అన్నాడు.

"తప్పకుండా వస్తాను!" అంది.

అభిషేకంగారు నన్ను మెల్లిగా తట్టారు. "వెళ్తాను. తప్పకుండా రండి!" అని బయల్దేరాను.

కారులో కూర్చుని వెక్కివెక్కి ఏడ్చాను.

అభిషేకం గారు, మౌనంగా చూస్తుండిపోయారు. పదినిమిషాల్లో తేరుకున్నాను. నేను ఆయన వైపు తిరిగి గిల్టీగా చిరునవ్వు నవ్వాను.

అభిషేకంగారికి మా ఇద్దరి మధ్యనున్న సంబంధం గురించి తెలిసే ఉంటుంది. ఆయన నా వైపు దయగా చూశారు.

"సార్! ఏంటి సార్, ఇంత బేలగా అయిపోతున్నారు. సినిమారంగం గురించి తెలిసిన మీరే ఈ ప్రలోభం నుండి బయటకు రాలేకపోతున్నారు?"

**షూటింగ్ పూర్తయింది. ఆనవాయితీ ప్రకారం సినిమాకు పనిచేసిన నటీనటులను, సాంకేతిక నిపుణులను పిలిచి గుమ్మడికాయ కొట్టాలి. శ్రావణిని కలవటానికి ఇదే మంచి అవకాశం అనుకున్నాడు డైరెక్టర్. అన్నపూర్ణ స్టూడియోకు వెళ్లాడు. అక్కడ శ్రావణి ఏదో సినిమా షూటింగ్‌లో ఉంది. శ్రావణిని చూడగానే డైరెక్టర్ ఎలా ఫీలయ్యాడు? శ్రావణి అతడి ఆహ్వానాన్ని మన్నించిందా?**

"ఇది ప్రలోభమో, వ్యామోహమో, సెక్స్ కోరికో కాదు సార్! నేను తను లేకుండా జీవించలేను. ఇది మాత్రం నిజం" అన్నాను.

అభిషేకం గారు విస్తుపోయి చూశారు.

"ఏం తప్పా సార్?" అన్నాను.

నిన్న రాం గురించి చెప్పిన మాటలు విన్న తర్వాత, నాకు అభిషేకం గారి పట్ల కొత్తగౌరవం ఏర్పడింది. ఈయన నాకు ఆత్మీయుడైనట్టుగా అనిపించింది. 'నవీన్' ఆయన రూపంలో దొరికినట్టుగా, నా ఆశలు, ఆశయాలు, భయాలు, కోరికలు అన్నీ ఆయనతో షేర్ చేసుకోవచ్చునన్నట్టుగా అనిపిస్తోంది. అందుకే, అలా ప్రశ్నించాను.

అభిషేకం గారు నా వైపు చూసి, "ఏం తప్పు లేదు సార్!" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయాను. అభిషేకం గారు నన్ను తీవ్రంగా విమర్శిస్తారనీ, శ్రావణి లాంటి హీన చరితను ప్రేమించడం నా స్థాయికి తగదని రకరకాల హితబోధలు చేస్తారనీ ఊహించాను.

'నిజంగా?' అన్నట్లుగా ఆయనవైపు చూశాను.

'అవును సార్! ఇందులో ఏం తప్పుంది? శ్రావణిని మీరు గుండెల్లో పెట్టుకుని పూజిస్తున్నారు. ఆమె గతం తెలిసి కూడా మీరు ఆమెను ప్రేమిస్తున్నారు. శ్రావణి కూడా తన గతం మీ దగ్గర దాచలేదనే నేను అనుకుంటున్నాను. శ్రావణి గతం గతుకులబాటలో నడిచిందేమోగానీ ఇప్పుడు మాత్రం చాలా నిజాయితీగా గడుపుతోంది. మంచి వ్యక్తిత్వమున్న, మంచినటి. మీకు మంచి జోడి".

"మరి లోకులు? ఇండస్ట్రీ వాళ్ళు?" అన్నాను నేను ఆత్రుతగా, ఆదుర్దాగా.

"లోకులు ఎవరు సార్? ఇండస్ట్రీ వాళ్ళెవరు సార్? యువకులు మీరే ఇట్లా మాట్లాడితే ఎలా సార్? టాలీవుడ్‌లో ఎవ్వరూ చేయని సాహసం చేసి ఒక గొప్ప విప్లవం సృష్టించబోతున్న మీరు కూడా ఇలా బేలగా మాట్లాడటం ఏమిటి సార్! మీ దగ్గర నుండి ఈ ప్రశ్న నేను ఎక్స్‌పెక్ట్ చేయలేదు. ఇండస్ట్రీ వాళ్ళెవరు సార్? దొంగలు... రేపొక హిట్ కొట్టండి, మీ కాళ్ళ ముందుంటారు. లేదా ఎల్లుండి ఒక ఫ్లాప్ తీస్తే మిమ్మల్ని చీత్కరించుకుంటారు. వీళ్ళ గురించా ఇన్ని రోజులుగా బాధపడుతున్నారు? ఇక శారీరక మాలిన్యం గురించి



ఈ రోజుల్లో ఎవరు పట్టించుకుంటున్నారు సార్! ఆ విషయం మీరే ఆలోచించుకోండి.

కానీ, ఆ అమ్మాయి మాత్రం భూగోళమంత బాధ మోస్తోంది సార్!

వెంటనే నిండు గుండెతో ఆమెను మీ జీవితంలోకి ఆహ్వానించండి సార్!

ఈ ముసలివాడి ఆశీస్సులు ఎప్పుడూ మీకుంటాయి" అని కళ్లు తుడుచుకున్నాడు.

•••

సినిమా నిర్మాణంలో డబ్బు ఒక ముఖ్యమైన విషయమే అయినా, సినీ రంగంలో పనిచేసే వారందరికీ సినిమా అంటే ప్రేమ. ఒక సినిమా పురుడు పోసుకుంటోందంటే, అందులో పని చేసిన వారందరికీ గర్వంగా ఉంటుంది.

ముడిసరుకు అంటూ లేని శూన్యం నుండి ఓ అద్భుత దృశ్యకావ్యాన్ని రూపొందించామన్న ఆత్మ సంతృప్తి అందరిలో తొణికిసలాడుతుంది.

గుమ్మడికాయ కొట్టే రోజున అందరి హృదయాలు భారంగా తయారవుతాయి.

మళ్ళీ కలుస్తామో లేదో? కలవకపోవచ్చు. సినిమా బంపర్ హిట్ కొట్టవచ్చు లేదా అట్టర్ ఫ్లాప్ కావచ్చు. కానీ, వందశాతం నిబద్ధతతో పని చేసినందుకు తృప్తిగా వీడ్కోలు చెప్పుకుంటారు.

బయట ప్రపంచంలో డైరెక్టర్ అంటే గొప్ప, లైట్‌బాయంటే చిన్న, అనే భేదభావం ఉంటుంది. కానీ, షూటింగ్ సమయంలో అందరూ సమానమే. అట్లా ఫీలై పని చేయకుంటే షూటింగ్ జరగదు. వేరేవాళ్ళ విషయమేమో కానీ నేను మాత్రం అందరితో కలిసిపోతాను. అందరినీ పేరుపెట్టి పిలుస్తాను. అందుకే, ఒక్కొక్కరూ వెళ్ళిపోతుంటే మనసు భారమైంది.

నేనూ, అభిషేకం గారు, ఆఫీసు స్టాఫ్ మిగిలిపోయాం.

అందరూ వచ్చినా, నా కళ్ళు మాత్రం ఒక్కరి రాకకై తపించిపోతున్నాయి.

అందరూ వెళ్ళిపోయే సమయానికి, రానే వచ్చింది. నా ప్రియబాంధవి - శ్రావణి.

నా హృదయం పుష్పమై వికసించి, కళ్ళు మధువును వర్షించాయి.

•••

షూటింగ్ సమయంలో చాలా రష్ వస్తుంది. ఎందుకంటే, ఒక్కోషాట్ రెండు మూడు సార్లు తీస్తుంటారు. అందులో ఒక్కటి తప్ప అన్నీ ఎన్‌జి షాట్సే ఉంటాయి. అంటే, 'నాట్ గుడ్ షాట్స్' ఉంటాయి. షూటింగ్ జరుగుతున్నప్పుడే, వీటి గురించి నోట్ చేసుకుంటారు. ఈ మధ్య దాదాపు అన్ని సినిమాలూ డిజిటల్ కెమెరాలతోనే షూట్ చేయబడుతున్నాయి. మిగతా విషయాల సంగతి ఎలా ఉన్నా, డిజిటల్ కెమెరాలలో మెమొరీ కార్డులు వాడటం వల్ల, వాటి వల్ల లాభం ఏమిటంటే ప్రతీషాట్‌కు ఒక రిఫరెన్స్ నంబరు వస్తుంది. 'ఓకే' అయిన షాట్లను ఒక అసిస్టెంట్ డైరెక్టర్ నోట్ చేసుకుంటాడు. డిజిటల్ కెమెరాలకు ముందు ఫిల్మ్ వాడినప్పుడు ప్రతీషాట్‌కు క్లాప్ బోర్డ్ మీద షాట్ నంబరు రాసి, వాటి ఆధారంగా 'ఓకే' షాట్లను నోట్‌చేసుకునే వాళ్ళు. ఇప్పుడు పని చాలా సులభమయింది.

ఎన్‌జి షాట్స్‌కు, ఓకే షాట్స్‌కు పెద్ద తేడా ఏమీ ఉండదు. చాలా సూక్ష్మమైన తేడానే ఉంటుంది. ఒక షాట్లో, దూరంగా ఒక వ్యక్తి ఫీల్డులోకి వచ్చిన విషయం కెమెరామెన్‌కు తెలుస్తుంది. ఫీల్డ్ క్లియర్‌చేసి, ఆ వ్యక్తిని బయటకు పంపి మళ్ళీ అదేషాట్ పిక్చరైజ్ చేస్తారు. ఒక్కోసారి, రెండోసారి తీసిన షాట్లో నటీనటులు సరైన పెర్ఫార్మన్స్ ఇవ్వకపోవచ్చు. లేదా లైట్ సరిగ్గా పడకపోవచ్చు. ఇలా ఎన్‌జి షాట్స్ అన్నింటినీ తీసేసి ఓకే షాట్స్‌ను ఒక వరుసలో పొర్చి చూసుకోవటమే రఫ్ ఎడిటింగ్ దశ.

అందుకే, డైరెక్టరుకు, ముఖ్యంగా కెమెరామెన్‌కు ఎడిటింగ్‌పై కూడా అవగాహన ఉంటే, ఎడిటింగ్ టేబుల్‌మీద పడే కష్టాలు చాలావరకు షూటింగ్ సమయంలోనే తగ్గించుకోవచ్చును.

కంటిన్యూటీస్‌తోనే చాలా ప్రాబ్లెం. అంటే ముందు షాట్లో హీరో పక్కన హీరోయిన్ ఎడమవైపు నిల

## సినీవాలి
## కూపన్ నెం.16 విజేత
**ఉచ్చులూరి విజయకుమారి**
**రాయపురం, చెన్నై**

---

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -18 (15-2-2017)

మా ప్రశ్న: **ఎన్‌జి షాట్స్ అంటే?**

మీ జవాబు------------------------------------------------------------

చిరునామా------------------------------------------------------------

--------------------------------------------------------------------

-------------------------------------పిన్-------------------ఫోన్‌నెం-------------------

**ఈ కూపన్‌ను 14 ఫిబ్రవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

బడి, తర్వాతి షాట్లో కుడివైపు వస్తే కంటిన్యూటీ దెబ్బ తింటుంది. లేదంటే ముందు షాట్లో కుడిచే తికి గడియారం పెట్టుకుని తర్వాత షాట్లో ఎడమ చేతికి పెట్టుకుంటే కంటిన్యూటీ ప్రాబ్లెం. ఇవన్నీ జరుగకుండా చూసుకోవడానికి డైరెక్షన్ డిపార్ట్ మెంట్‌లో ఒక వ్యక్తి అలర్ట్‌గా ఉంటాడు. అయినా కెమెరామెన్ తప్పులు పసిగడుతూనే ఉంటాడు.

చాలాచాలా పెద్ద సినిమాలు కూడా ఈ కంటిన్యూటీస్ విషయంలోనే దెబ్బ తింటుంటాయి. పల్లెటూళ్ళో నేల టికెట్ ప్రేక్షకులు కూడా తప్పులు పట్టుకునే స్థాయికి పెరిగింది వాళ్ళ సినిమా పరిజ్ఞానం. కాబట్టి ఒళ్ళు దగ్గర పెట్టు కుని పనిచేయాల్సి ఉంటుంది.

ఈ మధ్య వచ్చిన ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన తెలుగు సినిమాలో కూడా, హీరో కొండ కింది నుంచి చెప్పులు లేకుండా బయల్దేరి కొండ ఎక్కుతాడు. కానీ, కొండ ఎక్కిన మరుక్షణంలో కాళ్ళకు పాదరక్షలు కన్పిస్తాయి. ఇవన్నీ పెద్ద తప్పులు కాదని కొట్టిపడేస్తే ఏం అనలేం కానీ, తప్పు తప్పే కదా? తప్పు మనమీద ఉంచుకుని ఆ తప్పు ఎత్తిచూపిన వారిపైనే ఎదురు దాడి చేయడం, టాలీవుడ్ మేధావులకు అలవాటై పోయింది.

ఒక షాట్లో ఫుల్‌హ్యాండ్స్‌గా ఉన్న హీరోగారి చొక్కా, మరో షాట్లో హ్యాండ్స్ మడిచి ఉంటుంది. ఎందుకంటే, ఒక షాట్ ఒక రోజున, మరో షాట్ ఇంకో రోజున షూట్‌చేసి ఉంటారు.

అందుకే, సినిమా నిర్మాణం కనిపించినంత సులభమేమీ కాదు. ఒక యజ్ఞంలా చేస్తేనే ఫల శ్రుతి లభిస్తుంది.

•••

రఫ్ ఎడిటింగ్ పూర్తైపోయిందంటే, డైరెక్ట రుకు మళ్ళీ పని మొదలవుతుంది.

షూటింగ్ సమయంలో తీసిన ఇన్‌పుట్ నంతా, ఎన్‌జి షాట్లు తీసేసిన తర్వాత కూడా, అలాగే ఉంచేస్తే పది గంటల సినిమా తయార వుతుంది. ఇలా హద్దులు లేకుండా తీయడం డిజిటల్ కెమెరాల ప్రభంజనం తర్వాత ఎక్కు వైంది. ముడిఫిల్మ్ శకంలో ఫిల్మూ, డబ్బూ దుబారా అవుతుంది కాబట్టి, పొదుపుగా వాడే వారు.

ఎన్ని నిబంధనలు విధించుకున్నా, డైరెక్టర్, కెమెరామెన్ కొన్ని సీన్లు తీయాల్సి వస్తుంది.

కొన్నేమో ముందు జాగ్రత్తగా, బ్లాకులు తీసి పెట్టుకోవటం అంటే నటీనటులు లేకుండా సీన్లను మాత్రం షూట్‌చేసి పెట్టుకోవడం, ఇప్పుడు గ్రీన్ మాట్, బ్లూ మాట్ అనే సాంకేతిక సౌలభ్యం ఉంది. ఏదైనా, ఒక సీనులో హీరో హీరోయిన్లను చూపించా లనుకున్నప్పుడు, ఆ లొకేషన్‌కు వెళ్ళలేని పరి స్థితి ఉంటే, ఆ సీనును గ్రీన్ మాట్ స్టూడియోలో షూట్‌చేసి, అంతకుముందు షూట్ చేసి పెట్టు కున్న ఆ లొకేషన్లోకి, మనం అప్లోడ్ చేసుకోవచ్చును. తర్వాత గ్రీన్ మాట్‌ను, గ్రాఫిక్సులో తీసేస్తారు.

అంటే, అమెరికాలోని వైట్‌హౌస్ ముందు హీరో హీరోయిన్లు డాన్స్ చేస్తున్నట్లు చూపించా లంటే, హీరోహీరోయిన్లు అక్కడికి వెళ్ళాల్సిన అవ సరం లేదు. అన్నపూర్ణ స్టూడియోలో గ్రీన్ మాట్ కట్టి డాన్సు షూట్‌చేసి, దాన్ని వైట్‌హౌస్ ముందు చేస్తున్నట్టు, గ్రాఫిక్స్‌లో మార్చేసుకోవచ్చు. కానీ, వైట్‌హౌస్ బ్లాక్స్, అంటే వైట్‌హౌసును షూట్ చేసిన సీన్లు, మీ దగ్గర ఉండాలి.

అలాగే, ప్రపంచంలోని ఏవైనా అద్భుత సుందర దృశ్యాలు చూసినప్పుడు కెమెరామెన్ వాటిని షూట్ చేయకుండా ఉండలేడు. వాటిని ఎలాగైనా సినిమాలో చూపించాలనుకుంటాడు.

అందుకే, ఎంత అనుభవం ఉన్నా స్క్రిప్టుగా రెండు గంటల సినిమాకు కేవలం రెండు గంటల సినిమానే షూట్ చేయడం సాధ్యం కాదు.

సినిమా పూర్తయి ప్రేక్షకులకు ప్రదర్శించ బోయేసరికి అదొక అద్భుత సుందర దృశ్య కావ్యంలా ఉండాలి. అంటే అతుకుల బొంతలా కాకుండా, సీన్లు, ఒక దాంట్లో నుంచి తర్వాతి సీన్లోకి మెల్ట్ అయిపోవాలి. ఒక పిల్లకాలువ ప్రవాహంలా, సున్నితంగా, సుకుమారంగా, కథ ప్రవహించాలి.

అక్కడే, ఆ ఫీలింగ్ ప్రేక్షకులకు కలిగించ డానికి, ఎడిటర్ తన నైపుణ్యం ప్రదర్శించాలి.

రఫ్ ఎడిట్ నుంచి ప్రతీ పనీ, సినిమాను అత్యంత సుందరంగా తీర్చిదిద్దడం కోసమే చేయ బడుతుంది. ఒక మూడు మీటర్ల గుడ్డను రఫ్ ఎడిట్ రష్ అనుకుంటే, ఆ గుడ్డను రకరకాలుగా కత్తిరించి ఇక్కడి ముక్కను అక్కడ అతికించి, అక్కడ పీసు ఇక్కడ కలిపి కుట్టి తయారుచేసిన ఓ అందమైన చొక్కానే చివరకు మనకు కని పించే సినిమా.

అలాగే పాటలు, డ్యాన్సులు కూడా. ఒక మంచి కొరియోగ్రాఫర్ అయితే పాట అర్థాన్ని ఆకళింపు చేసుకుంటాడు. పల్లవికి ఒక డ్యాన్స్ స్టెప్పును అనుకుంటాడు. పాట అర్థాన్ని ప్రతిఫ లించేలా ఆ పల్లవిపై నాలుగైదు లొకేషన్లలో, నాలుగైదు డ్రెస్సుల్లో అదే స్టెప్పుతో డ్యాన్స్ చేయి స్తాడు. పల్లవి పాటలో నాలుగైదు సార్లు రిపీట్ అవుతుంది. అందుకని, ప్రతీసారీ వచ్చే పల్లవికి ఒకే డ్రెస్సును, ఒకే లొకేషన్ చూపిస్తే, ఫ్యాన్సుకు నచ్చదు, బోర్ కొడుతుంది. అందుకే ప్రతీసారీ కొత్త డ్రెస్సు, కొత్త లొకేషన్లలో షూట్ చేస్తుం టాడు. స్టెప్పు మాత్రం అదే ఉంటుంది. పల్లవి తర్వాత వచ్చే మూడో నాలుగో చరణాలకు వేర్వేరు స్టెప్పులు, నాట్యభంగిమలు కంపోజ్‌చేసి షూట్ చేస్తాడు. పాట నిడివి మూడు నిమిషాలుంటే, అరవై నిమిషాల ఇన్‌పుట్ షూట్‌చేసి పెట్టు కుంటాడు.

అందుకే డైరెక్టర్, కెమెరామెన్, డ్యాన్స్‌మాస్టర్, ఎడిటర్ కూర్చొని పాటకు డాన్సు ఎడిట్ చేసి జనరంజకంగా తీర్చిదిద్దుతారు.

ఎడిట్ టేబుల్ మీద రోజుకొకసారి డైరెక్టర్ గుండెకు గాయమవుతుంది. ఎంతో అద్భుతంగా వచ్చిందనుకున్న సీను, మొత్తం సినిమా స్కీంలో ఇమడక కట్ చేయాల్సి వస్తుంది. ఒక్కోసారి నిర్దా క్షిణ్యంగా డైలాగ్స్ తొలగించాల్సి వస్తుంది. ఎందు కంటే, అప్పుడప్పుడు 'లిప్ సింక్' కాదు. అందు కని, ఆ సీను తీసేయాల్సి వస్తుంది. లేదా ప్యాచ్ వర్క్ పెట్టుకుని షూట్ చేయాల్సి ఉంటుంది. మళ్ళీ కాల్షీట్లు, లొకేషన్లు, పర్మిషన్లు, యూనిట్, లైట్లు. ఇవన్నీ తల్చుకుని ప్రొడ్యూసర్ 'బేర్'మంటాడు. అందుకని, చాలాసీన్లు ఎడిటర్ కత్తెరకు బలవు తుంటాయి.

•••

మొత్తానికి సినిమాను రెండు గంటల పన్నెండు నిమిషాలకు కుదించాం. అంతిమంగా వచ్చిన ఫైనల్ ప్రొడక్ట్ నేననుకున్న విధంగా వచ్చింది. ఒరిజినల్ నవలలో, రచయిత అంతర్లీ నంగా అల్లుకున్న ఆత్మను ఆవిష్కరించగలిగాను.

(ఇంకా వుంది)

## మళ్లీ మొదలెట్టేసింది



మామూలుగా ప్రసవం అయిన మూడు నెలల వరకూ తల్లి బయట ఎక్కువగా తిర గదు. ఆరు నెలలు అయిన తరువాత పూర్తి స్థాయిలో రోజువారీ పనులలో పాల్గొంటుంది. ఇది మామూలు అమ్మల విషయంలో. కరీనా మామూలు అమ్మ కాదు కదా! బాలీవుడ్ సెల బ్రిటీ అన్ని విషయాలలో తన ప్రత్యేకతను నిలుపుకుంటున్నట్టే బిడ్డపుట్టి నెలరోజులు పూర్తి అయిన వెంటనే పార్టీలకంటూ బయ టకు బయలుదేరింది. బాలీవుడ్‌లో ఓ పార్టీలో పాల్గొనడానికి వచ్చిన కరీనా ఫోటోలకు పోజు లిచ్చేసింది కూడా! అతి త్వరలోనే తిరిగి షూటింగ్‌లు మొదలు పెట్టబోతోందట!




# వీటితో లాభం కన్నా నష్టమే ఎక్కువ!







**టమోటాలు:** టమోటాలు ఆకలిని పెంచుతా యని అంటారు. ఈ కారణంగానే భోజనానికి ముందు కొందరు టమోటా సూప్ తాగుతారు. భోజనానికి ముందు కాకుండా ఖాళీ కడుపుతో టమోటా జ్యూస్ తాగితే ఇంతే సంగతులు అంటున్నారు నిపుణులు. దీనిలోని టానిక్ ఆసిడ్‌లు ఎసిడిటీని పెంచి పేగుల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తాయని చెబుతున్నారు.

**అరటి పండు:** శరీరంలో మెగ్నీషియం ఎక్కువైతే గుండె ఆరోగ్యానికి ముప్పు అని చెబుతున్నారు నిపుణులు. అరటి పరగడుపున పండు తింటే శరీరంలో మెగ్నీషియం స్థాయి ఒక్కసారిగా పెరిగే ప్రమాదం ఉందని అంటున్నారు. దీని కారణంగా గుండెనొప్పి లేదా గుండె సంబంధ సమస్యలు తలెత్తే ప్రమాదం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. భోజనానికి ముందు లేదా ఆ తరువాత అరటి పండు తీసుకుంటే మంచి ఫలితాన్నే పొందవచ్చని చెబుతున్నారు.

**స్వీట్లు:** ఉదయాన్నే లేచి ముఖం కడుక్కోగానే కొందరికి స్వీటు తినే అలవాటు ఉంటుంది. ఇది చాలా చెడ్డ అలవాటని నిపుణులు సూచిస్తున్నారు. దీని వలన డయాబెటిస్ వచ్చే ప్రమాదం ఉందని వారు చెబుతున్నారు. ఎలాగంటే....పరగడుపున తీపి పదార్థాలు తినడం వలన శరీరంలో ఇన్సులిన్ స్థాయి ఒక్కసారిగా పెరిగిపోతుంది. దీని వలన క్లోమ గ్రంథి మీద అదనపు భారం పడుతుంది. ఈ భారం పెరిగి పెరిగి డయాబెటిస్‌కి దారితీసే అవకాశం కూడా లేకపోలేదని వారు హెచ్చరిస్తున్నారు.

# పచ్చివి మంచివి కావు

పచ్చి కూరగాయలు ఆరోగ్యానికి మంచివంటూ చాలామంది తెగ తినేస్తుంటారు. కానీ ఇవి ఆరోగ్యానికి అంతమంచివి కావు అంటున్నారు నిపుణులు. ముఖ్యంగా పరగడుపున వీటిని తినకూడదని సూచిస్తున్నారు. వీటిని పరగడుపున తింటే గ్యాస్, ఛాతినొప్పి వచ్చే ప్రమాదం ఉందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. ఉదయం బ్రేక్‌ఫాస్ట్ కింద వీటిని తీసుకోకూడదని స్పష్టం చేస్తున్నారు. సాయం సమయంలో లేదా మధ్యాహ్నం లంచ్ తరువాత స్నాక్స్ కింద మాత్రమే వీటిని తీసుకుంటే మంచిదని అంటున్నారు. పచ్చివాటి కన్నా కూడా ఉడకబెట్టినవి తీసుకుంటే మంచిదని సలహా ఇస్తున్నారు.



# పురుగు మందులతో డయాబెటిస్

డయాబెటిస్ వంశపారంపర్యంగా వచ్చే వ్యాధి అని చాలా మంది నమ్ముతుంటారు. డయాబెటిస్ రావడానికి ఇది ఒక్కటే కారణం కాదని, చాలా కారణాలు ఉన్నాయని, ఆఖరికి పురుగుమందులు కూడా డయాబెటిస్ రావడానికి కారణం కావచ్చని పరిశోధకులు చెబుతున్నారు. ఈ పురుగు మందుల ప్రభావం ఏవిధంగా శరీరంలోకి ప్రవేశించినా మెలటోనిన్ ఉత్పత్తి మీద తీవ్ర ప్రభావం చూపుతుందని వారు అంటున్నారు.



ఈ రసాయనంలో వచ్చే మార్పులతో డయాబెటిస్ వచ్చే అవకాశం ఉందని హెచ్చరిస్తున్నారు. ముఖ్యంగా కూరగాయలు, నిత్యావసర సరుకుల కొనుగోలులో జాగ్రత్త వహించాలనీ, సేంద్రియ ఉత్పత్తులను కొనుగోలు చేసినట్టయితే పలు ఆరోగ్య సమస్యలకు చెక్ పెట్టవచ్చునని నిపుణులు సూచిస్తున్నారు.

# ఆరోగ్యం గురించిన భయంతో గుండెజబ్బులు?



ఆరోగ్యం గురించి తరచు బాధపడేవారిలో గుండెజబ్బులు వచ్చే ప్రమాదం ఉందని అంటున్నారు నార్వే పరిశోధకులు. 50 సంవత్సరాలు పైబడిన ఏడువేల మంది మీద వీరు ఓ అధ్యయనం నిర్వహించారు. వారి ప్రస్తుత ఆరోగ్య స్థితి, వారి ఆలోచనా విధానాన్ని నోట్ చేసుకున్నారు. వీరిలో ఎక్కువ మంది తమ ఆరోగ్యం గురించి భయపడుతున్నట్టు చెప్పారు. పన్నెండు సంవత్సరాల అనంతరం వీరిని తిరిగి ప్రశ్నించగా, ఆరోగ్యం గురించి ఎక్కువగా బాధపడే వారిలో గుండెజబ్బులు ఉన్నట్టు పరిశోధకుల దృష్టికి వచ్చింది. అనవసర భయాలే గుండెజబ్బులకు కారణం కావచ్చు అని వారు చెబుతున్నారు.

ఈ భయాల కారణంగానే ఒత్తిడి, ఆందోళన, రక్తపోటు వంటివి ఎక్కువ కావడం, గుండె ఆరోగ్యాన్ని దెబ్బతీయడం జరిగి ఉండవచ్చని అంటున్నారు. ఆరోగ్యం గురించి అనవసరంగా ఆందోళన చెందడం కన్నా మానసికంగా ప్రశాంతంగా ఉండగలిగితే సంపూర్ణ ఆరోగ్యం దానంతట అదే సిద్ధిస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు.

-అవినాష్




# బాక్సర్

**'అర్జంటుగా రావాలి' ఇన్‌స్పెక్టర్ విజయ్ మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తుంటే ఘటనా స్థలానికి చేరుకున్నాడు డిటెక్టివ్ శరత్.**

**హాస్పిటల్ రిసెప్షన్‌లో ఎదురు చూస్తున్న విజయ్, శరత్ దగ్గరకు వచ్చాడు.**

**'ఓ మిస్సింగ్ అమ్మాయి దొరికింది. బహుశా కిడ్నాపర్ చెర నుంచి తప్పించుకుందేమో. కానీ ఏమీ చెప్పలేకపోతోంది, మెదడు పనిచేస్తున్నట్టులేదు. తానెవరు? ప్రస్తుతం ఎక్కడున్నదీ, ఏమి చేస్తున్నదీ చెప్పలేకపోతోంది. ఆమెనుంచి సమాచారం సేకరిస్తే కిడ్నాపర్ దొరుకుతాడు. పోలీసురక్షణలో ఉందని తెలిస్తే కిడ్నాపర్లు పారిపోవచ్చు' విషయం వివరించాడు విజయ్.**

'ఆమె గురించి ప్రెస్‌కి చెప్పకండి'

'లేదు, ఆలస్యమైపోయింది. షామీర్‌పేటలేక్ దగ్గర అపస్మారకస్థితిలో పడి ఉండగా మనకు చెప్పిన వాళ్ళే టీవీవాళ్ళకీ సమాచారం ఇచ్చారు. ఆ అమ్మాయిని ఎలా రక్షించారో వాళ్ళు టీవీలో చెప్తున్నారు' అన్నాడు విజయ్. దాంతో అసిస్టెంట్ రామువైపు తిరిగాడు శరత్. 'రామూ, అమ్మాయి వివరాలు, నేపథ్యం సేకరించు' అన్నాడు.

'యెస్ బాస్' అని వెళ్ళిపోయాడు రాము.

'నేనోసారి అమ్మాయిని చూడాలి' అన్నాడు శరత్.

'ఈ గదిలో ఉంది' చూపించాడు విజయ్.

గదిలోకి రావటానికి విజయ్ ఎందుకు ఇష్టపడలేదో అమ్మాయి పరిస్థితి చూశాక అర్థమైంది శరత్‌కి.

ఆమె శరీరమంతా గాయాలే. ముఖం వాచిపోయింది. కళ్ళు, దవడలు, చెంపలు ఉబ్బి ఉన్నాయి. స్పృహలో లేకపోయినా, ఆమె పెదవులు కదులుతున్నాయి. దెబ్బలు తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నట్టు కదులుతోంది. శబ్దం చేయకుండా మెల్లగా అమ్మాయిదగ్గరకు నడిచాడు శరత్.

ఆమెను జాగ్రత్తగా పరిశీలించటం ప్రారంభించాడు.

అమ్మాయిని ఏదో అదృశ్యశక్తి బాధిస్తున్నట్టుంది. అపస్మారకస్థితిలో కూడా ఆ అదృశ్య శక్తితో పోరాడుతున్నట్టుంది.

ఆమె ఒంటిమీద గాయాలు పరిశీలించాడు శరత్. ముఖ్యంగా, ఆమె చేతులు పరిశీలిస్తున్నప్పుడు అతడు కళ్ళు చిట్లించి చూశాడు.

ఆమె చెవులదగ్గర గుసగుసగా చెప్పాడు శరత్. 'నువ్వు తప్పించుకున్నావు. ఇక నిన్ను ఎవ్వరూ ఏమీచేయలేరు. నువ్వు ప్రాణాలతో తప్పించుకున్నావు'.

ఆమెలో మార్పులేదు.

పలుమార్లు ఆమెచెవిలో గుసగుసగా ఆ మాటలేచెప్పి బైటకు వచ్చాడు శరత్.

'ఎలా ఉంది?' అడిగాడు విజయ్.

'ఓసారి డాక్టర్‌ని కలుద్దాం' అంటూ డాక్టర్ గదివైపు నడిచాడు శరత్.

•••

'అమ్మాయిని భౌతికంగా హింసించారన్నది స్పష్టం. ఆమెకు డ్రగ్స్ కూడా ఇచ్చారు. బ్లడ్, యూరిన్‌టెస్ట్ చేయించినప్పుడు, 'మారినాల్' అనే డ్రగ్ ఇచ్చారని రక్తపరీక్షలో తెలిసింది.

అదివిని శరత్‌కళ్ళు చిన్నవయ్యాయి. 'మారినాల్ అంటే డ్రోనొబినాల్ కదా! ఇది కృత్రిమంగా తయారుచేసిన మారిజువానా డ్రగ్?' అడిగాడు శరత్.

'అవును. మాదకద్రవ్యంలాంటి డ్రగ్. ఎయిడ్స్ రోగులకు, కీమోథెరపీలో ఉన్నవారికి ఇస్తారు. ఎక్కువ వాడితే ఈ డ్రగ్‌కి బానిసలవుతారు. అందరికీ అందుబాటులో ఉండదీ మెడిసిన్' చెప్పాడు డాక్టర్.

'ఆమె శరీరంపై గాయాలు పరిశీలించారా?' అడిగాడు శరత్.

ఆ ప్రశ్నతో డాక్టర్ ముఖం గంభీరంగా మారింది 'వాడు మనిషి కాదు, మృగం అనడం ఆ మృగానికి కూడా అవమానమే' అన్నాడు.

**ఆఫీసు నుంచి ఇంటికి చేరుకోవాల్సిన అమ్మాయి అపస్మారకస్థితిలో మూడురోజుల తర్వాత పోలీసుల దగ్గరకు చేరింది. బహుశా కిడ్నాపర్ల చెర నుంచి తప్పించుకుని ఉంటుందని పోలీసులు భావించారు. కానీ ఆమె ఏం చెప్పలేకపోతోంది. ఏమీ గుర్తించలేకపోతోంది. కిడ్నాపర్లు చేజారిపోకుండా వెంటనే పట్టుకోవాలి. డిటెక్టివ్‌ను పిలిపించాడు ఇన్‌స్పెక్టర్ విజయ్. మరి ఆ డిటెక్టివ్ ఏం ఉపాయం పన్నాడు?**

'ముఖ్యంగా ఆమె చేతుల వెనుకవైపు గమనించారా?'

'షి సీమ్స్ ఏ గ్రేట్ ఫైటర్. వాడి ఎముకలు విరగ్గొట్టి ఉంటుంది' అన్నాడు డాక్టర్. శరత్ లేచాడు.

•••

'బాస్ అమ్మాయిపేరు శాలిని. నేషనల్, ఇంటర్నేషనల్ లెవెల్స్‌లో పాల్గొన్న కరాటే ఛాంపియన్. చదువు పూర్తయ్యాక స్పోర్ట్స్ కోటాలో ఉద్యోగం సంపాదించింది. ఆమె బాయ్‌ఫ్రెండ్ శశికాంత్. కరాటే చాంపియన్. ఇద్దరూ ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు. ఆఫీసులో ఇద్దరినీ 'కరాటే కిడ్స్' అంటారట. అతడు కూడా గౌరవప్రదమైన కుటుంబానికి చెందినవాడే. శత్రువులు ఉన్నట్టు లేరు. ఎవరు కిడ్నాప్ చేశారో తెలియటంలేదు' చెప్పాడు రాము.

'అమ్మాయి అదృశ్యమై ఎన్నిరోజులైంది? ఎలా అదృశ్యమైనదీ వివరాలు సేకరించావా?' అడిగాడు శరత్.

'బాస్, నేను స్వయంగా పరిశోధించి తెలుసుకున్నాను. అమ్మాయికి స్కూటీ ఉంది. మూడు రోజుల క్రితం అమ్మాయి ఆఫీసునుంచి బయలుదేరింది. ఆరోజు స్కూటీ సర్వీసుకి ఇచ్చిందట. సర్వీస్ స్టేషన్‌కి, అట్నుంచి ఇంటికి వెళ్తానని కొలీగ్స్‌కి చెప్పిందట. కానీ సర్వీస్ సెంటర్‌కి చేరుకోలేదు'.

'బాయ్‌ఫ్రెండ్‌ని లిఫ్ట్ అడగలేదా?'

'కొన్నినెలలనుంచీ వాళ్ళమధ్య మాటలు లేవట'.

ఆ మాటతో కొద్దిసేపు ఆలోచనలో పడ్డాడు శరత్.

'ఆమెని చివరిసారి చూసిందెవరు?'

'ఆఫీసు కొలీగ్ నీరజ. బస్టాపులో నీరజని బస్ ఎక్కించింది శాలిని. ఆటోలో వెళ్తానని చెప్పిందట. నీరజ బస్సెక్కి చెయ్యి ఊపింది, అంతే' చెప్పాడు రాము.

'నువ్వూ, నీ అసిస్టెంట్లూ ఆ బస్టాప్స్‌లో ఆగే ఆటోవారిని ప్రశ్నించండి. రెగ్యులర్‌గా వచ్చేవాళ్ళెవరైనా రావటం మానేశారా? లేక ఎప్పుడూరాని వాళ్ళు ఆరోజు ప్రత్యేకంగా వచ్చారేమో కనుక్కో'.

'యెస్ బాస్' అంటూ లేచి ఆగాడు రాము. 'బాస్, షెర్లాక్‌హోమ్స్ లాంటి డిటెక్టివ్‌లంతా ఒక టోపీచూసి మొత్తం మనిషిగురించి చెప్తారు. అలాంటి డిటెక్టివ్ కావాలంటే ఏంచేయాలి బాస్?' అడిగాడు రాము.

శరత్ నవ్వాడు. 'అందరూ షెర్లాక్‌హోమ్స్‌లైతే షెర్లాక్ విలువ ఏముంటుంది? ఇసుకపొరలు తొలగించి ఎక్కడోపడివున్న సూది వెతకటం

లాంటిది పరిశోధన అంటే. అణువణువు శోధించటమే తప్ప సత్యాన్ని కనిపెట్టేందుకు షార్ట్‌కట్స్ లేవు' అన్నాడు.

విజయ్‌కి ఫోనుచేసి, శశికాంత్‌ని, నీరజను కలవాలి' అన్నాడు శరత్.

●●●

'ఇలా జరుగుతుందని ఏ మాత్రం అనుమానించినా ఆమెని ఆటో ఎక్కించి నెంబరు నోట్‌చేసేదాన్ని' అంది కన్నీరుకారుస్తూ నీరజ.

'బాగా గుర్తుతెచ్చుకోండి. బస్సు ఎక్కాక ఆమెవైపు చూడలేదా?' 'బస్సెక్కి తొంగిచూశా. రోడ్ క్రాస్‌చేసి వెళ్తోంది. అక్కడ ఆటో ఆగి  ఉన్నట్టుంది' నీరజ ఆలోచిస్తూ చెప్పింది.

●●●

'చిన్నవిషయంలో మాకు వివాదం వచ్చింది. ఇప్పుడాలోచిస్తే సిల్లీగా అనిపిస్తోంది. నా ఫ్రెండ్ యశ్‌పాల్ రెజ్లర్. కుస్తీ ఛాంప్. నాకన్నాముందే వాడు శాలినీ వెంటపడ్డాడు. కానీ ఆమె నన్ను ఇష్టపడింది. మేం మంచి ఫ్రెండ్స్, కానీ, వాడి చూపులు, చేష్టలు అసహ్యంగా ఉంటాయి. వాడితో శాలిని మాట్లాడటం నాకిష్టం ఉండదు. కానీ ఆమె మాట్లాడటం మానలేదు. వాడో, నేనో ఎవరు కావాలో తేల్చుకోమన్నాను. స్వేచ్ఛ కావాలంది. వారం క్రితమే 'సారీ' అనే మెసేజ్ పంపాను. తనూ అదే మెసేజ్ పంపింది. మేం కలిసేలోపు ఇలాజరిగింది' అంటూ మెసేజ్‌లు చూపించాడు.

'యశ్‌పాల్ ఎక్కడుంటాడు?'

సమయం చూశాడు శశికాంత్. 'వాడికో ఆటో ఉంది. నడుపుతాడు. ఎక్స్‌ట్రా ఇన్‌కమ్' చెప్పాడు శశికాంత్.

●●●

'నాకు డబ్బు అవసరం. ఉద్యోగం అయ్యాక ఆటో నడుపుతా. అది నేరం కాదుగా?' ప్రశ్నించాడు యశ్‌పాల్.

శాలిని ఫొటో చూపించి 'ఈ అమ్మాయి తెలుసా?' అడిగాడు శరత్.

'తెలుసు. శాలిని. కొన్నిరోజుల క్రితం ఓ ఆటో ఎక్కి అదృశ్యమైంది. మెదడు దెబ్బతింది. ఆమెని శారీరకంగా హింసించారు. 'ఆరోజు నీ ఆటో ఎక్కడెక్కడ తిప్పావు?' అడిగాడు శరత్ సూటిగా.

తెల్లబోయి శరత్‌వైపు చూశాడు యశ్‌పాల్. పెదిమలు కదిలాయి. మాటలు పైకిరాలేదు. అతికష్టంమీద అన్నాడు. 'శాలినిని నేను ఇష్టపడ్డాను గానీ, అలాంటివాణ్ణి కాదు.'

'ఆరోజు ఆటో ఎక్కడెక్కడ తిప్పావు?' అడిగాడు శరత్ అతన్ని పరిశీలనగా చూస్తూ.

రోజూ నా నలుగురు కొలీగ్స్‌ని ఇంటిదగ్గర దింపుతాను. ఆ తరువాత ప్యాసింజర్లను బట్టి వెళ్తాను. ఆ రోజు ఎటెళ్ళానో గుర్తులేదు'

'కొలీగ్స్‌ని ఇంటిదగ్గర దింపితే ఇక శాలినిని ఇతను తీసుకెళ్ళినట్టుకాదుగా?' అన్నాడు విజయ్.

యశ్‌పాల్ ఆటోనెంబరు నోట్‌చేసుకుని, 'నీ ఆటోలో వచ్చే కొలీగ్స్ పేర్లేమిటి?' అని అడిగాడు.

●●●

శరత్, విజయ్ వెళ్ళాక చాలాసేపు యశ్‌పాల్ ఆటోలో అలాగే కూర్చుని, తరువాత సవారీ లేకుండానే ఆటోని ముందుకు దూకించాడు.

దూరంగా వెయిట్ చేస్తున్న శరత్ కారు స్టార్ట్ చేసి ఫాలో అయ్యాడు.

'మెసేజ్‌లు చూడు' అన్నాడు సెల్ విజయ్ చేతికిచ్చి.

●●●

సందులు, గల్లీలు తిరిగిన ఆటో ఓ ఇంటి ముందు ఆగింది.

కాస్త దూరంలో కారుదిగి అటువైపు నడిచారు శరత్, విజయ్. అతడు వెళ్ళిన ఇంట్లోకి వెళ్ళకుండా, ఆ ఇంటిచుట్టూ తిరిగి చూశారు. తెరచిన కిటికీలకు దోమలనెట్ ఉంది. లోపల లైట్లు వెలుగుతున్నాయి. గదిలోవన్నీ బైటకు కనిపిస్తున్నాయి. ఓ బెడ్‌రూమ్‌లో మంచంపై పడుకుని టీవీ చూస్తున్న యువకుడి దగ్గరకెళ్ళాడు యశ్‌పాల్. వాడివైపు కోపంగాచూసి, 'నేను ఊరెళ్లినరోజు శాలినీని ఆటోలో ఎక్కించుకున్నావా? ఆమెను ఏం చేశావు?' అరిచాడు యశ్‌పాల్.

యువకుడు తిరస్కారంగా  చూశాడు.

'నీకు చేతకాదు. ప్రేమ, దోమ అంటావు. చెప్పిన మాట వినని వాళ్ళకి నాలుగు తగిలిస్తేనే ఒప్పుకుంటారు' నవ్వాడా యువకుడు.

'ఏం చేశావు శాలినీని?' అరిచాడు యశ్‌పాల్ పిడికిళ్ళు బిగించి.

'నేను బాక్సర్‌ని. నాకీ దెబ్బలు లేకపోయుంటే ఈపాటికి నీ కాళ్లు చేతులు విరిచేసేవాణ్ణి'.

యశ్వంత్ కోపంతో అతడిపైకి దూకాడు.

శరత్, విజయ్ లోపలకు పరుగెత్తారు.

●●●



'శాలిని, శశికాంత్, యశ్‌పాల్ కొలీగ్స్. యశ్‌పాల్ స్నేహితుడు ముకేశ్. అతడు బాక్సర్. పర్మినెంట్ జాబ్ రాలేదు. ప్రైవేట్ ల్యాబ్‌లో చేస్తున్నాడు. మారినాల్ డ్రగ్‌గురించి ల్యాబ్‌లో తెలుసుకున్నాడు ముకేశ్. అతడికి ఎప్పటినుంచో శాలినిపై కన్ను. శశికాంత్‌తో విడిపోవటం, ఆరోజు యశ్‌పాల్ ఊళ్లో లేకపోవటంతో ముకేశ్‌కి ధైర్యం వచ్చింది. యశ్‌పాల్ బదులు ఆ రోజు ఆటో నడపాలి. ఇంకా ఆఫీసు టైమ్ పూర్తికాలేదు. సిగరెట్ తాగుతూ రోడ్డుకి మరోవైపు నిలుచున్నాడు ముకేశ్. తెల్సినవాడే కదా అని అతని ఆటో ఎక్కింది శాలిని.

వేరే తోవలో తీసుకుపోయాడు. ఆమెని ఇంట్లోకి లాక్కెళ్లి బాక్సింగ్ ప్రావీణ్యం ప్రదర్శించాడు. కరాటే దెబ్బలతో అతని ఎముకలు విరగ్గొట్టింది శాలిని. చివరికి ఆమెని స్పృహతప్పేలాకొట్టి, మారినాల్ ఇచ్చాడుగానీ ఆమె కొట్టిన దెబ్బలకు పడిపోయాడు. మందు ప్రభావం వల్ల ఆమె మెదడు దెబ్బతింది. ఎలా వచ్చిందో షామీర్‌పేటకు చేరుకుంది. చూసిన వారు ఆమెని పోలీసులకు  అప్పగించారు. విరిగిన ఎముకలకు కట్లు కట్టించుకున్నాడు ముకేశ్. జరిగింది యశ్‌పాల్‌కి తెలియదు. ఆరోజు ఇతని ఆటోకోసం ఎదురుచూసిన కొలీగ్స్ వేరే ఆటోలో వెళ్ళిపోయారు. రోజూ పికప్ చేసుకునే నలుగురు కొలీగ్స్‌నీ ముకేశ్ పికప్ చేసుకోలేదని రామూ ఇచ్చిన మెసేజ్‌తో నాకు డౌట్ వచ్చింది. ఆ మెసేజ్ నేరస్థుడిని పట్టిచ్చింది' కేసు వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**



# హాయి హాయిగా వెరైటీ మసాజ్‌లు

**సనాతన వైద్య విధానమైన ఆయుర్వేదంలో పంచకర్మ చికిత్సలకు ఎంతో ప్రాధాన్యం ఉంది. ఈ పంచకర్మ చికిత్సలలో మర్దనం ఒకటి. నేడు వీటికే విస్తృత ప్రచారం జరుగుతోంది. ఒకప్పుడు ధనవంతులకే పరిమితమైన మసాజ్ నేడు అందరికీ అందుబాటులో ఉంది. ఇప్పుడు మసాజ్‌కి ఎంతో క్రేజ్ ఉంది. ఆ క్రేజ్ దృష్టిలో పెట్టుకునే ప్రపంచమంతటా మసాజ్ సెంటర్లు వెలిశాయి.**

మసాజ్ అంటే మర్దనం. ఇదెలా చేస్తారు?

మామూలుగా అయితే ఆయిల్‌తో చేస్తారు. లేకుంటే మూలికలు ఉపయోగించి రసాలు తయారు చేసి మర్దన చేస్తారు. మనకు తెలిసింది అంతే కదా! అయితే మీరు ఎప్పుడూ కనీవినీ ఎరుగని మర్దనలు ప్రపంచమంతటా చేయించుకుంటున్నారు. వీటిని చదివితే మసాజ్‌లు ఇలా కూడా చేస్తారా? అని అనుకోకమానరు. అలాంటి వింతైన, అబ్బుర పరచే మర్దనాలేంటో మీరూ చదివేసేయండి!

### మంటలతో శరీర మర్దన

నిప్పుతో చెలగాటం ఆడుతారా ఎవరైనా చెప్పండి. కానీ చైనా వాళ్లు ఆడుతారు. చైనా ఆసుపత్రుల్లో చలికాలంలో మంటలతో వైద్యం చేయడం సంప్రదాయం. కాలే స్వభావంగల ఒకలాంటి రసాయనంలో ఒక గుడ్డను తడిపి తర్వాత తగులబెడతారు. దాన్ని అనారోగ్యానికి గురైన రోగి శరీరంపై ఉంచి మర్దన చేస్తారు. ఇలా ఉంచితే ఆరోగి జబ్బు నయం కావడమే కాకుండా, ఫ్లూ, జలుబు లాంటివి వారి దరిజేరవని అక్కడవారి గట్టినమ్మకం.

### కోడిగుడ్ల మర్దన

కోడిగుడ్లతో కూరచేస్తారు లేదా ఆమ్లెట్ వేస్తారు. ఇంకేం చేస్తారనుకుంటున్నారా? కానే కాదు అక్కడ కోడిగుడ్లతో పిల్లలకు మర్దనా చేస్తారు. ఇదెక్కడో అనుకుంటున్నారా? ఇది కూడా చైనాలోనే. మనదేశంలో స్నానానికి ముందు పిల్లలకు నూనెరాసి మర్దన చేసే సంప్రదాయం ఉన్నట్టుగానే చైనాలో కూడా పిల్లలకు రెండోఏట రెండవ పౌర్ణమినాడు తల వెంట్రుకలు తీయించి ఆ తరువాత ఆ తలపై కోడి గుడ్లతో మర్దన చేస్తారు. ఇలా చేయడంవల్ల ఆ పిల్లలకు అదృష్టం కలిసివస్తుందని చైనీయుల నమ్మకం.

### చెంపదెబ్బల మర్దన!

ఒక చెంపమీద కొడితే రెండవచెంప చూపించమన్నారు బాపూజీ. ఎవరైనా మనల్ని చెంపదెబ్బ కొడితే ఎక్కడలేని పౌరుషం ముంచుకొస్తుంది. కానీ థాయిలాండ్‌వాసులు మాత్రం బాపూజీ చెప్పిన

### ప్రపంచ రికార్డు

పర్యాటక రంగంలో విశేష ఆదరణ పొందుతున్న దేశం తైవాన్. ఇటీవల మసాజ్ ఫీట్‌లో గిన్నిస్ రికార్డు సొంతం చేసుకుంది. సాధారణంగా ఈ రికార్డుకోసం చిత్ర విచిత్రమైన ఫీట్లు చేయడం పరిపాటి. అయితే మసాజ్‌కు పెట్టింది పేరైన తైవాన్‌లో దీని ద్వారానే గిన్నిస్ రికార్డు సొంతం చేసుకున్నారు. జపాన్, కొరియా దేశాల పర్యాటకులు తైవాన్ అందాలు తిలకించేందుకు వచ్చారు. వీరందరినీ ఒకచోట చేర్చి మసాజ్ చేసేందుకు ఒక స్టేడియంను వేదికగా ఎంచుకున్నారు. మొత్తం రెండువేల మంది పర్యాటకులకు ఒకేసారి మసాజ్ చేయడం ప్రారంభించారు. కేవలం ఇరవై నిమిషాల్లోనే ఒకే సమయంలో అందరికీ మసాజ్ పూర్తిచేసి గిన్నిస్ రికార్డు సొంతం చేసుకున్నారు. అంతేకాకుండా ఇప్పటికే ఈ కళలో పదివేల మంది ఔత్సాహికులు ప్రత్యేక శిక్షణ ద్వారా ఉపాధి పొందడం గమనార్హం.



మాటలు అక్షరాలా పాటిస్తున్నారు. గాంధీజీ చెప్పిన ఉద్దేశం ఏదైనా, ఈ డైలాగ్ వారికి నచ్చిందో ఏమో కానీ ఏకంగా దాంతో ఓ పెద్ద బిజినెస్ చేసేస్తున్నారు. అదేనండీ చెంపదెబ్బ మసాజ్. దీనికోసం థాయి లాండ్‌కి చెందిన మార్విన్, టాటా అనే ఇద్దరు వ్యక్తులు ప్రభుత్వ లైసెన్సులు కూడా తీసుకున్నారు. ఈ చెంపదెబ్బ మర్దనతో ముఖం అందం మెరుగు పరుచుకోవచ్చు. ముఖంపై ముడుతలు సరిచేయవచ్చు. అతుక్కు పోయుండే ముఖాన్ని నునుపుగా తయారు చేసుకోవచ్చు. వయసు పెరుగుతున్న కొద్దీ ముదిమి లక్షణాలు కనిపించకుండా వాటిని తిప్పికొట్టవచ్చు నని చెబుతున్నారు. 100 సంవత్సరాల క్రితం వారి గురువు ఈ మర్దనను కనిపెట్టి దీని రహస్యాన్ని 10 మందికి మాత్రమే చెప్పి నేర్పించిందట. మిగి లిన లైసెన్స్‌దారులు ఎవరూ అనేది తెలియదట. వీరిరువురూ ఇప్పుడు అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో నగరంలో చెంపదెబ్బల మర్దన షాప్ నడుపుతు న్నారు. ఈ మర్దన చేయించుకోవడానికి చాలామంది ఇష్టపడుతున్నారు.

### నత్తగుల్లలతో

ఎవరైనా మెల్లగా నడుస్తుంటే నత్తనడకేంటి అంటుంటారు. అంత మెల్లగా నడుస్తుంటాయి అవి. అలాంటి నత్తలతో కూడా ఇప్పుడు మర్దన చేస్తు న్నారు. రష్యా, జపాన్, బ్రిటన్ దేశాలలో ఈ మర్ద నకు మంచి గిరాకీ ఉంది. ఆ దేశాలలో ఈ మర్దన షాపులు చాలా ఉన్నాయి. ముఖచర్మాన్ని సుతిమెత్తగా తయారు చేసి అందాన్ని మెరుగుపరుస్తుందట ఈ మసాజ్. ఆ నత్తగుల్లలు ముఖంపై విధించే ఒకలాంటి బంక చర్మానికి మెరుగులు అందిస్తుంది. దీనివల్ల ముఖంపై ముడతలు పోతాయట. ముఖంపై మచ్చలు సైతం పోతాయి. కాలినచర్మం కూడా సరైపోతుంది. ఈ మసాజ్ ఎలా చేస్తారంటే ముఖంపై మూడు నత్త గుల్లలు ఉంచుతారు. వాటిని నుదురుమీంచి కిందకి, తిరిగి కిందనుంచి ముఖంపైకి నడిపిస్తారు.

### సరస్సులో విహరిస్తూ..

ప్రపంచంలోనే అతి రొమాంటిక్ నగరం వెనిస్. ఇది అందరికీ తెలుసు. ఈ ఇటలీ నగరం లోని ఒక హోటల్లో మర్దన షాప్ ఉంది. విశ్రాంతి కావా లని కోరుకుంటూ నగరమంతా తిరగాలనుకునే వారికి ఈ మర్దన చాలా ఉపయోగపడుతుంది. నగర నడిబొడ్డున సరస్సులో ఉన్న ప్రత్యేక పడవలో విహరిస్తూ ఎంచక్కా ఈ మర్దన చేయించుకోవచ్చు.

### ఏనుగు మర్దన

ఏనుగు అడుగువేస్తే ఇంకేమైనా ఉందా? పచ్చడైపోతాం కదా! కానీ అలాంటి ఏనుగులతో మర్దన చేస్తున్నారు. ఈమర్దన కావాలంటే థాయి లాండ్‌కి వెళ్ళాల్సిందే. నడుమునొప్పి ఉన్నవారు ఈ మర్దన చేయించుకోవచ్చు. చియాంగ్ మై అనే పర్యాటకుల పార్కులో శిక్షణ ఇచ్చిన ఒక ఏనుగుతో నడుము మీద సున్నితంగా తొక్కిస్తారట. భయం లేని వారు ఈ మర్దన చేయించుకోవచ్చు.

### మచ్చు కత్తి మర్దన

రెండువేల సంవత్సరాలకు ముందు చైనాలో మొదలుపెట్టిన ఈ మర్దన ఇప్పుడు తైవాన్ దేశంలో ప్రసిద్ధి చెందింది. పదునైన రెండు మచ్చు కత్తులతో ముఖంపై తడతారు. ఇలా చేయడంవల్ల శరీరంలో దాగున్న శక్తి బైటకు వస్తుంది. దీనివలన రక్తప్రవాహం మెరుగుపడుతుంది. దీనితో శరీరంలో ఉండే విషపూరిత వాయువులు బైటకు పోతాయి.

### మానసిక ఒత్తిడి పోగొట్టే మసాజ్

అలసిన శరీరానికి మర్దనతో మజా వస్తుంది. ఒళ్ళు పట్టించుకోవడం మనదేశంలో ఎప్పటి నుంచో వస్తున్న పద్ధతి. ఒళ్ళుపట్టి తలంటి, వేడి నీటి స్నానం చేస్తే శరీరం తేలికపడుతుంది. అలసట పోయి శరీరం ఆనందంలో తేలియాడు తుంది. దీన్నే బాడీమసాజ్ అంటున్నారు. ఇప్పు డిది ఒక ఖరీదైన ప్రక్రియగా పాపులర్ అయింది. ఒంటిమర్దన శారీరక అలసటనే కాదు మానసిక ఒత్తిడినీ పోగొడుతుంది. పరీక్షల ముందు భయం, ఆందోళనతో బిగుసుకుపోయే విద్యార్థులకు ఒళ్ళుపడితే పరీక్షలు బాగా రాస్తారని ప్రయోగాత్మ కంగా నిరూపితమైంది. మర్దన తర్వాత పరీక్ష హాలులో అడుగుపెట్టినవారు చురుకుగా రాసి, మంచి మార్కులు తెచ్చుకున్నారు. కాబట్టి ఏ వృత్తిలో ఉన్నవారైనా మానసిక ఒత్తిడి తగ్గించుకోవడానికి శరీర మర్దనను ఒక మార్గంగా ఎంచుకోవచ్చు.

### చక్కిలిగింతలు పెట్టి..

చక్కిలిగింత నవ్వు రావడానికి మాత్రమేకాదు, దానితో పాటు శరీరానికి కావల్సిన శక్తినీ, ఉత్సా హాన్నీ సమకూరుస్తుంది. అయితే చక్కిలిగింత కొంతమందికి నవ్వు రప్పించదు. కానీ ఇక్కడ ఈ మర్దనలో ఈకలు ఉపయోగిస్తారు. ఆ ఈకలూ ఎక్కడ తగిలినాగానీ, ఎవరైనాసరే నవ్వితీరుతారని కచ్చితంగా చెబుతున్నారు మసాజ్ సెంటర్ వాళ్ళు. ఈ మర్దనా స్పెయిన్ దేశంలో చేస్తారు.

### నాగతాళి మర్దన

నాగతాళి ఒక మొక్క పేరు. అది విషపు మొక్క. దానితో మర్దన చేస్తారు. అదేంటి విషపు మొక్కతో మర్దనా చేస్తారా? శరీరానికి ఏమైనా అయితే! అనుకుంటున్నారా? ఈ ఆకులకు ముళ్ళు ఉంటాయి. అయితే ఆ ముళ్ళు తొలగించి ముళ్ళు లేని నాగతాళి ఆకులతో మర్దన చేస్తారు. అది శరీరంలో మలినాన్ని వెలికితీసి శరీరాన్ని ఉత్తేజపరుస్తుంది. ఇప్పటికే చాలామంది ఈ మర్దన చేయించుకుం టున్నారట. ఈ మర్దన కావాలంటే స్పెయిన్ వెళ్ళా ల్సిందే!

### కొండచిలువ మర్దన

కొండచిలువా? అమ్మో! అనుకుంటున్నారా? అవును కొండచిలువలతో మర్దన చేస్తారు. ఫిలిప్పైన్స్ దేశంలో ఈ మర్దన చేస్తారు. ఈ మర్దన పూర్తిగా ఉచితం. కానీ ఆ పాముల్ని చూశాక మసాజ్ చేయించుకోవడానికి ఎవరు ఒప్పుకుంటారు చెప్పండి. కానీ ఫిలిప్పైన్స్ దేశం సెబూనగర జంతుప్రదర్శనశాలలో ఈ ఉచిత మసాజ్ ఏర్పాటు చేశారు. 250 కేజీల బరువున్న కొండ చిలువలను శరీరంపై విడిచిపెడతారు. అవి శరీ రంపై మెల్లగా కదులుతుంటే శరీరంలో ఏర్పడే మార్పులు నొప్పుల్ని, అనేక రకాల రోగాలను నయం చేస్తాయని చెబుతున్నారు.

- రాణాప్రతాప్



# బంధం

## -యస్. వివేకానంద

**అపురూప బి.టెక్ కంప్యూటర్స్ చేస్తోంది. తాను చదివింది ఉద్యోగం కోసమో, స్టేటస్ కోసమో కాదు. కేవలం విజ్ఞానం కోసం! తాను ఫైనలియర్లో ఉండగానే ఎన్నో పెద్దకంపెనీలు క్యాంపస్ సెలక్షన్‌లో చదువు పూర్తికాగానే జేరేలా, మంచిజీతంతో గొప్పజాబ్ ఆఫర్స్ చేశాయి. తాను బ్రిలియంట్! కావాలనుకుంటే జాబ్ అతిసునాయాసంగా తన కాళ్ళముందు వాల్తుంది.**

అర్జునరావు ఏకైకసంతానం అపురూప! ఒక్కగానొక్క కూతుర్ని అపురూపంగా పెంచారు. ఆమెకు పెద్దచదువు చెప్పించగల ఆర్థికస్తోమత అతనికి లేదు. మధ్యతరగతి వ్యక్తి అర్జునరావు. జీతం కటాకటిగా నెలవారీ అవసరాలకు సరిపోతుంది. అపురూపను గొప్పగా చదివించాలని మనసులో ఉన్నా ఆర్థికపరిస్థితులు సహకరించకపోవటంతో సింపుల్‌గా డిగ్రీ మాత్రమే చదివించి తాహతుకు తగిన వరుణ్ణితెచ్చి కూతుర్ని అత్తారింటికి సాగనంపాలనేది తండ్రి ఆలోచన!

పెళ్ళయ్యాక కట్టుకున్నభార్యకు చెవిదిద్దులు.. కనీసం బంగారు ముక్కుపుడకైనా చేయించలేని పరిస్థితి ఆ తండ్రిది.

కుటుంబపరిస్థితులతో రాజీపడి కేవలం డిగ్రీ పాసై అక్కడితో సరిపెట్టుకోవడం అపురూపకు మనస్కరించలేదు. ఎలాగైనా కష్టపడి చదవాలి. స్టేట్‌ఫస్ట్ సాధించాలి. మెరిట్ స్కాలర్‌షిప్‌తో బి.టెక్. కంప్యూటర్స్ పూర్తిచేయాలి. అదే పట్టుదలతో ఉంది అపురూప.

తండ్రిని ఇబ్బందిపెట్టకుండా... ఎవరికీ ఎలాంటి అసౌకర్యం కలగకుండా తన ఆశయసిద్ధికి పాటుపడాలనేదే అపురూప లక్ష్యం.

ఒకవేళ లక్ష్యం చేరుకోగలిగినా తండ్రి తనకు గొప్పసంబంధం తేగలడా? అనే ఆమెలో పెద్ద కలవరం. తన తెలివితేటలు, అందం, చదవాలనుకుంటున్న పెద్ద చదువుకు తగిన భర్తను తండ్రి తేలేకపోతే పరిస్థితులతో రాజీపడలేదు. తన మనస్సాక్షి అందుకు అంగీకరించదు. ఇక తను కోరుకున్నవిధంగా చదువు పూర్తైనతరువాత తన స్థాయికి తగిన సంబంధం, ఒకవేళ తండ్రి తేలేకపోయినా తనకెలాంటి బాధాఉండదు. అవసరమైతే జాబ్‌చేసి తనే తండ్రికి సహాయపడగలదు.

అమెరికాలో ఉద్యోగంచేసే భర్తే కావాలని కలలుగనే మనస్తత్వంకాదు అపురూపది. ఆమెదృష్టి ఎల్లవేళలా చదువు మీదే! మనిషి సింపుల్‌గా డీసెంట్‌గా ఉంటుంది!

అపురూప బి.టెక్ ఫైనల్ చదువుతూండగా, ఓ టీ.వి. ఛానల్ వారు 'మీలో ఎవరు కోటీశ్వరులు' అనే ప్రోగ్రాం నిర్వహిస్తున్నట్టు తెల్సుకుని ఇంటర్వ్యూకి వెళ్ళింది. ప్రిలిమినరీ టెస్ట్‌లో మొదటిస్థానం పొందినందుకు ఎంతో సంతోషించింది.

ఆ సెలక్షన్స్‌కి స్త్రీలు, పురుషులు, స్టూడెంట్స్, ఉద్యోగులు, హౌస్‌వైఫ్స్, టీచర్లు, సీనియర్ సిటిజెన్స్ మరెందరో హాజరవటంచూసి నివ్వెరపోయింది. అంతమందిని చూసి నిరుత్సాహపడలేదు. ఆత్మవిశ్వాసంతో ఆ పరీక్షల్లో నెగ్గింది. అపురూపకు అపారమైన జనరల్ నాలెడ్జ్ ఉంది. మనిషిలో ఆత్మవిశ్వాసం మెండు.

ఆమెలోని ఆత్మవిశ్వాసమే సెలక్షన్స్‌లో నెగ్గేలా చేసింది. ఇంటర్వ్యూలో ఆమె సమాధానాలు విని నివ్వెరపోయిన కమిటీవారు తన ఇంటికొచ్చి కుటుంబం అందరినీ కలిపి ఒక 'షార్ట్‌ఫిలిమ్' కూడా షూట్‌చేశారు. ప్యామిలీ బ్యాగ్రౌండ్, ఆర్థిక పరిస్థితి, చదువులో ఆమెకున్న పట్టుదల, కృషి



వగైరా అంశాలపై వారు ప్రశ్నలు కురిపించారు.

ప్రోగ్రామ్ ప్రారంభమైన పదిహేనురోజులకు కార్యక్రమంలో పాల్గొనవలసిందిగా అపురూపకు కాల్‌లెటర్ రావటం చూసి తల్లిదండ్రులు ఆమెకు తమ దీవెనలు అందించి సాగనంపారు.

టీ.వీవారు నిర్వహిస్తున్న ప్రోగ్రాంలో తమ కుమార్తె తప్పక ఓ పదిహేను లక్షలైనా గెల్చుకోగల దనే నమ్మకంతో ఉన్నారు కన్నవారు.

మొదటిసారి టీ.వీ కెమెరాను ఫేస్‌చేయ బోతున్న అపురూపలో ఎన్నో ప్రశ్నలు, మరెన్నోరకాల ఆలోచ నలు! తాను సక్సెస్ అందుకోవాలని కోరుతూ తన ఫైనలియర్ స్నేహితులందరూ 'ఆల్ ది బెస్ట్' చెప్పారు. తనను టీవీ ద్వారా వీక్షిస్తామన్నారు.

అవునుమరి! ఇంతవరకు అపజయమనేదే ఎరుగదుకదా! అందుకే తనపైన అంత హై ఎక్స్ పెక్టేషన్. అన్నింటా 'డిస్టింక్షన్సే'. మెరిట్ స్కాలర్ షిప్స్‌మీద తనచదువు ఇంటర్‌నుంచి బి.టెక్ వరకు కొనసాగుతూ వస్తోంది. అది తనకెంతో గర్వకారణం! ఇంటర్‌లో స్టేట్ ఫస్ట్‌ర్యాంక్! ముఖ్య మంత్రి చేతులమీదుగా లక్షరూపాయలు ప్రోత్సా హకం అందుకున్న ఘనత తనకే దక్కింది. ఆ రోజున పేరెంట్స్ పొందిన ఆనందం వర్ణనాతీతం! వారి సంతోషం కళ్ళారాచూసి మురిసిపోయింది.

తమ కుమార్తెకున్న అపారఅనుభవం ముందు ఎలాంటి వారైనా మోకరిల్లాల్సిందే. తండ్రి తనను బి.టెక్ తర్వాత ఐ.ఎ.ఎస్‌కి ప్రిపేరవమంటూ భుజం తట్టినప్పుడు అపురూప మేను పుల కించింది. మనసులో ఎంతగానో సంబరపడింది.

•••

స్టూడియోలో ప్రోగ్రాం నిర్వహించేచోట పెద్ద పెద్ద లైట్లు వెలిగాయి. కెమెరా రన్నింగ్‌లో ఉంది. కార్యక్రమం నిర్వాహకుడు ఒక ప్రముఖ సినిమా నటుడు. ఈ ప్రోగ్రామ్‌లో పాల్గొనే ఆరుగురినీ ఇన్నర్ సర్కిల్లోకి ఆహ్వానించి ఒక్కొక్కరినీ పరి చయం చేశాడు.

నిర్వాహకుడు మొదట అపురూపనే పిలవటంతో ఎక్కడలేని ఉత్సాహం పొంగిపొరలింది తనలో. ఆరుగురినీ మూడురౌండ్స్‌లో ప్రశ్నలు వేశారు. జవాబులు కరెక్ట్‌గా, వేగంగా కంప్యూటర్ ద్వారా ఇవ్వటమూ జరిగింది.

ప్రోగ్రాం కండక్ట్ చేస్తున్న సినిమాహీరో తన వద్దకొచ్చి షేక్‌హ్యాండ్ ఇచ్చి ఆరుగురిలో తానే ప్రథమంగా నిలిచినందుకు అభినందించాడు. ఆ అభినందనకు అపురూప ఎంతగానో సంతోషించింది.

ఆప్యాయత అభిమానాలు కలబోసి తనను ఆలింగనం చేసుకున్న సినీహీరో వెంటరాగా తనను ఎత్తైన రివాల్వింగ్ ఛైర్లో సాదరంగా కూర్చో బెట్టి ఆయనవెళ్ళి, తన ఎదురుగా ఉన్న ఛైర్లో ఆసీను డయ్యాడు. తన గురించి అందరికీ పరిచయం చేయడంకోసం కుటుంబసభ్యులతో కలిసి తీసిన 'షార్ట్‌ఫిలిమ్' మొదట అక్కడ ప్రదర్శించారు.

'మొదటిసారి తననుతాను తెరపై చూసు కున్న క్షణంలో అపురూపలో ఏదోతెలియని పుల కింత. మాటల్లో చెప్పనలవికాని తన్మయత్వం!

ఆ తర్వాత ప్రశ్నలు సంధించే కార్యక్రమం ప్రారంభమైంది. తెరమీద కనిపించే ప్రతి ప్రశ్నకూ సరైన జవాబులు చెబుతోంది అపురూప. ఆ సమా ధానాలు విన్న మరుక్షణం ప్రేక్షకుల గ్యాలరీలోంచి మార్మోగుతున్న చప్పట్లు అపురూ పను మరింత ఉత్తేజితురాల్ని చేస్తున్నాయి.

సమాధానం చెప్పినప్పుడు తప్పుదోవపట్టించేం దుకు ఎన్నోసార్లు ఆ హీరో చేసిన మాటలగారడీ యత్నాన్ని అధిగమించి గెలుస్తూనే ఉంది అపు రూప. అలా గేమ్ ముందుకుకొనసాగడం తన కృషికి తెలివితేటలకు తగిన ఫలితంగా భావిం చిందామె.

'ఫ్రీ'గా ఉండండి. టెన్షన్ ఫీలవ్వద్దు... అంటూ హీరోగారు పదేపదే ఇచ్చే సలహా, సూచన లకు తాను ముసిముసిగా నవ్వుకుంది. ఆ సమ యంలో అదొక థ్రిల్! మనసులో ఉత్సాహం తప్ప అసలు టెన్షన్ అనేదే ఆమెకు లేదు.

మీ వెంట పేరెంట్స్ రాలేదా? అని ప్రశ్నించినప్పుడు డాడీకి సెలవు దొరక్క పోవటంవల్ల ఆఫీసుకు వెళ్ళటం తప్పనిసరైంది. ఇక మమ్మీ ఆరోగ్యం అంతంత మాత్రమే. అంచేత నేనొక్కదాన్నే వచ్చానని చెప్పి నప్పుడు తన ధైర్యాన్ని ఆయన అభినందించ కుండా ఉండలేక పోయారు.

'వాట్ అపురూప... మీరిచ్చే సమాధానాలు చూస్తుంటే మీకు తెలి యని సబ్జెక్ట్ ఏదీ లేదని పిస్తోంది. యు ఆర్ ఎన్ ఎన్‌సైక్లో పీడియా! ఇప్పటికీ మీరు 50 లక్షల దాకా గెల్చు కున్నారు. అంటే అర్థకోటి మీ పరమైంది. ఇన్ని రోజులుగా ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పటికీ నేను ఇంతవరకూ పాతికలక్షలు దాటిన అభ్యర్థిని చూడలేదంటే నమ్మండి! మీ విషయంలో రియల్లీ వండర్! కోటికి మరోసగం దూరంలో ఉన్నారు. గెలుపువైపు మీ పరుగు ఆశ్చర్యపరుస్తోంది. మీరింత వరకూ ఒక్క హెల్ప్‌లైన్‌గానీ, ఫిఫ్టీ...ఫిఫ్టీ... ఆప్షన్



గానీ వాడుకోక పోవటం నిజంగా థ్రిల్లే! కమాన్... ఇదే స్పిరిట్‌తో మీరు తప్పక గోల్ రీచ్ అవుతా రనిపిస్తోంది..' సినిమాహీరో అభినందనల పరంపర ఆమెపై చిరుజల్లులా కురిసింది. మనసు సిగ్గుతో మొగ్గలేసినట్టనిపించింది.

'మీరు ఏఏ సబ్జెక్ట్‌కి సంబంధించిన బుక్స్ ఇంత వరకూ చదివారు మిస్ అపురూపా?'.. లిప్తపాటు విశ్రాంతినిచ్చేందుకు హీరో ప్రశ్న సంధించాడనిపించింది.

'మా ఇంట్లో ఓ గదినిండా నేను చదివిన బుక్సే ఉంటాయి! మీరు తీయించిన 'షార్ట్ ఫిలిమ్ వీడియోలో వాటిని కూడా చూపించిన విషయం మరిచారా?' నవ్వుతూ ఎదురు ప్రశ్న వేసింది.

హుందాగా నవ్విన హీరో 'మనం నెక్స్ట్ క్వశ్చన్‌కి వెళదాం! ఇది డెబ్బై అయిదు లక్షల రూపాయల ప్రశ్న. ఆలోచించి కరెక్ట్ ఆన్సర్ ఇవ్వాలి..'

స్క్రీన్‌మీదికి ప్రశ్న వచ్చేసింది. వెనువెంటనే నాలుగు ఆప్షన్స్ కూడా దర్శనమిచ్చినయ్.

ఈ ప్రశ్నకి జవాబుకోసం అపురూప మస్తిష్కం లిప్తపాటు ఆలోచించింది. ఎట్టకేలకు కరెక్ట్ ఆన్సర్ ఫలానా అని చెప్పేసింది.

చప్పట్ల మోతతో దద్దరిల్లింది విజిటర్స్ గ్యాలరీ. హీరో కంగుతినక తప్పలేదు, అపురూప కరెక్ట్ ఆన్సర్ చెప్పినందుకు. ఈసారైనా రాంగ్ ఆన్సర్ ఇచ్చి 'బై' చెప్పేస్తుందేమో అనే హీరో వ్యూహం ఉల్టా అయింది.

గ్యాలరీలో ఉన్నవారిలోనేకాదు, టీవీలో ప్రోగ్రాం తిలకిస్తున్న వీక్షకులందరిలోనూ అదే ఉత్కంఠ! దిగ్భ్రాంతి!!!

'చివరి ప్రశ్న.. ఆఖరి ప్రశ్న.. కంప్యూటర్ స్క్రీన్ మీద మరుక్షణంలో మీరు చూడబోతున్నారు అపురూపా. దీనిక్కూడా కరెక్ట్ ఆన్సర్ ఇచ్చారంటే కోటిరూపాయల విజేత మీరే! ఇంతవరకు కోటి రూపాయలు బహుమతి దక్కించుకున్న వారు లేరు. అదృష్టం మిమ్మల్ని వరించబోతోంది! అవునూ కోటి గెలిస్తే అంత డబ్బు ఏం చేసుకుంటారు?' ప్రశ్నించాడు సినీ హీరో.

'మా పేరెంట్స్‌కి ఇచ్చేస్తాను. పేరెంట్స్‌కి నచ్చిన వ్యక్తిని వివాహం చేసుకుంటాను. కన్నవారి ఆనందమే ఎల్లవేళలా నేను కోరుకునేది. నా గోల్ అదే! ఇప్పటివరకూ అన్నింటా గెలుపునాదే! ఇప్పుడు ఇక్కడ చివరిప్రశ్న వరకూ ప్రయాణించి వచ్చిన నన్ను, దురదృష్టం వెనక్కులాగేసి కింద పడేస్తుందనే భయం నాకు ఏ కోశానాలేదు' చాలా కాన్ఫిడెంట్‌గా జవాబిచ్చింది.

'అయితే గెట్ రెడీ! అదిగో ఆఖరిప్రశ్న తెరమీదికొచ్చింది. ఒకటికి పదిసార్లు జాగ్రత్తగా చదివి కరెక్ట్ ఆన్సర్ చెప్పండి! సరైన సమాధానం చెబితే, ఈ గేమ్‌లో మీరే కోటీశ్వరురాలు అపురూపా.. ఆс! బైదిబై... గెలుపునీదైతే.. చెక్కు నీకు అందచేస్తాను నేనే! కంటిన్యూయేషన్ ప్రెస్ కాన్ఫరెన్స్... అటు ఫైవ్‌స్టార్ హోటల్‌లో డిన్నర్... చివరగా ఆనందడోలికల్లో తేలియాడే నిన్ను టీవీ సంస్థ కారులో సగౌరవంగా ఇంటివద్ద డ్రాప్ చేస్తుంది. అక్కడితో కథ ముగుస్తుంది! అండర్‌స్టాండ్... నౌ లెటజ్ కంటిన్యూ ది గేమ్...' క్లుప్తంగా తర్వాత ప్రోగ్రాం వివరించాడు హీరో.

•••

తమ ఏకైక సంతానం అపురూప, టి.వీ. షోలో కోటిరూపాయలు బహుమతి గెలుచుకుంది. ఆ చెక్కుతెచ్చి తమ దోసిట్లో ఉంచి పాదాభివందనం చేసింది. ఆ దృశ్యాన్నిచూసి, అనుభవించీ ఉప్పొంగిపోయారు ఆమె తల్లిదండ్రులు. ఆనంద పారవశ్యంతో వారి తనువులు పులకరించాయి! ఏ జన్మలో చేసుకున్న పుణ్యమో ఇంతటి ప్రతిభావంతురాలు తమ కడుపున పుట్టింది, జన్మ తరించింది అనుకున్నారు.

'కోటి రూపాయలంటే.. ఎన్ని జన్మలెత్తితే ఇంత డబ్బు సంపాదించగలను తల్లీ. నీవంటి చదువుల సరస్వతి, లక్ష్మీదేవి రూపంలో మా కడుపున పుట్టటం మా అదృష్టం!' ఆప్యాయంగా తల్లీతండ్రీ చెరొకవైపు నిలబడి అపురూపంగా తలనిమిరారు.

'కష్టపడి గేమ్‌షోలో పాల్గొని గెలిచింది నువ్వు కాబట్టి, ఈ డబ్బు నీ తెలివితేటలకు నిదర్శనం కాబట్టి దీన్ని నువ్వే బ్యాంకులో వేసుకో! నీ భవిష్యత్ అవసరాలకు వినియోగించుకో తల్లీ' చెక్కు తిరిగివ్వబోయాడు తండ్రి. వద్దని వారించింది అపురూప.

'నీ వంటి యోగ్యుడైన తండ్రి కడుపున పుట్టాను కనుకే ఇంతటి అదృష్టం నన్ను వరించింది. ఇక మన జీవితాల్లో ఆర్థిక సమస్యలనేవే ఉండవు డాడీ..'




**పేదింట పుట్టింది అపురూప. అపర చదువుల సరస్వతి. సింపుల్‌గా డిగ్రీ చేయించి తాహతుకు తగ్గ సంబంధంచేసి చేతులు దులుపుకోవాలని ఆలోచిస్తున్నాడు ఆమె తండ్రి. కానీ అపురూప లక్ష్యం వేరు. ఒకసారి మీలో ఎవరు కోటీశ్వరుడు అనే షో గురించి తెలుసుకుని ఇంటర్వ్యూకు వెళ్ళింది. షోలో పాల్గొనే అర్హత సంపాదించింది. మరి ఆమె కోటి రూపాయలు గెలుచుకోగలిగిందా? ఆమె జీవితం ఎటు మలుపు తిరిగింది?**

'అవునుకదూ? నాబోటి దురదృష్టవంతుడికి కూతురువైనందుకు స్వయంకృషితో, స్వశక్తితో విద్యాధికురాలివయ్యావు! ఆ తెలివితేటలకు తార్కాణంగా కోటిరూపాయలు బహుమతి గెలుచుకున్నావు. చాలా ఆనందంగా, తృప్తిగా ఉంది. ఇక నీ భవిష్యత్తుకి ఢోకాలేదు. అంగరంగవైభవంగా నీ వివాహం జరిపిస్తాను. ముల్లోకాలూ గాలించి నీకో మంచి భర్తను తేగలననే ధైర్యం నాకొచ్చింది' అన్నాడు తండ్రి.

అపురూప చదువు ఈ ఏడాదితో పూర్తి అవుతుందాయె. వివాహం చేసేలోపు సొంతబంగళా, లేటెస్ట్ మోడల్ కారు కొనిపెడదాం, ఆ తర్వాత వచ్చే అల్లుడు మురిసిపోతాడు... ఏమంటారు?'

'డబ్బు నీ పుట్టింటి వారిదో, నా కష్టార్జితమో కాదే. అమ్మాయి తెలివితేటలతో గెలుచుకుంది. దాని కష్టార్జితం. ఒక్కపైసా కూడా తీసుకునే హక్కు మనకు లేదు. తెల్సిందా? కనుపాపలు పెద్దవి చేసి మాట్లాడాడు అర్జునరావు.

'అపురూప మనబిడ్డ. కాబట్టి ఆ డబ్బు మనది కాకపోతుందా ఏమిటీ? దీర్ఘాలు తీసింది శ్యామలమ్మ.

'నువ్ నోర్మూయ్.. దేనికదే! కూతురు కూతురే, డబ్బు డబ్బే! ఆ కోటిరూపాయల్లో ఎర్ర ఏగానికూడా మనం ఆశించకూడదు! ఆడపిల్ల ఆర్జించిన డబ్బుకు ఆశపడితే దేవుడు క్షమించడు! మనం దానికి ఎట్టాగూ ఏదీ ఇవ్వలేకపోయాం! సొంత తెలివితో సంపాదించుకున్న డబ్బు తాకటానికైనా మనకు హక్కులేదు తెలుసా?!'

'డాడీ! అంతా మనదే!'

'అది వేరే విషయం తల్లీ! నీ ఈ డబ్బుతో మంచివరుణ్ణి తేవటం, నిన్ను అత్తారింటికి సాగనంపటం మా ధర్మం. అదే మాకు సంతోషం. అంతే!!'

'ఆ విషయం తర్వాత చూద్దాంలే డాడీ..' నవ్వేసి బెడ్రూమ్‌వైపు నడిచింది అపురూప. నావంటి కుచేలుడి ఇంట పుట్టాల్సిన పిల్లకాదే! ఏ మహారాజు ఇంట్లోనో జన్మించి ఉండాల్సింది! ఇంత తెలివైన, అదృష్టవంతురాలు మనకు బిడ్డగాపుట్టడం ఏ జన్మ పుణ్యఫలమో?' భార్యతో అన్నాడు మురిసిపోతూ.

•••

ఇంజనీరింగ్ కాలేజీలో వారంరోజులపాటు వర్ణించలేనంత కోలాహలం. కోటిరూపాయల

బహుమతి విజేతను అంతా అభినందించేవారే. అంతా ఏకమై అపురూపను ఆకాశానికెత్తేశారు.

కాలేజీకి మంచిపేరు ప్రతిష్ఠలుతెచ్చినందుకు ప్రొఫెసర్లంతా అభినందించారు. 'నువ్వు స్టూడెంట్ కాదు అపురూపా, వి.వి.ఐ.పి.వి.!! - ఉయ్ ఆర్ ఆల్ ప్రౌడాఫ్ యు... అననివారు లేరు.

అందరికీ ఒకరోజు స్టార్ హోటల్లో 'ట్రీట్' ఇచ్చింది!

అపురూపకు 'ఫాన్' మెయిల్ పెరిగిపోయింది. రోజూ వందలాది ఉత్తరాలు! ఇంటర్నెట్ చాటింగ్, ఫేస్‌బుక్ పలకరింపులకు ఎందరో ప్రయత్నాలు చేయటం చూసి అపురూప నివ్వెరపోతోంది.

ఇంకా పెళ్ళికాలేదా? అని కొందరు ప్రశ్నిస్తే, పెళ్ళాడతావా అని మరికొందరు... ఎందరివో పలకరింపులు! ఎన్నో రకాల ఆశలు చూపిస్తూ ఉక్కిరిబిక్కిరి చేయటం చిత్రంగా అనిపించింది.

మహిళాసంఘాలు సరేసరి! అభినందనలు, పొగడ్తలతో ఊపిరాడనీకుండా చేస్తున్నారు.

డబ్బుకి ఎంతటి మహత్తు ఉందో...! తెలివితేటలకు ఎంత పవరుందో...! అదెంత కీర్తిప్రతిష్ఠలు ఆర్జించి పెడుతుందో అర్ధమౌతోంది అపురూపకి!

కేవలం ధనవంతులేకాదు, మధ్యతరగతి పెద్దలనుండి మ్యారేజ్ ఆఫర్స్ రావటంతో నివ్వెరపోతోంది.

ఇదంతా తాత్కాలికమే! ముందు చదువు పూర్తిచేసి డిగ్రీ సంపాదించుకోవాలి! అదే తన గోల్! అప్పుడే తనకు సంపూర్ణమైన సంతృప్తి! అంత వరకూ ఇతర విషయాలు పట్టించుకోకూడదనే నిర్ణయానికొచ్చింది అపురూప.

●●●

ఎన్నో పెళ్ళిసంబంధాలు కాదని చివరికి తండ్రి తెచ్చిన మిడిల్‌క్లాస్ ఫామిలీ యువకుడితో పెళ్ళికి తలూపింది. బి.టెక్ పూర్తి కావటంతో మ్యారేజ్‌కి గ్రీన్‌సిగ్నలిచ్చేసింది!

నవీన్ పి.జి. చేశాడట! సివిల్స్‌కి ప్రిపేర్ అవుతున్నాడట! నేడో రేపో సెలక్షన్ అవగానే ట్రైనింగ్, ఆ తర్వాత జాయింట్ కలెక్టర్‌గా పోస్టింగ్ వచ్చేస్తుందట...

నవీన్ అందగాడు కాకున్నా బాగుంటాడనిపించింది. అతడికి తండ్రి లేడు. తల్లి కష్టపడి ఒక్కగానొక్క కొడుకుని ఇళ్ళల్లో వంటలు చేస్తూ చదివించింది. కొడుకు సినిమా హీరోలా ఉంటాడని తెగ పొగుడుకుంటుంది. మంచి ఒడ్డూ పొడుగూ! బంగారు మేనిఛాయ.

పైసాకట్నం తీసుకోకుండా అపురూపను వివాహం చేసుకోవటానికి ముందుకొచ్చాడు.

హంగు ఆర్భాటాలు లేకుండా పెళ్ళి సింపుల్‌గా జరిగింది. అంతా కలిసి ఇరువైపులా ఓ వందమంది విచ్చేశారు వివాహానికి. కలకాలం సుఖసంతోషాలతో వర్ధిల్లాలని ఆశీర్వదించారు.

పెళ్ళైన పదిరోజులకే ఇంటర్వ్యూలో సెలక్ట్ కాలేదనే ఇంటిమేషన్ రావడంతో నవీన్ ఎంతగానో నిరుత్సాహ పడ్డాడు. ఈ విషయం అమ్మకు, అపురూపకి చెప్పాలా.... వద్దా అని సీరియస్‌గా ఆలోచించి మౌనం వహించాడు నవీన్. కాన్ఫిడెంట్‌గా ఉన్న తనకు ఎదురుదెబ్బ తగలటంతో కంగుతిన్నాడు.

సెకండ్‌టైమ్ ప్రిపరేషన్‌కి ఇష్టపడలేదు. కలెక్టర్ పరీక్ష ఏమైందిరా అని ఒకరోజు నవీన్ తల్లి అడగనే అడిగింది.

అబద్ధం చెప్పలేకపోయాడు. ఇంటర్వ్యూలో సెలెక్ట్ కాలేదనే వాస్తవం ఒప్పుకోక తప్పలేదు. నీ పెళ్ళానికీ సంగతి తెలుసా అని ప్రశ్నించినప్పుడు నవీన్ లేదన్నట్టు తల అడ్డంగా ఊపాడు. అనుక్షణం బ్రతిమిలాడే తల్లిమాట కాదనలేక ఈలోపు మంచి జాబ్‌కోసం ప్రయత్నించటానికే నిర్ణయించుకున్నాడు!

ఎన్నిప్రయత్నాలు చేసినా ప్రయోజనం లేకుండా పోతున్నందుకు నవీన్ వర్రీ అవుతున్నాడు. అది గమనించింది అపురూప. భర్తను నిలదీసింది. దాంతో భార్యకి దొరికిపోయాడు. పరిస్థితిని వివరించటం తప్పనిసరైంది.

భర్త భవిష్యత్ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంది అపురూప. తీరా చూస్తే నిరాశే ఎదురైంది. మ్యారేజ్ విషయంలో సరైన నిర్ణయం తీసుకో

## మనమీదేనర్రోయ్!

సరసి





లేదా? అని తనను తాను పదే పదే ప్రశ్నించుకో సాగింది అపురూప.

సంసారం సజావుగా సాగేందుకు అపురూపను ఉద్యోగం చేయమని బలవంతం చేయడం ప్రారంభించాడు నవీన్.

'జాబ్ చెయ్యనుగాక చెయ్యను! ఉద్యోగం కోసం కాదు నేను చదివింది! భార్య సంపాదన మీద ఆధారపడి భర్త బ్రతుకు గడపటం అసహ్యంగా ఉంటుంది. అందరూ ఆక్షేపిస్తారు!' నిక్కచ్చిగా బదులిచ్చింది అపురూప.

'ప్రస్తుతం నాటైమ్ బాగున్నట్టులేదు. రిటెన్ టెస్ట్‌లో పాసవుతున్నా... ఇంటర్వ్యూలో తంతోంది. కారణం అర్థం కావటం లేదు డియర్. నన్ను అపార్థం చేసుకోకు! నా మాటవిని నీకు లోగడ క్యాంపస్ సెలక్షన్స్‌లో ఆఫర్స్‌వచ్చిన ఒక దానిలో చేరిపో. నువ్వు ఎల్లకాలం జాబ్ చేయాల్సిన పన్లేదు, కొద్దిరోజులే, అదీ నాకు మంచి ఉద్యోగం వచ్చే వరకే..' నచ్చచెప్పబోయాడు.

'నో! ఐ డోంట్ లైక్ యువర్ యాటిట్యూడ్'.

'డోన్ట్‌బీసిల్లీ డార్లింగ్! పరిస్థితులు అర్థం చేసుకోవటానికి ప్రయత్నించు. మొండిగా వ్యవహ రించకు'

'నువ్వెన్నిసార్లు... ఎన్నివిధాలుగా అడిగినా నా జవాబు ఒక్కటే! జాబ్‌చేయనుగాక చేయను. దట్సాల్..' నిక్కచ్చిగా చెప్పసాగింది అపురూప.

'ఇప్పటికే మా అమ్మ నాకోసం ఎంతో కష్టపడింది. ఇంకా ఆమెను బాధపెట్టడంలో అర్థంలేదు. నా మాట విను. ప్లీజ్.. నా కోసం.. నోనో కాదు కాదు.. మనకోసం నువ్వేదైనా మంచి జాబ్ చెయ్యక తప్పదు'.

"ఏంటీ! కంపల్షనా? నేనసలు పొరపాటు చేశానేమో అని ఇప్పుడన్పిస్తోంది. లక్షణంగా ఉద్యోగం చేసే వ్యక్తిని మ్యారేజ్ చేసుకుని ఉండివుంటే నాకీ ప్రాబ్లమ్ ఉత్పన్నమయ్యేదే కాదు...'

'నువ్వు అనవసరంగా చాలాదూరం ఆలోచిస్తున్నావ్.. అపురూపా! పోనీ ఓపని చెయ్. నువ్ గేమ్‌షోలో గెల్చుకున్న కోటిరూపాయలున్నాయ్ కదా. ఆ డబ్బు నీదైనా నాదైనా ఒక్కటే! ఆ డబ్బు నీవద్ద ఉండి ఉంటే ఓ యాభై లక్షలు నాకివ్వు, ఏదైనా మనసుకి నచ్చిన బిజినెస్ చేస్తాను. ఎలా ఉంది నా ఆలోచన!'

'నువ్వీమాట ఏదో ఒకరోజు అని తీరుతావని ఊహించాను. ఏం వ్యాపారం చేస్తావ్? టీ దుకాణం పెడతావా? కిళ్ళీబడ్డీ నడుపుతావా? లేక పది ఫైర్‌టాక్సీలు కొని 'రెంట్ ఎ కార్ బోర్డ్ పెడతావా?' అపురూప మాటతీరుతో నవీన్ అహం దెబ్బతిన్నది.

'డోన్టాక్ రాట్! చదువుకున్నదానివి. తెలివైనదానివి. భర్తతో మాట్లాడే తీరు ఇదేనా?' నవీన్ సీరియస్సై చేయెత్తి కొట్టబోయాడు.

'భార్యమీద చేయిచేసుకోవటానికి సిగ్గన్పించటం లేదూ? నేను నీ సర్వెంట్‌ని కాను. సహధర్మచారిణిని మాత్రమే! తాళికట్టిన భార్యను ఎలాగూ పోషించేస్థితిలో లేవు. అంటే రోషం పొడుచుకొచ్చిందా? నువ్విలాంటి వ్యక్తిత్వం కలవాడివనుకోలేదు. నా ఫైనల్ డెసిషన్ విను! నీకు ఉద్యోగం లేనంతకాలం నేన్నీతో ఉండలేను. నేన్నీకు భార్యనీ కాను! నీలాంటి మెంటాలిటీ ఉన్న మగాడికి ఉద్యోగమూ రాదు. చేయగల అర్హతా ఉండదు. నాకు ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది. నీ బుర్రలో ఆలోచనంతా నే గెల్చుకున్న కోటిరూపాయల మీదే లగ్నమైందని! నా సొంత తెలివితేటల్తో గెల్చుకున్న ఆ సొమ్ములో నీకు పైసా ఇవ్వను. నేను పుట్టింటికెడుతున్నాను. నన్ను కలవాలనుకుంటే... అదీ నీకేదైనా జాబ్ వచ్చాకనే..' వెళ్ళబోయింది.

'నిన్నంత ఈజీగా పోనిస్తానా? నిన్ను నాలుగు పీకి ఆ డబ్బు నాపేర రాయించుకునిగాని వదలను! తెల్సుకో.. త్వరగా! నేను కావాలో... నీకు డబ్బే అవసరమో..'

పరిస్థితి విషమించిందని గ్రహించింది అపురూప! తాను పిరికిపందకాదు. నవీన్‌కి ఎదురు తిరిగి గెలవటం ఎంతైనా అవసరం. ఇతనొక చీడ పురుగు. డబ్బే ముఖ్యం. ఉద్యోగం సంపాదించటంలో సిన్సియారిటీ, శ్రద్ధలేదని తేలిపోయింది.

తాను సేకరించిన సమాచారం బట్టి ఇతను అసలు గ్రాడ్యుయేట్ కూడా కాదు. ఇంటర్ ఫెయిల్! అబద్ధాలు సృష్టించి నమ్మించాడు. వంత పాడింది అమాయకపుతల్లి! ఎందుకైనా అవసరపడుతుందని తన ఫ్రెండ్ అనిత ఫాదర్ ఐ.జి. ఆఫ్ పోలీస్ కావటం మూలాన నవీన్ వివరాలన్నీ సేకరించి గోప్యంగా ఉంచింది.

ఇప్పుడంతా తాను ఊహించినట్టే జరిగింది. చివరికి బెదిరించి లొంగ తీసుకునే ప్రయత్నానికి పూనుకున్నాడు నవీన్! ఇతన్ని వదిలిపెట్ట కూడదు. మోసంతో భర్త స్థానంలో నిలిచి, ఇప్పుడు బెదిరింపు స్థాయికి చేరుకున్నాడు.

'నీ డబ్బు నా పేర ట్రాన్స్‌ఫర్ చెయ్యి, లేకపోతే ఊరుకునేది లేదు.."

'ఏం చేస్తావ్? తాళి తెంపుతావా? చంపుతావా? పోలీస్ రికార్డుల్లో కెక్కిన నీ ఘనత నాకు తెలీదనుకున్నావా స్కౌండ్రల్! - ఐ డోన్ట్ లీవ్‌యూ' అంటూండగానే పోలీసులు ఎస్సై, ఇద్దరు కానిస్టేబుల్స్ ఎంటరై నవీన్‌చేతికి బేడీలు వేసి లాక్కెళ్ళి జీపు ఎక్కించాడు.

నవీన్ తల్లి లబోదిబోమంటూ గుండెలు బాదుకుంది. అపురూప నవీన్‌పై పళ్లనూరి 'నీ కొడుకు నా భర్త కాదు, నువ్వు అత్తవీకావు. నేటితో మన మధ్య బంధం, బాంధవ్యం శాశ్వతంగా తెగిపోయింది. మనం ఇకపై ఏమీకాము! అర్థమైందా!' ఆవేశంగా మాట్లాడి తాళితీసి అత్త ముఖాన కొట్టింది అపురూప. రివ్వున వీధిలోకినడిచి తల్లి దండ్రుల దగ్గరకు వెళ్ళేందుకు ఆటో ఎక్కింది!!

సెల్:99592 13789

# స్నేహమంటే ఇదే!

*గత సంవత్సరం ఒక్క సినిమా కూడా చేయని రవి తేజ ఇప్పుడు ఒకేసారి రెండు సినిమాలు అనౌన్స్ చేసేశాడు. ఇదేం పెద్ద వార్త కాదు కదా! కాకపోతే ఇక్కడో ట్విస్ట్ ఉంది. ఈ రెండు సినిమాల్లో ఒక సినిమాలో రాశీ హీరోయిన్. గతంలోనే దిల్‌రాజు సినిమాలో రాశీఖన్నా హీరోయిన్‌గా ఫిక్స్ అయ్యాడట రవితేజ! ఆ తరువాత రకరకాల కారణాల వలన ఆ సినిమా వాయిదా పడుతూ వచ్చింది. మధ్యలో దర్శకులు మారారు కానీ రాశిఖన్నా పేరు మాత్రం అట్లానే నిలిచిపోయింది. దీనికి ఒక కారణం కూడా ఉంది. గతంలో రవితేజతో రాశి 'బెంగాల్ టైగర్' సినిమా చేసింది. ఆ సమయంలో వీరిద్దరూ బెస్ట్ ఫ్రెండ్స్ అయ్యారు. ఆ ఫ్రెండ్‌షిప్ కారణంగానే రవితేజ, దర్శకులు మారినా హీరోయిన్‌ని మార్చకుండా ఉంచేశాడట! ఇకపోతే రవితేజ రెండవ సినిమాలో కూడా రాశి హీరోయిన్‌గా చేసే అవకాశం ఉందట! మొత్తానికి స్నేహమంటే ఇలా ఉండాలని ఇద్దరూ నిరూపించారు అంటున్నారు టాలీవుడ్ జనం.*

# 30 వేల ఏళ్ళనాటి బంధం!

మనిషికీ కుక్కకూ ఉన్న అనుబంధం పద్నాలుగు వేలఏళ్ళ నాటిదని అనుకుంటూ వచ్చారు ఇన్నాళ్ళుగా. కానీ ఈ బంధం 30 వేల ఏళ్ళనాటిదని ఇటీవలే శాస్త్ర వేత్తలు పరిశోధనల్లో నిర్ధారించారు. కుక్క అని తేలిగ్గా తీసిపారేయడం కాదుగానీ, మనిషికీ కుక్కకూ మధ్య అనుబంధం, కుక్కకున్న తెలివితేటలు, దానికేమైనా అతీంద్రియ శక్తులున్నాయా? వంటి అనేకాంశాల గురించి ఎన్నో అధ్యయనాలు, పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. మనిషికి కుక్క ఎప్పుడు మాలిమైంది? అనే అంశంపై ఎన్నాళ్ళు గానో జరుగుతున్న శాస్త్రవేత్తల అధ్యయనాలు ఇప్పుడొక కొలిక్కివచ్చాయి.

కుక్కలంటే ఒకప్పుడు తోడేళ్ళే అని, మంచు యుగం (Pleistocene) లో అంటే వ్యవసాయరంగ ఆరంభానికి ముందే వాటిని మొదట మనిషి మచ్చిక చేసుకున్నాడనీ ఆస్ట్రేలియన్ జంతుశాస్త్రజ్ఞుడు Konrad Lorenz ఒకప్పుడు చెప్పిన విషయాన్ని అందరూ అంగీకరించారు. అయితే 30 వేల ఏళ్ళకాలం



నాటి కుక్క పుర్రెలు ఫ్రాన్స్‌లో లభ్యమయ్యాయి. వాటిని పరిశీలించినప్పుడు అవి పూర్తిగా తోడేళ్ళు కాదనీ, రూపాంతరం చెందిన కుక్కలేననీ గుర్తించారు.

శాస్త్రజ్ఞులను గందరగోళపరిచిన ఈ పురావస్తు ఆధారాలు అత్యంత శాస్త్రీయమైనవని డీఎన్‌ఏ ద్వారా బహిర్గతమైంది. ప్రపంచవ్యాప్తంగా ఉన్న వీధికుక్కల నుండి శాస్త్రవేత్తలు 10 వేల రక్త నమూనాలు సేకరించి తోడేళ్ళ రక్తంతో పోల్చిచూశారు. అలస్కాలోని జీరో డిగ్రీ నీటి ఉష్ణోగ్రతలో రాతిప్రాంత అడుగు పొరల్లో ఉన్న ఏషియన్ తోడేళ్ళ అవశేషాల నమూనాలతో పోల్చిచూసి నాడున్నవి డాగ్సేనని నిర్ధారణకు వచ్చారు. ఈ పరిశోధనల్లో భాగంగా శాస్త్రవేత్తలు మౌలికంగా కుక్కల మూలస్థానాన్ని తూర్పుఆసియాగా గుర్తించారు. అయితే తూర్పు ఆసియాలో మొట్టమొదట ఎందుకు కుక్కలను మనిషి చేరదీశాడనే విషయంపై పరిశోధన చేశారు. ఇటీవలి సిద్ధాంతం ప్రకారం కుక్కలే వాటంతటవిగా మనిషికి మాలిమి అయ్యాయి! వీధికుక్కలు ఒకప్పుడు మానవమలాన్ని భుజించి పరిసరాలు పరిశుభ్రం చేసే స్కావెంజర్స్‌గా మాత్రమే ఉండేవి. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా 75 కోట్ల వీధికుక్కలున్నాయని అంచనా!

నవ్య




| | | | | |
|---|---|---|---|---|
| **శంకరాలు** | **కనకదుర్గ శతకము** | **ఇంగ్లీషుకు తల్లి తెలుగు** | **కవులున్నారు జాగ్రత్త** | **సరస్వతీ పుత్రులు** |
| హాస్యబ్రహ్మ శంకరనారాయణ | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | హాస్యబ్రహ్మ శంకరనారాయణ | హాస్యబ్రహ్మ శంకరనారాయణ |
| పేజీలు: 108, | పేజీలు: 32, | పేజీలు: 186, | పేజీలు: 90, | పేజీలు: 122, |
| వెల: 36/- | వెల: 18/- | వెల: 144/- | వెల: 36/- | వెల: 63/- |

ప్రచురణ: శ్రీ రాఘవేంద్ర పబ్లిషర్స్
ప్రతులకు ఎస్.ఆర్.బుక్‌లింక్స్, దానయ్యవీధి, మాచవరం, విజయవాడ-4
ఫోన్ 8142444988 మరియు తెలుగు రాష్ట్రాల్లోని అన్ని బుక్ షాపులు.

## హాస్యబ్రహ్మ 'పంచ్' పుస్తకాలు




హాస్యం అంటే ఇష్టపడనివారెవరు! అందులోనూ చతురోక్తులు, పంచ్‌లు అంటే మరీ చెవికోసుకుంటారు తెలుగువారు. తెల్లారిలేస్తే మనం పంచెలు కట్టుకోపోయినాగానీ, పంచ్‌లు వేయడం మాత్రం మరిచిపోవడంలేదు. అందుకే పసందైన, మనదైన తెలుగు హాస్యాన్ని 'పంచ పుస్తకాలు'గా పాఠకులకు అందించారు హాస్య బ్రహ్మగా ప్రఖ్యాతి వహించిన శంకరనారాయణ.

అంతర్జాతీయ కళాకారుడు, తన హాస్యావధానంతో రెండుసార్లు లిమ్కాబుక్ రికార్డ్స్‌లో స్థానం పొందిన ప్రముఖ పాత్రికేయుడీయన. మూడున్నర దశాబ్దాలుగా వివిధ తెలుగు పత్రికల్లో వివిధ సంపాదక హోదాల్లో పనిచేశారు. దేశవిదేశాల్లో 381 హాస్యావధానాలు చేశారు, చేస్తున్నారు. బుల్లితెర వీక్షకులకూ ఆయన పరిచితులే. ఎన్నో పుస్తకాలు రాశారు. ఆయన వెలువరించిన ఐదు తాజా పుస్తకాలే ఇవన్నీ.

పదవిన్యాసాలతో సునిశిత హాస్యం కురిపించే పుస్తకం 'శంకరాలు'.

'చదువుకు సిలబస్, రాజకీయాలకు కులబస్'., 'పెళ్ళి 'వెడ్డూ'రం'., 'వింటే భారతం వినాలి, తింటే ఎదుటివాడి సొమ్ము తినాలి'., 'సినీ దర్శకుడికి అన్నీ 'కట్' దిట్టాలే'., దుర్మార్గుడు తల్చుకుంటే 'గన్' డమే., 'మగాళ్ళు రెండు రకాలు, పుట్టుకతో నోరులేనివాళ్ళు, పెళ్ళయి నోరు లేనివాళ్ళు'.....ఇలా సాగిపోతూ హాస్య రసం కురిపిస్తాయి ఆయన శంకరాలు.

'కరుణ జూపుమమ్మ కనకదుర్గ' అనే మకుటంతో సమకాలీన సమాజంపై 108 శ్లోకాలు రాశారు 'కనకదుర్గ శతకం'లో. మచ్చుకు, ఫేసు లుక్కుచూడకున్న ఫేసుబుక్కులు చాలు/ప్రేమ స్పీడుగాను పెరిగిపోవు/ఫేసు చూడగానె విడిపోదు రెందుకో /కరుణ జూపు మమ్మ కనకదుర్గ అంటూ హాస్యస్ఫోరకమైన చురకలు వేస్తారు.

ఇప్పుడు తెలుగు రాష్ట్రాలు 'ఆంగ్ల' రాష్ట్రాలుగా మారిపోయాయి. నిజమే, వివిధ జీవన రంగాలలో తెలుగు వైభవం ఎలా అడుగంటిందో 'ఇంగ్లీషుకు తల్లి తెలుగు' పుస్తకం 32 శీర్షికల్లో హాస్యభరితంగా వివరించారు. పాతికమంది ప్రముఖ కవుల జీవితాలలో తొంగిచూసిన చతురత, చమక్కుల పుస్తకం 'కవులున్నారు జాగ్రత్త' . అదేవిధంగా ఈ తరానికి తెలియని యాభైమంది తెలుగు ప్రముఖుల హస్యతునకలు, వారి కబుర్లనూ వదలకుండా చదివిస్తుంది 'సరస్వతీ పుత్రులు.'

తెలుగుభాష, తెలుగు ప్రముఖుల హాస్య వైశిష్ట్యాల్ని అవగాహనకు తెచ్చే రచనలే ఇవన్నీ.

## స్వీకారాలు

**Adventures of TINKU**
**Geetha**
**Price:** 60 Rupees
**Pages:** 88

**For copies:** Navodaya Book House, Kachiguda X Road, Hyderabad-27 Cell 9247471361

-లలితా త్రిపుర సుందరి



10

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

-కంఠంనేని స్వప్న



**అక్షయ్ చేయి ప్యాకెట్‌ని ముట్టుకోబోతుండగా జరిగిందా సంఘటన.**

**అతని మోచేతిని ఒక చేత్తో పట్టుకుని, రెండో చేత్తో అతన్ని ఒడుపుగా ఎత్తి నేలమీదకి విసిరేశారెవరో!**

**తేరుకుని లేచి చూసేసరికి తల నిండా హెన్నాతో పక్కింటావిడ.**

**ఆమెచేతిలో ఆ ప్యాకెట్.**

**చాలా ఆప్యాయంగా ఆ కవర్‌ని పట్టుకుని ఉందామె. ప్రేమగా తడిమి చూస్తోంది దాన్ని.**

కవర్ వెనకవైపుకి తిప్పి ఉండడంతో 'అమెజాన్' అనే అక్షరాలు స్పష్టంగా కనబడుతున్నాయి. బిడ్డని సంరక్షించుకునే ఆడబెబ్బులిలాగా ఉందామె రూపం.

అప్పుడే ఆమె భర్త ఆఫీస్‌కి వెళ్ళటానికి బైటికొచ్చాడు.

ఆమె చేతిలో ఉన్న ప్యాకెట్ చూసి, తల చేత్తో పట్టుకుని అన్నాడు.

"ఆన్‌లైన్‌లో ఏం ఆర్డర్ చేశావు మళ్లీ? ఇదివరకు ఆడవాళ్లు, భర్తలు ఆఫీస్‌కి వెళ్ళగానే మార్నింగ్‌షోలకి వెళ్తారనేవారు. అవే నయం. ఇప్పుడు ఆన్‌లైన్ షాపింగులతో చస్తున్నాం. డబ్బుకి డబ్బూ వదులుతోంది. ఇల్లంతా చెత్తతో నిండుతోంది.

ధుమధుమలాడుతూ వెళ్ళిపోయాడతను.

మొహమాటంగా నవ్వి అక్షయ్‌తో అందామె.

"సారీ! మాకు రావల్సిన ప్యాకెట్ మీకు పొరబాటున డెలివర్ చేశామని, ఇప్పుడే అమెజాన్ వాడు ఫోన్ చేశాడు. వెంటనే మీకు ఫోన్‌చేశాను. కానీ ఎత్తలేదు. దెబ్బేమైనా తగిలిందా?"

బిత్తరపోయి చూస్తున్న అక్షయ్ లేదన్నట్లు అయోమయంగా తలూపి, ఇంటి లోపలికి వచ్చాడు.

నైరా ఆచూకీ తనకి ఎప్పటికి తెలుస్తుంది?

తల్లిదండ్రులు, అక్కాబావలు పోయారని తెలిసినప్పుడు కూడా ఇంత వేదనకి గురికాలేదు. కాసేపు క్షేమంగా ఉండి ఉంటుందేమోననే ఆశ, మరికాసేపు భయంకరమైన నిరాశతో కొట్టుమిట్టాడుతున్నాడు.

చిత్రహింసకు గురై లేదా పక్షవాతంతో తీసుకుని చావడానికీ, ఒకేసారి గుండెపోటుతో చనిపోవడానికీ ఉన్నంతతేడా ఒకమనిషి ఆచూకీ తెలీక పోవటానికీ, చనిపోయారని తెలియటానికీ.

•••

ఆ రోజు న్యూస్ వెతుకుతున్నాడు అక్షయ్. తనవైపు నుంచి నిరంతరం పరిశోధన చేస్తూనే ఉన్నాడతను.

ప్రముఖ ఇంగ్లీష్ పత్రికలో ఒక మూలగా

## జరిగిన కథ

**అదో మల్టీ నేషనల్ కంపెనీ!** రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. ఆఫీసులో కొత్తగా చేరిన నీమ, అక్షయ్ స్నేహితురాలని తెలిసి ఉడికి పోయింది కావ్య. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సి డెంట్‌లో చనిపోతారు. ఇక తనకు మిగిలిన ఒకే ఒక బంధం నైరాని ఎటువంటి లోటు రానీకుండా పెంచా లనుకుంటాడు అక్షయ్. అకస్మాత్తుగా నైరా కని పించకుండా పోతుంది. పోలీస్ కంప్లయింట్ ఇస్తాడు అక్షయ్. ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన వెబ్‌సైట్ లింక్ ద్వారా ఆన్‌లైన్‌లో రన్ అవుతున్న ప్రాస్టిట్యూట్ రింగ్‌వారిని కాంటాక్ట్ చేస్తాడు. తరువాత ఓ టీవీ ఛానల్ ఎడిటర్‌ని కలిసి స్టింగ్ ఆపరేషన్‌కి ఒప్పిస్తాడు. అది లైవ్ టెలీకాస్ట్ అవుతుంది. వాళ్ళను అరెస్టు చేస్తారు. కానీ నైరా జాడ మాత్రం దొరకదు.

ఆ తర్వాత...

పడ్డ నాలుగులైన్ల వార్త అతడిని ఆకర్షించింది.

నిజామాబాద్ జిల్లాలో మాక్లూర్ మండ లంలో ఉన్న కుగ్రామంలో క్షుద్రపూజలు జరుపు తున్న వృద్ధుడు, తమ బిడ్డని బలిచ్చాడనే అనుమానంతో అతడి పళ్ళు రాలగొట్టి, గ్రామస్థులతో కలిసి, అతడిని చిత్ర హింసలు పెట్టి చంపేశారట అతని పక్కింటి వాళ్లు.

'చిన్నపిల్లల్ని బలి ఇవ్వటమా?' ఒళ్లు గగు ర్పొడిచిందతనికి.

'ఆ ఊరు వెళితే, పసిపిల్లల్ని బలిచ్చే వారి గురించి ఏమైనా వివరాలు తెలుస్తాయేమో?'

మొదటిసారి అతనికి దగ్గర బంధువులు అనేవాళ్లు లేకపోవటం లోని లోటు తెలిసింది. ఒకవేళ నైరా తిరిగొస్తే? ఇంటికి తాళంవేసి వెళ్లడానికి మనసొప్ప లేదు అతనికి. ఎప్పటిలాగే నేనున్నానంటూ ముందు కొచ్చాడు హర్ష.

ఇల్లు హర్షకి అప్పచెప్పి, రెండు రోజులకు అవసర మయ్యే బట్టలు, కొంత డబ్బు తీసుకుని బయలు దేరాడు అక్షయ్.

తెల్లటి స్కోడా రాపిడ్ నిజామాబాద్ పొలిమేర ల్లోకి చేరేసరికి దుమ్ముకొట్టుకుపోయింది. గూగుల్ వాయిస్ మాప్స్, ఫోన్‌ద్వారా అతనికి డైరెక్షన్స్ ఇస్తోంది. వాటిని ఫాలో అవుతూ వెళ్లటంతో అత నికి ఊరు వెతుక్కోవటం పెద్ద కష్టమేమీ కాలేదు.

'ముల్లంగి' చిన్నబోర్డు వంగిపోయి కనబడు తోంది.

బోర్డ్ నేలకి ఒరిగిపోవటంతో ముందుకు దిశ చూపించాల్సిన బాణం గుర్తు నేలలోకి వెళ్ళమన్న ట్లుగా సూచిస్తోంది.

ఇసుకరోడ్ గతుకులతో నిండి కనబడుతోంది.

సన్నటి రోడ్.

ఒకప్పుడు చిన్నకాలువ, బ్రిడ్జి ఉండేవనటానికి గుర్తుగా రోడ్‌కి రెండు వైపులా రాళ్లగట్లు కన బడుతున్నాయి. అతిజాగ్రత్తగా కార్‌ని ఆ గట్ల మధ్య పోనిచ్చాడు.

ఊరంతా బీడు పడిపోయినట్లుంది.

అక్కడక్కడ, దూరదూరంగా చెట్లు కనబడు తున్నాయి.

'ప్రాథమిక పాఠశాల' బోర్డ్ కనబడింది.

కారు ఆపి దిగాడు.

అదొక శిథిల భవనం.

పాడుబడి బూజుతో నిండి కనబడుతోంది.

అప్పుడప్పుడే చీకటి పడుతోంది.

పాఠశాల వరండాలో నివాసం ఏర్పరుచుకున్న గబ్బి లాలు అప్పుడే నిద్రలేచి రెక్కలు టపటపలాడిస్తున్నాయి, బద్ధకంగా.

ఆ బడిని చూస్తేనే ఆ ఊర్లో చదువు ఎంతగొప్పగా సాగుతోందో అర్థమైందతనికి.

కారు అక్కడే ఉంచేసి ఊళ్లోకి నడి చాడు.

చిన్నచిన్న పూరిళ్లు అక్క డక్కడా కనబడు తున్నాయి.

తడికలతో చేసిన బాత్‌రూమ్‌లు ప్రతి ఇంటికీ ఒక పక్కగా ఉన్నాయి. ఇళ్ల ముందు పూలు, కూర గాయల చెట్లు.

కొన్ని ఇళ్ల ముందు లైట్లున్నాయి.

మిగతా ఇళ్లల్లో చీకటి తాండవిస్తోంది.

ఇళ్ల ముందు అక్కడక్కడ మనుషులు కనిపి స్తున్నారు.

అక్షయ్‌ని ఆసక్తిగా, వింతగా చూస్తున్నారు.

ఒక ఇంటిముందు అరుగుమీద చుట్ట కాల్చు కుంటున్నతను కనబడ్డాడు. నీరు కావి బట్టలు వేసు కుని ఉన్నాడతడు. పగిలిపోయి కనబడుతోన్న దళసరి కళ్లద్దాలు, ఎండిపోయి, ముడతలు పడి, నరాలు పైకితేలి కనబడుతున్న చేతిలో బీడీని తృప్తిగా తాగుతున్నాడు. ఇదే ఆఖరు బీడీ అన్నంత



ఆబగా ఉందతని మొహం.

ఆగి అడిగాడు అక్షయ్.

"ఇక్కడ రాములు అనే అతని ఇల్లుండాలి. దారి చెప్తారా?"

కాల్చుతున్న బీడీ ఆర్పేసి లోపలికి వెళ్లిపోయాడతను.

వింతగా చూసి ముందుకు నడిచాడు అక్షయ్.

ఇంకో చోట కూడా అతనికి అదే రియాక్షన్ ఎదురైంది.

ఏం చేయాలో పాలుపోక ఆలోచిస్తూ ముందుకు నడుస్తున్నాడు.

వెనక నుంచి ఎవరో పిలిచినట్లనిపించింది.

తిరిగి చూశాడు.

సైకిల్ తొక్కుతూ వస్తున్నాడొకతను.

ఇరవయ్యేళ్లు ఉండవచ్చు. కానీ లేమివల్ల, ఎండకి ఎండి, వానకి తడిచి మరో ఇరవయ్యేళ్లు పెద్దవాడిలాగా కనిపిస్తున్నాడు.

'సైకిలెక్కు' అన్నాడు.

మాట్లాడకుండా వెనకెక్కి కూర్చున్నాడు అక్షయ్.

ఆరడుగుల తన విగ్రహాన్ని ఆ సైకిల్ మోయగలదా అనే సందేహం లోలోపల పీకుతోందతన్ని.

అవలీలగా సైకిల్ తొక్కుతూ ఒక పూరిపాక ముందు ఆపాడతను.

ఇంటిముందు గుడ్డి దీపం వెలుగుతోంది.

లోపలకు నడిచాడు.

అక్షయ్ అతన్ని అనుసరించాడు.

భుజం మీద వేసుకున్న టవల్‌తో అరుగుని దులిపాడతను. అక్షయ్‌ని కూర్చోమని సైగ చేశాడు.

అక్షయ్ కూర్చున్నాక అడిగాడతను.

"రాములు మా నాన్నే! ఏం కావాలి?"

అతని గురించి పేపర్లో చదివాను. పిల్లవాడిని బలిచ్చాడనే అనుమానంతో గ్రామస్థులంతా కలిసి చంపేశారని".

"అనుమానం కాదు, నిజంగానే బలిచ్చాడు" భావరహితంగా అన్నాడతను.

"అతీతశక్తులు లభిస్తాయనీ, నిధులు దొరుకుతాయనీ ఎవరో తాంత్రికుడు చెప్తే నమ్మి, ఒకసారి నా తమ్ముడిని బలిచ్చాడు. ఈసారి పక్కింటి పిల్లవాడిని బలిచ్చాడు. నా తమ్ముడికి అప్పుడు ఆరేళ్ల వయసుంటుంది... తండ్రి మీద నమ్మకంతో ధైర్యంగా పూజలో కూర్చున్నాడు. వాడి తల తెగనరికే ముందు అపనమ్మకంగా వాడు చూసిన చూపు ఈ జన్మలో మర్చిపోలేను. తల తెగి పడ్డాక వాడి మొండెం ఎగిరెగిరి కొట్టుకుని, కాసేపటి తర్వాత నిర్జీవంగా మారటం నాకింకా గుర్తు. అది చూసి మా అమ్మ పిచ్చిదానిగా మారింది. కొన్నాళ్లతర్వాత ఎటో వెళ్లిపోయింది, పిచ్చితోనే! ఏమిచేయాలో తెలీక, ఎటెళ్లాలో తెలీక, నన్నెప్పుడు బలిస్తాడోననే భయంతో బాల్యం గడిచింది. నన్ను నేను రక్షించుకోగలిగే వయసు వచ్చింది. ఇక ఫర్వాలేదనుకుంటుండగా మళ్లీ క్షుద్రపూజలు మొదలెట్టాడు. ఈసారి గుప్తనిధుల కోసం!" నిర్వికారంగా చూస్తూ చెప్తూనే ఉన్నాడతను.

"మళ్లీ ఆ తాంత్రికుడు చెప్పింది నమ్మి పక్కింటి పిల్లవాడికి మాయమాటలు చెప్పి తీసుకొచ్చినట్లున్నాడు. నేను ఇంటికి వచ్చేసరికి ఇల్లంతా రక్తపు మడుగు. జుట్టు విరబోసుకుని మంత్రాలు జపిస్తూ మా నాన్న. నేనే చుట్టుపక్కల వాళ్లని తీసుకొచ్చాను. వాళ్లు పళ్ళూడగొడితే చాలు, మంత్రాలు చదవలేడనుకున్నారు. చంపదల్చుకోలేదు. కానీ నాకు మా నాన్నసంగతి తెలుసు. అందుకని నేనే గుంపులో కలిసిపోయి తల పగిలేలా కొట్టాను".

"ఐయామ్ సారీ!" గొణిగినట్లుగా అన్నాడు అక్షయ్.

తన మేనకోడలు తప్పిపోయిన విషయం, తాము అన్ని కోణాల్లోనూ ఆలోచించి వెతుకుతున్నట్లు చెప్పాడతనికి.

"నరబలులిచ్చే సంప్రదాయం చాలావరకు తగ్గిపోయింది. నాకు తెలిసి ఇద్దరే బాబాలు నరబలితో అతీతశక్తులు పొందవచ్చని భావిస్తారు. బహుశా వాళ్ళిప్పుడు నిమ్తలాఘాట్‌లో మీకు దొరకొచ్చు. ఇది కలకత్తాలో ఒక శ్మశానవాటికకి చెందిన ప్రాంతం. రాత్రిళ్లు అక్కడికి అఘోరాలు వస్తారనీ, కాలిన శవాల్లో మిగిలిన మాంసాన్ని తింటారనీ, అతీతశక్తులకోసం క్షుద్రపూజలు చేస్తుంటారనీ మా నాన్న చెప్తుంటే విన్నాను. కాళీపూజ జరిగే రోజుల్లో క్షుద్రశక్తులు నిద్రలేస్తాయని వీళ్లంతా భావిస్తారు. కాళికను ప్రసన్నం చేసుకుంటే కోరినవి జరుగుతాయనుకుంటారు" చెప్పాడతను.

వెంటనే వెనక్కు బయలుదేరాడు అక్షయ్.

దారిలో ఫోన్ ద్వారా కలకత్తాకి ఫ్లయిట్ బుక్ చేసుకున్నాడు. బెంగాలీ కొలీగ్‌కి ఫోన్‌చేసి నిమ్తలాఘాట్ గురించి వివరాలడిగాడు.




**ఓ ఇంగ్లీషు వార్తాపత్రికలోని నాలుగు లైన్ల వార్త అతణ్ణి ఆకర్షించింది. ఊరు, పేరు, అడ్రస్ అన్నీ నోట్ చేసుకున్నాడు. వెంటనే తెల్లటి స్కోడాలో ఆ ఊరు బయలుదేరాడు. అక్కడికి చేరుకున్న తరువాత కొన్ని వివరాలు తెలుసుకున్నాడు అక్షయ్. అతడు నైరా కోసమే ఆ ఊరు వెళ్లాడా? నైరా ఆచూకీ దొరికిందా? అతడు తెలుసుకున్న వివరాలు ఏమిటి?**

అతను ప్రాజెక్ట్ పని మీద ఫ్రాన్స్‌లో ఉన్నాడట.

అప్పుడు టైమ్ అర్ధరాత్రట.

"అఘోరాగా మారుతున్నావా ఏంటి?" నిమ్తలాఘాట్ అనగానే అడిగాడతను.

జోక్‌ని ఆస్వాదించే పరిస్థితిలో లేడు అక్షయ్.

తను వెళ్తున్న కారణం చెప్పాడు.

"వెరీసారీ! కలకత్తా మెట్రోలో శోభాబజార్ స్టేషన్‌లో దిగి ఆటోలో ఘాట్‌కి వెళ్లవచ్చు. ఏదైనా అవసరముంటే నాతోపాటు చదువుకున్న అమ్మాయి ఇప్పుడా ఏరియాలోనే డి.ఎస్.పిగా చేస్తోంది. తనని కాంటాక్ట్ చేయి. నీకు సహాయం చేయమని చెప్తాను" చెప్పాడతను.

మర్నాడు పొద్దున ఏడింటికి అక్షయ్ కలకత్తాలో ఉన్నాడు.

హోటల్‌లో చెకిన్‌చేసి మెట్రోకోసం బయలుదేరాడు.

కలకత్తాలో చాలావరకూ పాతకాలం నాటి భవనాలే ఉండటం గమనించాడతను. గొప్పగొప్ప కాలేజీలు ఉండి ఎంతో డబ్బున్న ప్రదేశం అయినప్పటికీ వారసత్వ సంపదగా వస్తున్న ఆ బిల్డింగులను ఆధునిక పోకడలతో కూలగొట్టకుండా పరిరక్షించటం ముచ్చటగా అనిపించింది. ఒకపక్కన మంగళ్‌యాన్‌ని మార్స్‌లో ప్రవేశపెట్టి, వేరే గ్రహాలను స్టడీచేస్తున్న కాలంలో నరబలులిస్తూ అతీతశక్తుల కోసం ప్రయత్నించేవారు కూడా ఆ ప్రాంతంలోనే ఉండటం అతడిని కలిచివేస్తోంది.

ఆటో దిగి రైలు పట్టాలు దాటుకుంటూ ముందుకు నడిచాడతను.

గంగానది బూడిదరంగులో మెరుస్తోంది.

ఆకాశం గంగని తాకుతున్నట్లుగా కనబడుతోంది దూరంగా.

సూర్యుడి వెలుతురు నీళ్లమీద పడి ప్రతిబింబిస్తోంది.

పూల దుకాణాలు ఒకవైపు కనబడుతున్నాయి.

బడ్డీకొట్ల నుంచి టీ మరుగుతున్న ఘాటు వాసన.

పూల కొట్టతన్ని అడిగాడు.

'ఇక్కడ అఘోరాలు....'

మొహం చిట్లించి, తనకి తెలీదన్నాడు.

ఇక్కడ అఘోరాలు ఉంటారని విన్నాను. బలులు ఇస్తారనీ.." అతని మాటలు పూర్తవకుండానే జనం పోగవటం మొదలెట్టారు. వారికా సంభాషణ చాలా ఆసక్తికరంగా ఉంది.

"నిజంగా వాళ్లని కలిసే ధైర్యముంటే రాత్రి

## రాయ్‌లక్ష్మికి ఎంత కష్టం?

ఈ కష్టాలు మామూలు కష్టాలు కావు, సినీ కష్టాలు! అవకాశాలు లేక కాదు. వస్తున్న అవకాశాలతోనే కష్టాలట! 'ఖైదీ నంబర్ 150'తో రాయ్‌లక్ష్మికి ఎంత పేరు రావాలో అంత పేరూ వచ్చేసింది. అంతకు మించి క్రేజ్ కూడా వచ్చింది. దీన్ని చూసి సంతోషపడేలోగానే అనుకోని కష్టాలు చుట్టుముట్టాయట! అవి ఏమిటంటే....చాలా సినిమాల్లో ఐటెంసాంగ్ కోసం ఆఫర్లు క్యూ కట్టాయట! పారితోషికం ఎంత కావాలంటే అంత తీసుకోండి, మా సినిమాలో ఒక్క సాంగ్ చేసి పెట్టండి అనేవారే ఎక్కువయి పోయారట! ఇలా అడుగుతున్న వారెవరూ హీరోయిన్ ఛాన్స్ మాత్రం ఇవ్వడం లేదట! ఈ ఆఫర్లను అంగీకరిస్తే డబ్బులు వస్తాయేమో కానీ, హీరోయిన్‌గా కెరీర్ మటాష్ అవుతుందని ఆమె సన్నిహితులు సలహా ఇస్తున్నారట కూడా! ఈ ఆఫర్లను చూసి మురిసిపోవాలో, లేక బాధపడాలో తెలియకుండా ఉందని రాయ్ లక్ష్మి తెగ ఫీలవుతోందట!



టైమ్‌లో వచ్చి చూడు." పగలబడి నవ్వుతూ అన్నాడు చుట్టూ మూగిన వాళ్ళలో ఒకతను. మిగతా వాళ్లు అతని నవ్వుతో జత కలిపారు.

అక్షయ్‌కి వాళ్లందరూ తననొక జోకర్ కింద జమకడుతున్నారని అర్థమైంది.

మళ్లీ రాత్రికి అక్కడికి వద్దామనుకొని, హోటల్‌కి వచ్చేశాడు. రిసెప్షన్ దగ్గర ఒక చెక్కషెల్ఫ్ లాంటిది ఉంది. కలకత్తాలో చూడదగిన ప్రదేశాలు, వాటికి సంబంధించిన ఇతర వివరాలు బుక్‌లెట్స్‌గా చేసి అక్కడుంచినట్లున్నారు టూరిజం డిపార్ట్‌మెంటు వాళ్లు.

'నిమ్తలాఘాట్‌కి సంబంధించిన బుక్‌లెట్ తీసుకుని, లాంజ్‌లో ఉన్న సోఫాలో కూర్చున్నాడు. అది తిరగేస్తూ హర్షకి ఫోన్‌చేశాడు.

"హర్షా! ఏదైనా ఫోన్ వచ్చిందా?" ఆశగా అడిగాడు అక్షయ్.

"లేదు. నువ్వు వెళ్లిన పని ఎంతవరకూ వచ్చింది?" తిరిగి అడిగాడు హర్ష.

"రాత్రివరకూ వెయిట్ చేయాలట" చెప్పాడు అక్షయ్.

"హర్షా! నైరా దొరుకుతుందనే నమ్మకం రోజు రోజుకీ నాలో పోతోంది" నిరాశగా అన్నాడు.

"నైరా ఆచూకీ తెలీనంతవరకూ ఆమె క్షేమంగానే ఉందనుకోవాలి మనం. మన చేతిలో ఉన్నంత వరకు చేద్దాం. నాకెందుకో నైరా తప్పక మనవద్దకు చేరుతుందనీ, ఆమె సేఫ్‌గానే ఉన్నదనీ అనిపిస్తోంది" అన్నాడు హర్ష.

ఒక మంచి స్నేహితుడు వెన్నుతట్టి ముందుకు నడిపించనూగలడు. మనం తప్పు చేస్తుంటే వారించి వెనక్కి లాగనూగలడు.

దేవుడు తన వాళ్లందరినీ తనకు కాకుండా చేసినా, కనీసం హర్షలాంటి మంచి ఫ్రెండ్స్‌ని మిగిల్చాడనిపించింది అక్షయ్‌కి.

హర్షతో మాట్లాడుతుండగా మరో ఫోన్ వస్తుండటంతో లైన్ కట్‌చేసి ఆ ఫోన్ తీసుకున్నాడు అక్షయ్. కావ్య చేసింది.

"ఎస్ కావ్యా!" ఆన్సర్ చేస్తూ అన్నాడు అక్షయ్. రెండు క్షణాల నిశ్శబ్దం.

"అక్షయ్ ఎలా ఉన్నావు?" అడిగింది.

"ఐయామ్ ఓకే!" చెప్పాడు.

తర్వాత ఏమి మాట్లాడాలో ఇద్దరికీ అర్థం కావటం లేదు.

అసహనంతో ఫోన్ పెట్టేద్దామనుకుంటుండగా అవతల్నుంచీ వెక్కిళ్లు వినబడుతున్నాయి.

"ఎందుకు ఏడుస్తున్నావు?" అయోమయంగా అడిగాడు.

ఏడుపు పెద్దదైంది.

"సారీ అక్షయ్! తర్వాత చేస్తాను" ఫోన్ పెట్టేసింది.

హర్షకి మళ్లీచేసి చెప్పాడు అక్షయ్, "కావ్య ఎందుకేడుస్తుందో కనుక్కోమని".

కాసేపటికి మెసేజ్ వచ్చింది హర్షనుంచి

"నథింగ్ సీరియస్! నిన్ను మిస్ అవుతున్నట్లుంది!"

నవ్వాలో, ఏడవాలో అర్థం కాలేదు అక్షయ్‌కి.

"ఈ ఆడవాళ్లకి ఏ సందర్భంలో ఎలా ప్రవర్తించాలో కూడా తెలీదా? తనని మిస్ అవటం ఏమిటి? మెంటలా? తనున్న పరిస్థితేమిటి?"

"ఏంటి సార్, అఘోరా బాబాలని కలవాలా?" ఎదురుగా నిలబడి అడుగుతున్నాడతను. ఈ లోకంలోకి వచ్చాడు అక్షయ్.

"అవును. మీకు వాళ్లు తెలుసా?" ఆత్రంగా అడిగాడు.

"ఇందాక నిమ్తలాఘాట్‌లో ఎంక్వయిరీ చేస్తుంటే చూశాను. మీ దగ్గరికి రాబోతుండగా మాయమయ్యారు. అనుకోకుండా మళ్లీ ఇక్కడ కనిపించారు. నేనీ ఏరియాలో టూరిస్ట్ గైడ్‌గా పని చేస్తుంటాను" చెప్పాడతను.

"నేను వాళ్లను కలవాలి. నువ్వు తీసుకెళ్లగలవా?"

'ఎవరి మీదైనా చేతబడి చేయాలా?" సర్కాస్టిక్‌గా ఉందతని నవ్వు.

"లేదు. వాళ్ల లైఫ్‌మీద డాక్యుమెంటరీ తీస్తున్నాము. నేను దానికి కావలసిన రీసెర్చ్ చేస్తున్నాను" నోటికొచ్చిన అబద్ధం చెప్పాడు అక్షయ్.

అపనమ్మకంగా చూసి అన్నాడతను.

"దానికి వాళ్లను కలిస్తే ఏం లాభం? వాళ్లు మామూలు మనుషుల్ని చాలా దూరంలో పెడతారు. బయటి వ్యక్తులు తమ ఆచార వ్యవహారాలకు భంగం కలిగిస్తారనీ, హాని తలపెడతారనేది ఒక కారణమయితే, తమను చూసి భయాందోళనలకు గురవకూడదనేది మరో కారణం".

"నిజంగా అంత భయంకరమైన వాళ్ళా?" ఆసక్తిగా అడిగాడు అక్షయ్.

"అఘోరా అంటే నిజానికి భయంకరమైనవాళ్లు కాదని అర్థం. మనకూ, వాళ్ళకూ తేడా ఏమిటంటే, మనం ప్రతిదాంట్లోనూ శుభ్రతనూ, అపరిశుభ్రతనూ వెతుకుతాం. శుభ్రంగా ఉన్నవే మనకు కావాలనుకుంటాం. మనం ఏవయితే అపవిత్రమైనవి అనుకుంటామో వాటిని అఘోరాలు స్వీకరిస్తారు, చేరదీస్తారు".

"వాళ్లు పూజించేది శివుడిని. క్షీరసాగర మథన సమయంలో ఎలాగైతే శివుడు హాలాహలాన్ని తన గొంతులో దాచుకుని మిగతా వారిని కాపాడాడో, తామూ అంతేననేది వాళ్ల అభిప్రాయం".

"మనం నమ్మినా, నమ్మకపోయినా వాళ్లు ప్రపంచ శాంతినే కోరుకుంటారు. నిజానికి వాళ్లు పెద్దగా ఇంకేదైనా ఆశించటానికి కూడా వాళ్ల జీవనవిధానంలో ఆస్కారం లేదు. ఒళ్లంతా బూడిద పూసుకుంటారు. చాలా కొద్దిపాటి బట్టలు వేసుకుంటారు. జుట్టు అట్టలు కట్టుకుపోయుంటుంది. మీకో సంగతి తెలుసా? వాళ్లసలు జుట్టు కత్తిరించకూడదు. చనిపోయిన జంతుకళేబరాలనీ, మనుషుల శవాలనీ తింటారు".

"మనిషి పుర్రెనే వాళ్లు తినటానికీ, తాగటానికీ ఉపయోగపడే పాత్రగా వాడతారు. అఘోరాల ఒంటిమీద జంతువుల, మనుషుల ఎముకలు తప్ప మరో ఆభరణం కనబడదు. చెడునంతా తాము తినేయటం ద్వారా మంచిని మాత్రమే ప్రపంచానికి మిగుల్చుతున్నామని గాఢంగా విశ్వసిస్తారు" కళ్లు మెరుస్తుండగా చెప్తున్నాడా గైడ్.

"ఇంత ఆరాధనగా చెప్తున్నావు. నువ్వుకూడా అఘోరావేనా?" అనుమానంగా అడిగాడు అక్షయ్.

గట్టిగా నవ్వాడతను.

"ఊరుకోండి సార్. పన్నెండేళ్ళు కఠిన నియమ

నిబంధనలను పాటిస్తేనే కానీ అఘోరాలు కాలేరెవరూ! అంత ఓపిక నాకు లేదు".

రెండు నిమిషాల నిశ్శబ్దం తర్వాత అన్నాడు.

"నా తమ్ముడు ఒక అఘోరా బాబాని గురువుగా చేసుకుని వాళ్లతో కలిసిపోయాడు. మళ్లీ ఇంత వరకూ నాకు కనబడలేదు. ఇదంతా జరిగికూడా ఇరవై యేళ్లు దాటింది".

"తనవాళ్లంటూ ఉన్న ప్రతివాళ్లకీ ఏదో ఒక వేదనాభరితమైన చరిత్ర. ఎవరూ లేని అనాథలే నయమేమో!" నిట్టూర్చాడు అక్షయ్.

"ఒక్కరే వెళ్ళకండి. గుండె పగిలి చచ్చిపోతారు" నవ్వుతూ అన్నాడతను.

"నా గుండె గట్టిదేలే కానీ.. వాళ్లు బలులు ఇస్తారా?" అడిగాడు అక్షయ్. చాలా కాజువల్‌గా అడిగినట్లుగా కనిపించటానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడతను.

"చాలా అరుదుగా! నాకు తెలిసి ఒకరిద్దరు తప్ప లేరు. దుర్గాపూజ టైమ్‌లో నరబలి ఇస్తే దేవి అనుగ్రహించి తాము  కోరుకున్న వాటిని అందిస్తుందని నమ్ముతారు" చెప్పాడు.




"సాయంత్రం మీకాప్రాంతం వరకూ తోడు వస్తాను. వాళ్ళను చూపించి నేను వెనక్కొస్తాను. ఆ తర్వాత మీ దారి మీది, నా దారి నాది" చెప్పాడతను.

'డీల్!' అన్నాడు అక్షయ్.

●●●

దిగాలుగా పాంట్రీలో కూర్చుని ఉంది కావ్య.

"ఏమైంది?" అడిగింది రోహిణి.

"సడన్‌గా టెక్నాలజీ ప్రెజెంటేషన్ నేనివ్వాలంటున్నాడు నా ప్రాజెక్ట్ లీడ్. ఏదో బలవంతంగా కోడ్ వరకూ లాగించగలను కానీ ప్రెజెంటేషన్ అంటే నా వల్ల కాదు. అందులోనూ క్లయింట్ మేనేజర్ చాలా అగ్రెసివ్‌గా ఉంటాడు. టెక్నికల్‌గా చాలా సౌండ్. నన్ను ఉతికి ఆరేస్తాడు. ఇదంతా రాజేష్ ప్లాన్".

కళ్లల్లో నీళ్ళొక్కటే తక్కువ ఆమెకి.

"నీకొచ్చిందే చెప్పు. నీకున్న ఎక్స్‌పీరియన్స్ వన్ ఇయరేగా. అప్పుడే అంతంత నీ నుంచి ఎక్స్‌పెక్ట్ చేయకూడదని వాళ్లకు మాత్రం తెలీదా?"

"కానీ క్లయింట్‌కి చెప్పేటప్పుడు మన ఎక్స్‌పీరియన్స్ ఎక్కువగా చెప్తారు కదా!" అడిగింది కావ్య.

"కాబట్టి క్లయింట్ ఫీడ్‌బాక్ చెత్తగా ఇస్తాడు. ఇదే ఛాన్స్‌కోసం చూస్తున్నాడు రాజేష్".

"కావ్యా! నువ్వు అనవసరంగా టెన్షన్ పడకు. ఎప్పుడు ప్రెజెంటేషన్? వేరే డోర్ నుంచి పాంట్రీలోకి వచ్చి కాఫీ కలుపుకుంటున్న సీమ అడిగింది.

"ఇంకో రెండు గంటల్లో. ప్రిపరేషన్‌కి కూడా టైమ్‌లేదు" చెప్పింది కావ్య.

"కాన్ఫరెన్స్ రూమ్ బ్లాక్‌చేసి పెట్టుకో. ఫైవ్ మినిట్స్‌లో నీ ల్యాప్‌టాప్ తీసుకుని అక్కడికి వెళ్లు. నేనిప్పుడే ఒక ఫోన్ చేసుకుని వస్తాను" అంది సీమ.

తలూపి పరుగెత్తింది కావ్య.

ఆమె ఆ టైమ్‌లో ఎంత డెస్పరేట్‌గా ఉందో, తను శత్రువులా భావించే సీమ మాటని వినటంలోనే అర్థమయింది వాళ్లకు.

●●●

పవర్‌పాయింట్ ప్రెజెంటేషన్‌ని చాట్‌విండోలో స్క్రీన్‌షేర్ చేసింది కావ్య. ఆమె ఎదురుగా సీమ కూర్చుంది. చాట్‌లో అవతల వైపు హర్ష.

కావ్య స్క్రీన్ అంతా హర్ష చూడగలుగుతున్నాడప్పుడు.

ఒక్కొక్క స్లయిడ్ చూస్తున్నాడు.

కావ్యకి నోట్స్ చెప్పటం మొదలెట్టాడు ఫోన్‌లో.

ప్రతి స్లయిడ్‌లో గబగబా కింద నోట్ చేసుకోసాగిందామె.

ప్రెజెంటేషన్ ఇచ్చేప్పుడు ఆ నోట్స్ ఆమెకి మాత్రమే కనపడేలా, ప్రెజెంటేషన్ చూసే మిగతా వారికి కనబడకుండా ఉండే ఫీచర్ ఉందా సాఫ్ట్‌వేర్‌లో.

ప్రస్తుతం దాన్నే ఉపయోగిస్తున్నారు వాళ్లు.

మొత్తం నోట్స్ రాసుకున్నాక హర్ష చెప్పాడు.

"ఆల్ ద బెస్ట్!"

"థాంక్యూ హర్షా! ఇవాళ నువ్వు హెల్ప్ చేయకపోతే చాలా కష్టమయ్యేది" చెప్పింది కావ్య.

"యూ ఆర్ మోస్ట్ వెల్‌కమ్!" నవ్వాడతను.

"ఆల్‌సెట్?" అక్కడి నుంచి వెళ్తూ అడిగింది సీమ.

"అనే అనుకుంటున్నాను. చూడాలి ఎలా అవుతుందో? మొత్తం అయ్యాక నీకు అప్‌డేట్ ఇస్తాను. థాంక్స్" చెప్పింది కావ్య.

సీమ నవ్వింది.

గులాబీ రంగు చెంపమీద అందమైన పొడుగాటి సొట్ట.

ముత్యాలు పేర్చినట్లున్న పళ్లు.

అంత అందమైన శత్రువుని, తనకు సహాయపడే శత్రువుని ఏమని తిట్టుకోవాలో అర్థం కాలేదు కావ్యకి.

మళ్లీ ఒకసారి మొత్తం ప్రెజెంటేషన్ ఫ్లో చూసుకుంది కావ్య.

"దేవుడా!" దణ్ణం పెట్టుకుంది.

"ఇది నా మొట్టమొదటి ప్రెజెంటేషన్. ప్లీజ్! ఇది ఫ్లాప్ కాకుండా చూడు."

దేవుడామె మొర ఆలకించినట్లున్నాడు.

ప్రెజెంటేషన్ ఏ మాత్రం రసాభాస కాకుండా జరిగింది.

తనకి అర్థం కాని చోట్ల కిందున్న నోట్ చదివి, అర్థమైన చోట తనకొచ్చింది చెప్పగలిగిందామె. అదృష్టవశాత్తు ఎక్కువ లోతుగా వెళ్లి ప్రశ్నలు అడగలేదు క్లయింట్ వైపువాళ్లు.

ప్రెజెంటేషన్ పూర్తయ్యాక ఆమెకి ఒక అప్రిసియేషన్ మెయిల్ కూడా పంపాడు క్లయింట్ మేనేజర్.

ప్రాజెక్ట్ లీడ్, రాజేష్‌కి పింగ్ చేసి చెప్పాడు.

"గట్టి పిండమే! తేలిగ్గా దాటేసింది ఈ సవాలుని".

"ఇంపాజిబుల్. ఆమెకి అంత సీన్ లేదు" షాక్ తిని అన్నాడు రాజేష్.

"ఓకే. అయితే ఇంకోచోట ఇరికించవచ్చు. కానీ క్లయింట్‌కి మాత్రం ఆమె మీద సదభిప్రాయం ఏర్పడింది".

●●●

"సీమా! ప్రెజెంటేషన్ చాలా బాగా జరిగింది. క్లయింట్ మెచ్చుకుంటూ మెయిల్ కూడా పంపాడు" చిన్నపిల్లలా సంబరపడిపోతూ చెప్పింది కావ్య.

"వెరీగుడ్!" నవ్వింది సీమ.

సీమ అలా నవ్వినప్పుడల్లా కావ్యకి ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంటుంది.

"ఒక మనిషి ఇంత అందంగా ఎందుకు పుట్టాలి? పుడితే పుట్టింది... అక్షయ్‌ని ఒక్కడినీ తనకిచ్చేస్తే చాలు! అన్నీ ఆమెకే కావాలా?"

"కావ్యా! నువ్వు భయపడినన్ని రోజులూ రాజేష్ లాంటి వాళ్లు వేధిస్తూనే ఉంటారు. తెలివిగా ఎత్తుకి పైఎత్తు వేయటం నేర్చుకో! లేదా ఉద్యోగం పోతే పోనీ, ఇదికాకపోతే ఇంకోటి అనుకునే తెగింపు అలవర్చుకో! లేకపోతే ఉద్యోగం చేయలేవు" చెప్పింది సీమ.

ఒక అక్కో, చెల్లెలో సలహా ఇస్తున్నట్లుగా అనిపించింది కావ్యకి.

"సీమ మంచిదే. తనే అనవసరంగా ఆమె మీద కక్ష పెంచుకుంటోంది" అనిపించి గిల్టీగా ఫీలవబోయింది.

"సీమా, అక్షయ్ ఎలా ఉన్నాడో తెలుసా?" అడిగింది కావ్య.

"లేదు. ఈ మధ్యలో మాట్లాడలేదు. పాపం, అన్ని కష్టాలూ అతనికే వస్తున్నాయేంటో!" అంది సీమ.

అప్పుడే సీమ ఫోన్ మోగటం మొదలయింది.

'అక్కీ' అని స్పష్టంగా కనబడుతోంది. మండిపోయింది కావ్యకి.

'మాట్లాడటం లేదంది. అతనే ఆమెకి ఫోన్‌చేస్తున్నాడు. తను ఫోన్‌చేస్తే మాట్లాడటానికి మాటలే ఉండవు. పైగా సీమ తనకి అబద్ధాలు చెప్తుంది టచ్‌లో లేనని..'

"కావ్యా!"

సీమ పిలుస్తున్నా వెనక్కి తిరిగి చూడకుండా, చరచరా నడుచుకుంటూ తన డెస్క్ వద్దకి వెళ్లిపోయింది కావ్య.

**(ఇంకా వుంది)**

# అదే ప్రేమ!

## -మానస ఎండ్లూరి

**"ఇది తీయని వెన్నెల రేయి.. మది వెన్నెల కన్నా హాయి... నీ ఊహల జాబిలి రేఖలు మురిపించెను ప్రేమలేఖలు.."**

**నేనూ అర్జున్ సెల్‌ఫోన్‌లో ఒకే ఇయర్‌ఫోన్స్‌లో ఏ వెయ్యో సారో వింటున్నాం ఈపాట.**

**'మా ఇంటివెనుక ఊయల్లో, నా ఒళ్లో అర్జున్! అతని గుండెలమీద తన చేయి నా చేత్తో మమేకమైన కలయిక. తను కళ్ళు మూసుకుని పాట ఆస్వాది స్తున్నాడు. నేను అర్జున్ స్పర్శలో కరిగి పోతున్నాను. ఊయలకి అల్లుకున్న సన్నజాజులు నా చెక్కిలి ముద్దాడుతు న్నాయి. ఈ రేయి... ఈ సన్నజాజులు పెట్టే గిలిగింతలు... ఈ ఊయల... ఈ పాట... నా అర్జున్! అబ్బ! ఎంత అదృష్టం! ఈ రాత్రి ఇంకా ఉండాలి. సూర్యుడు కాస్త మెల్లగా ఉదయిస్తే ఎంత బావుణ్ణు! ప్చ్!**

అర్జున్‌ని ఈపాట ఎన్నిసార్లు పాడమన్నా నాకోసం పాడడు. ఇప్పుడైనా అడగాలి!

చల్లగాలికి మల్లెరేకులు సీతాకోకచిలుక రెక్కల్లా రెపరెపలాడుతున్నాయి. కాస్తంత దూరంగా మరువం సువాసన వాతావరణాన్ని ఇంకాస్త మత్తెక్కిస్తోంది. వెన్నెలకాంతిలో అర్జున్ ముఖం మరింత మెరిసి పోతోంది! కోటేరుముక్కు, చిన్నినుదురు, అందమైన పెదాలు వాటిపై తన మగసిరి చూపించే మీసం! అసలు అర్జున్ అందమంతా ఆ మీసం లోనే ఉంటుంది!

మెల్లగా వంగి పెదాలచివర చిన్నముద్దు పెట్టాను, మీసానికి తగిలీ తగలకుండా! చిత్రం!! అర్జున్ స్పందించలేదే? నిద్రలోకి జారుకున్నాడా ఏంటి!? అరె! పాట పాడమని అడుగుదామనుకు న్నాను కదా!

మీసం చివరనుంచి తనచెంప స్పృశిస్తూ చెవి వెనుక సుతారంగా ఒక ముద్దు! కిందకి జారుతూ మెడమీద ఒక ముద్దు! నాకోసం కట్టిన గుడిని పదిల పరచిన తన గుండెకి ఒక చిన్నముద్దు! నా ప్రేమ నంతా కలబోసి తన అరచేతిలో ఒక సున్నిత మైన ముద్దు! నా ప్రేమ అంగీకరించినందుకు నుదుటి మీద మరోముద్దు! మూతలుపడ్డ కనురెప్పల మీద లేలేతముద్దు!

అర్జున్‌కి ఇంకా మెలకువ రావడంలేదే? నా తాకిడిలో జీవంలేదా? లేక ఆటపట్టిస్తున్నాడా? "అర్జున్! అర్జున్" పిలుస్తున్నా లేవడంలేదే! ఇక లాభం లేదు! గట్టిగా తట్టాల్సిందే! "అర్జున్ లే!" గట్టిగా ఊపుతూ కిందపడ్డాను!!

"డార్లింగ్!"

'నడిరాతిరి వేళ నీ పిలుపు గిలిగింతలతో నను ఉసిగొలుపు...'

ఇయర్‌ఫోన్స్‌లో పాట... మంచం కింద నడ్డి విరిగి నేను!!

'ఛ! ఇదంతా కల!? ఆఖర్లో 'డార్లింగ్' అని అర్జున్ నన్ను పిలిచినట్టు కూడా అనిపించిందే! దెబ్బకి మత్తు వదిలిపోయింది' అనుకుంటూ పైకిలేచాను.

ఫోన్‌లో పాట ఆపేసి పక్కనేవున్న వాటర్ బాటిల్ మూతతీసి నీళ్ళు గొంతులో పోసుకో బోయి ఒళ్ళంతా తడుపుకున్నాను! స్వయంకృతాప రాధానికి తిట్టుకుంటూ తడి అంతా తుడుచుకుని వచ్చి బట్టలుమార్చుకుని ఈసారి ఒళ్ళు దగ్గరపెట్టు కుని మంచినీళ్ళుతాగి మళ్ళీ మంచం ఎక్కాను.

కళ్ళు మూసుకోగానే అర్జున్! ఎందుకు ఈ అబ్బాయి ఇలా నన్ను చిత్రవధ చేస్తున్నాడు! మన సులో మాట చెప్తే ఎలా తీసుకుంటాడో! ఏమను కుంటాడో! ఆఫీస్‌లో అతనికంటే సీనియర్‌ని! టీమ్‌లీడర్‌ని!! ఒకవేళ తనకీ నాలాంటి ఉద్దేశమే ఉంటే?!

అర్జున్ ఆఫీస్‌లో జాయినై పదకొండునెలలు అవుతుంది. అంటే దాదాపు ఏడాది కాలంగా నా ప్రేమను నాలోనే దాచుకొని మథనపడుతు న్నాను! రేపు ఎలాగో అలా చెప్పేస్తాను! అసలే దేశం మగాళ్ళకి గొడ్డుపోతోంది! లేదా ఇంకెవరైనా ఎగరేసుకుపోతారు! నిద్రపోదామని కళ్ళు మూసు కున్నాను. కొంటెగా కన్నుగీటుతూ అర్జున్! చప్పున లేచి కూర్చుని సెల్‌ఫోన్‌లో సీక్రెట్ ఫోల్డర్ పిన్ కొట్టి అర్జున్‌కి తెలియకుండా తీసిన తన ఫొటోలు చూసుకున్నాను. 'ఎంత అందంగా ఉన్నా వురా! కలలోకూడా అచ్చం ఇలాగే ఉన్నావే!' నా పిచ్చిచేష్టలకి నేనే నవ్వుకుని ఫోన్ ఆఫ్‌చేసి అర్జున్ తలపుల్లోనే నిద్రపోయాను.

> **ఆ ఇద్దరిదీ ఒకే ఆఫీసు. తను టీమ్‌లీడ్. అతడు మెంబర్. తనకన్నా చిన్న వయసు. ఏడాదికాలంగా అతడికి తన ప్రేమ వ్యక్తంచేయలేక మథనపడు తోందా టీమ్‌లీడ్. కలల్లో తేలిపోతూ విర హాగ్నిలో కాలిపోతోంది. ధైర్యం చాలడం లేదు. ఏదో సంకోచం. అంతలోనే ఓ గోల్డెన్ ఆపర్చునిటీ వచ్చింది! ఇక ఆ ఛాన్స్ వదులుకోదల్చుకోలేదు. మరి అత గాడేమన్నాడు? టీమ్‌లీడ్ భగ్నప్రేమికురా లుగా మిగిలిపోయిందా? లేక వారు జత కట్టారా?**

రోజూ పొద్దున్నే నిద్రలేచి రెడీ అయ్యి ఆఫీస్‌కి వెళ్ళడం మహావిసుగ్గా ఉండేది అర్జున్ రాక ముందు. కానీ ఇప్పుడు? ఎప్పుడు పొద్దెక్కుతుందా? అనీ, అప్పుడే అస్తమిస్తున్నావా? అని సూర్యుణ్ణి రోజుకి రెండుసార్లు తిట్టుకోవాల్సి వస్తోంది! ఆఫీసు టైమ్ అయిపోతోందంటే నేను పడే బాధ స్కూల్ పిల్లలు కూడా పడరంటే నమ్మండి!

ఆఫీసు పార్కింగ్‌లాట్‌లో కార్‌పార్క్ చేసి దిగుతుండగానే ఎదురయ్యాడు అర్జున్! వంగపండు రంగు చొక్కా, గోధుమ రంగు ప్యాంటు.. ఐదడు గుల పదంగుళాల ఎత్తూ, ఆ అందం, ఆ మీసం... కొత్తా వంకాయ పచ్చడిలా ఊరించేస్తు న్నాడు! అప్రయత్నంగా పలకరించేశాను!

"హాయ్ అర్జున్!"

"హాయ్ టీయల్! కళ్ళెర్రగా ఉన్నాయేంటండీ? నిద్రపోలేదా సరిగ్గా?"

'నీ విరహాగ్నిలో నిద్రెక్కడ పడుతుంది..' లోపల అనుకుని,

'హా! లైట్‌గా' అన్నాను పైకి.

"ఓ ఐసీ! ప్లీజ్ టేక్ కేర్ ఆఫ్ యువర్ సెల్ఫ్"

"ష్యూర్" నా వలపులు పైకి కనబడకుండా జాగ్రత్త పడుతూ అన్నాను.

"హేయ్! నైస్ గ్లాసెస్! ఎక్కడ తీసుకున్నారు?" అడిగాడు నా కొత్త కళ్ళజోడు చూస్తూ.

"నచ్చాయా? ఉంచేసుకోండి!" అనేశాను మన సులో మాట.

"అరెరె! వద్దండి. నేనూ ఇలాంటి వాటి కోసమే వెతుకుతున్నాను. అందుకే అడిగాను".

"ప్లీజ్! తీసుకోండి. మొహమాట పడొద్దు! నా గిఫ్ట్ అనుకోండి అర్జున్" బలవంతంగా అతని చేతిలో పెట్టేశాను.

"అదేంటండీ! అసలే నాకు మీరు చాలాహెల్ప్ చేస్తున్నారు. టీమ్‌లీడర్ అయ్యుండి నా పనంతా మీరే చేసేస్తున్నారు. పైగా ఇదొకటి!" చాలా సిగ్గుపడుతూ అన్నాడు. ఎంత ముద్దొచ్చేశాడో!

"నిన్న మీకు 'బెస్ట్ ఎంప్లాయీ ఆఫ్ ది ఇయర్' అవార్డు వచ్చినందుకు కంగ్రాట్స్ అండి. నిన్ననే చెప్దామనుకున్నా కానీ అందరూ మీచుట్టూ ఉండడం వల్ల చెప్పలేకపోయా! సారీ! రెండేళ్ళనుంచీ ఆ అవార్డు మీకే వస్తోందని తెలిసి ఆశ్చర్యపోయా! మీ టీం మెంబర్ అయినందుకు చాలా గర్వంగా ఉంది!"

అర్జున్ కళ్ళు మెరిసిపోతున్నాయి! తన మాటలు ఇంకా ఇంకా వినాలనిపిస్తోంది. తన చూపులతో

ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్నాడు.

"సరెసరే! ఎక్కువ పొగిడెయ్యకండి! థాంక్యూ! మళ్ళీ కలుద్దాం!" షేక్‌హ్యాండ్ ఇవ్వడానికి మనసు సిద్ధంగా ఉంది కానీ ధైర్యం సరిపోలేదు!

'ఏమనుకుంటాడో?' అనే ఒక ప్రశ్న అన్నిటికీ అడ్డం పడుతోంది ముందుకు సాగనివ్వక!

మరుసటిరోజు, కేఫెటేరియాలో టీ తాగుతుంటే ఎదురుగా వచ్చి నిల్చున్నాడు అర్జున్. 'రండి! కూర్చోండి' అనే మాట కోసం ఎదురు చూస్తున్నాడని అర్థమై ఆహ్వానించాను. నా మనసంతా నిర్లిప్తంగా ఉంది. అర్జున్‌ని చూస్తుంటే నా మీద నాకే జాలి! సానుభూతి! చెప్పాలనుకున్న మాటలన్నీ పెదవి వెనుకే ఆగిపోతున్నాయి. ఈ జన్మకి చెప్పగలనా? చెప్పడానికి భయం కాదు! మొహమాటం లేదు! సంకోచం మాత్రమే! తరువాత జరిగేది ఊహకి అందడంలేదు! ఔనంటే నా అంత సంతోషించేవారు లేరు. కాదంటే? అదొక ఘోర అవమానం! కళ్ళల్లో నీళ్ళు రాకుండా ప్రయత్నిస్తున్నాను.

"మీ పెర్‌ఫ్యూమ్ చాలా బావుంది టీయల్!" చక్కటి చిరునవ్వుతో అన్నాడు అర్జున్.

"ఎందుకు విచిత్రంగా టీయల్ అని పిలుస్తారు? అందరిలా పేరుపెట్టి 'నువ్వూ' అని మాట్లాడొచ్చుగా! నేనూ ఎవరితోనూ ఇంత ఫార్మల్‌గా మాట్లాడను. మీతోనే!"

"అంటే ఈ 'గార్లు', 'బూర్లూ' మనిద్దరికే ప్రత్యేకం అన్నమాట! మంచిదేగా! ఇందాక నేను మీకొక కాంప్లిమెంట్ ఇచ్చాను! బదులు చెప్పనేలేదు!"

'నాకు తెలుసు! నీకిష్టమైన బ్రాండ్ అని! అందుకే కొనుక్కున్నాను' మనసులో అనుకుని,

"థాంక్యూ! మీకు నచ్చినందుకు" ఏ ఆర్భాటం లేకుండా అన్నాను.

"టీ చల్లారిపోతుంది! తాగండి!" టీ కప్పులోకి తొంగి చూస్తూ అన్నాడు అర్జున్.

"ఓ! సారీ! మీకేం ఆర్డర్ చెయ్యలేదు! చెప్పండి ఏం తీస్కోను? టీ? కాఫీ?" తడబడుతూ అడిగాను.

"నో! నో! నేను టీ, కాఫీ తాగను టీయల్! బాదంపాలు దొరుకుతాయిగా ఇక్కడ. తెచ్చుకుంటాను" లేచి వెళ్ళాడు.

"ఏంటీ టీ, కాఫీ తాగడా? అన్నీ తెలుసుకున్నాను కానీ ఈ విషయం తెలీదే నాకు! ఒక మనిషి గురించి తెలుసుకోవాలంటే అంత సులువా?! ఎన్నోఏళ్ళు కాపురం చేసిన మొగుడూ పెళ్ళాలకే సరిగ్గా అవగాహన ఉండదు ఒకరిపట్ల ఒకరికి! నేనెంత! అర్జున్‌తో మాట్లాడ్డానికి ఇదే అనువైన సమయం! అడిగేస్తాను! నేనంటే ఇష్టమో లేదో.

అర్జున్ బాదంపాల సీసాతో వస్తున్నాడు. బ్లూ జీన్స్, బ్లాక్ ఎండ్ వైట్ చెక్స్‌షర్ట్‌లో అదిరిపోయాడు ఇవ్వాళ!

"అదేంటి ఇంకా టీ తాగలేదు మీరు!" కూర్చుంటూ అడిగాడు అర్జున్.

"మీకిష్టం లేదుగా!" తన కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాను.



"అదేంటి? నా కిష్టం లేకపోతే ఏం?" తటపటాయించాడు.

"హహ్హ! అదేం లేదు! టీ బాలేదు! అందుకే".

"అయ్యో! పోనీ కాఫీ తీసుకురానా?"

"వద్దు బాదంపాలు ట్రై చేద్దామనుకుంటున్నా"

"తెస్తాను టీయల్! ఒక్క నిమిషం" లేవబోయాడు.

"ఎందుకు? తెచ్చేశారుగా!" ఎంత ఆపినా ముఖంలో సిగ్గు తొణికిసలాడుతూనే ఉంది నాకు.

"అదీ! అంటే నేను కొంచెం తాగాను. మీకు వేరేది తెస్తాను!"

"పర్లేదు! మీరుతాగాక లాస్ట్‌లో జస్ట్ టేస్ట్ చేస్తానంతే!"

అతడి ముఖంలో మార్పులు! కానీ స్పష్టత లేదు!

•••

"హ్యాపీ బర్త్‌డే అర్జున్"

"థాంక్యూ టీయల్. నాకు తెలుసు మొదటి కాల్ మీరే చేస్తారని!"

"అదెలా?"

"అదంతే! ఎలాగూ సండేకాబట్టి మీకోచిన్న ట్రీట్ ఇవ్వబోతున్నాను. మీరు తప్పకుండా రావాలి!"

"అదేం వద్దుగానీ, మీ బర్త్‌డే మా ఇంట్లోనే చేసుకోవచ్చు! మీరే రండి! పదకొండు గంటలకల్లా!"

"ఇంట్లో అంటే... మీ పేరెంట్స్ ఉంటారుకదా? పర్వాలేదా...?"

"ఏంటి మీకు తెలీదా? వాళ్ళు అమెరికాలో మా అక్కదగ్గర ఉన్నారు. ఇంట్లో నేను మాత్రమే ఉంటున్నాను. వచ్చేయండి! ఉంటాను".

ధైర్యంచేసి అర్జున్‌ని పిలిచేశాను! అతనికి ఇష్టమైన కేక్ ఆర్డర్ ఇచ్చాను. ఇల్లంతా డెకరేట్ చేశాను. తనకి నచ్చే వంటలన్నీ స్వయంగా చేశాను. అన్నీ సిద్ధంచేసి స్నానానికి వెళ్ళిన ఐదునిమిషాలకి బెల్ మోగుతోంది! అయ్యో! అర్జున్ వచ్చేశాడు! ఇలాగే టవల్‌తో వెళ్ళి దర్శనమిస్తే? చిలిపిగా నవ్వుకుని క్షణాల్లో రెడీ అయి తలుపు తీశాను.

తలారా స్నానం, కొత్తబట్టలు, కొత్తసెంట్, కొత్త వాచ్... సరికొత్త అర్జున్! లోపలికి వస్తూనే డెకరేషన్‌చూసి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోయాడు.




"ఎందుకు ఇదంతా?" గోముగా అన్నాడు అర్జున్.

"ముందు ఇది కట్ చేయండి!" చాకు అందిస్తూ అన్నాను.

"నాకు చాక్లెట్ కేక్ ఇష్టమని మీకెలా తెలుసు?" ప్రేమగా అడిగినట్టు అనిపించింది.

"ఇంకా చాలా తెలుసు" చిరునవ్వుతో సమాధానమిచ్చాను.

అర్జున్ కేక్ కట్ చేశాడు. ఆ తర్వాత కట్ చేసిన కేక్ నాకు తినిపిస్తాడనే తలపే నాకు ఊపిరాడకుండా చేస్తోంది! అతని మునివేళ్ళు నా పెదాలకి, మునిపంటికి తగిలాయి! గుండె ఝల్లుమంది! చిరుచెమటలు పడుతున్నాయి. అరచేతులు సన్నగా వణుకుతున్నాయి. తనకివ్వాల్సిన కానుక నా గుప్పిట్లో ఊపిరాడక అవస్థ పడుతోంది! అర్జున్ ఎదురుగా నిలబడి ఒక్కొక్కవేలూ తెరచి కానుక చూపించాను. అతడి కళ్ళు చెమర్చాయి! అమితాశ్చర్యంగా దాన్ని అందుకున్నాడు.

"నాకా?" ఉవ్వెత్తునఎగిసే ఆనందం నిండిన కళ్ళతో అడిగాడు అర్జున్.

అవునన్నట్టు తలూపాను.

"మీరే పెట్టండి".

ఆ బంగారపుటుంగరం మా బంగారు భవిష్యత్తుకి పునాది అని నా ఆలోచన. కానీ ఆ మాట బైటకు చెప్తేగా తనకీ తెలిసేది! అర్జున్ చేతుల్లోంచి ఉంగరం తీసుకుని తన కుడిచేతి ఉంగరపు వేలికి తొడిగాను. నా చేతులు చల్లగా తడిగా.. వణికిపోతున్నాయి! అర్జున్‌చేతికి చాలా అందంగా ఉంది ఆ ఉంగరం. నాకు మాటలు రావటం కష్టంగా ఉంది.

"భోం చేద్దాం పదండి" అన్నాను, నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ.

డైనింగ్ టేబుల్‌మీద పన్నీర్‌కోఫ్తా, మటన్ ఫ్రై, చికెన్ బిర్యానీ, డబల్ కా మీఠా, అన్నం, పప్పు, నెయ్యి, గోంగూర పచ్చడి, ములక్కాడ జీడిపప్పు కూరలు చూసి అవాక్కయ్యాడు.

"ఏంటండీ, ఇవన్నీ ఎవరితో చేయించారు?"

"ఎవరు చేస్తారు? నేనే" దొంగ కోపంతో అన్నాను.

"మీరా టీయల్! నాకోసం మీరు చేశారా? నా కిష్టమైనవన్నీ నాకు తెలియకుండా కనుక్కుని ఇంత సర్‌ప్రైజ్ చేశారు. నా జీవితంలో మర్చిపోలేని పుట్టినరోజు ఇది మా ఇంట్లో నాకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. బహుశా బ్యాచిలర్‌గా ఇదే నా ఆఖరి పుట్టినరోజు అనుకుంటా!"

కాళ్ళకింద భూమి కంపించినట్లైంది నాకు! పెళ్ళా? అంటే అర్జున్‌కి నామీద ప్రత్యేకాభిమానం లేదన్నమాట! ఇంత తేలిగ్గా చెప్పేశాడేంటీ? అప్పటి దాకా దిగమింగడానికి ప్రయత్నించిన దుఃఖం, బాధ, బొట్టు బొట్టుగా కళ్ళవెంబడి కారుతున్నాయి! నా ఆవేదన దాచుకోడంలో విఫలమై అర్జున్ ముందు కన్నీటి పర్యంతమయ్యాను.

అర్జున్ ఆందోళన పడుతున్నాడు.

"అరెరె! ఇప్పుడేమైందని? కళ్ళు తుడుచుకోండి ప్లీజ్!" తన జేబులోంచి రుమాలు తీసి నా కళ్ళు తుడవబోయాడు.

"ఏం లేదు సారీ! ఏదో గుర్తొచ్చి.... సడెన్‌గా... అలా ఎమోషనల్ అయ్యాను. ఏం అనుకోకండి" ఏడుస్తూనే చెప్పాను.

అర్జున్ తనచేతుల్లోకి నా ముఖాన్ని తీసుకుని కళ్ళల్లో కళ్ళు పెట్టి నేను నమ్మలేని ప్రశ్న సూటిగా అడిగాడు.

"ఇంత పెద్ద అబద్ధం చెప్పినా నా మీదున్న ప్రేమని వ్యక్తపరచదల్చుకోలేదా?"

నేను విన్నది నిజమేనా? కలకాదు కదా! వెతకబోయే తీగ కాలికి తగిలినట్టూ, అర్జున్ నోరుతెరిచి నన్ను అడిగాడా?! నిర్ధారించుకోడానికి మళ్ళీ చెప్పమని అడిగాను.

"మీరు విన్నది నిజమే! నేనంటే మీ కిష్టం లేదూ?"

"అదీ..." నీళ్ళు నమిలాను.

"సరే ఇష్టంలేకపోతే పోనీలెండి! నాకు మాత్రం మీరంటే చాలా ఇష్టం! కానీ పైకి చెప్పాలంటే సిగ్గు! మీరేమనుకుంటారోనని భయం! ఈరోజు ఎలాగైనా చెప్పేద్దామని కంకణం కట్టుకున్నా! చెప్పేశా! అయినా మీ మనసులో ఏముందో తెలీదే!"

అర్జున్ ఆ మాటలు చెప్తుంటే గుండెవేగం పెరుగుతోంది. నా కళ్ళు వర్షిస్తూనే ఉన్నాయి. నా కల, నా ఆశ, నా అర్జున్! నిజమైన వేళ!

"నాకూ మీరంటే చాలా ఇష్టం! పిచ్చి!!" నిర్భయంగా చెప్పేశాను.

"ఈ మాటకోసం ఎన్నిరోజులుగా ఎదురు చూస్తున్నానో తెలుసా?" అంటూ నాకు తెలియకుండానే నన్ను కౌగలించుకున్నాడు! అదే కౌగిట్లో బెడ్రూంలోకి తీస్కెళ్ళాను. కౌగిలి బిగుసుకుంది. వచ్చీరాని ధైర్యం కూడగట్టుకుని తన బుగ్గ మీద నా మొదటిముద్దు పెట్టాను!

"అర్జున్..."

"మ్! చెప్పండి"

"ఇంకా అండి ఏంటి? పేరుపెట్టిపిలిచి మన స్ఫూర్తిగా ఏదైనా చెప్పొచ్చుగా!"

"టీయల్‌ల్... ఐలవ్ యూ!"

"ఐ లవ్ యూ టూ అర్జున్!"

**సెల్: 85004 96117**



# సౌభాగ్య చక్రం

ఫిబ్రవరి 8 నుంచి ఫిబ్రవరి 14 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, మార్పులు, ఆర్థిక వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వేడుకల్లో పాల్గొంటారు. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 10, 11 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 12, 13 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం అందుకుంటారు. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. విందు, వినోదాలు ఉల్లాసం కలిగిస్తాయి. 14న స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, పెద్దల ఆరోగ్యం, వేడుకలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఉద్యోగ వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. వాగ్వాదాలకు దూరంగా ఉండాలి. 10, 11 తేదీల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. ఉన్నత పదవులు అందుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. 12, 13 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 14న పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

చిన్నారులు, విద్యావిషయాలు, బదిలీలు, వృత్తి వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. విద్య, ప్రయాణాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 10, 11 తేదీల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించండి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. శుభవార్త అందుకుంటారు. 12, 13 తేదీల్లో బంధుమిత్రులను కలుసుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. 14న అంచనాలు ఫలించకపోవచ్చు. విద్యార్థులకు శుభప్రదం.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, రియల్ ఎస్టేట్ వ్యవహారాలు, ఆర్థిక వ్యవహారాలు, వేడుకలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో సంస్మరణల్లో పాల్గొంటారు. వాయిదా పద్ధతులపై వస్తువులు కొనుగోలు చేస్తారు. రుణ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు. 10, 11 తేదీల్లో ఖర్చులు అంచనాలు మించే అవకాశం ఉంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులు లాభిస్తాయి. 12, 13 తేదీల్లో రుణాలు, పెట్టుబడుల విషయాలు చర్చకు వస్తాయి. స్టేషనరీ, రవాణా, బోధన, పర్యాటకరంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 14న రియల్ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. ప్రత్యర్థులపై ఒక కన్నేసి ఉంచండి. ప్రియతములకు సంబంధించి ఒక సమాచారం కలవరపెడుతుంది. 10, 11 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 12, 13 తేదీల్లో స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 14న సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కీలక సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లలో నిదానం అవసరం.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. హోటల్, వైద్యం, రిటైల్ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి. 10, 11 తేదీల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం ఆందోళన కలిగిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. 12, 13 తేదీల్లో కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో ఉత్సాహంగా ఉంటుంది. వేడుకలు, విందుల్లో పాల్గొంటారు. 14న ఖర్చులు అధికం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

విద్య, చిన్నారుల విషయాలు, పొదుపు పథకాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 10, 11 తేదీల్లో ఖర్చులు అధికం. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 12, 13 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారికి శుభప్రదం. 14న విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ప్రేమానుబంధాలు బలపడతాయి.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

గృహ, విద్యావిషయాలు, వేడుకలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లలో కొంత అసౌకర్యం కలుగుతుంది. 10, 11 తేదీల్లో సమావేశాల్లో నిదానం పాటించండి. బదిలీలకు అనుకూలం. పైఅధికారుల వైఖరి ఆనందం కలిగిస్తుంది. 12, 13 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో మార్పులకు అనుకూలం. పెట్టుబడులు లాభిస్తాయి. 14న వేడుకలకు ఏర్పాట్లలో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులకు సంబంధించిన నిర్ణయాల్లో నిదానం అవసరం. విలువైన పత్రాలు అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం అందుతుంది. 10, 11 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించండి. విద్యార్థులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 12, 13 తేదీల్లో ఇంట్లో సందడి వాతావరణం నెలకొంటుంది. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. ప్రముఖులతో సమావేశాలు ఫలిస్తాయి. 14న ఒక సమాచారం కలవరపెడుతుంది. స్నేహానుబంధాలు బలపడతాయి.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

విద్య, పెట్టుబడులు, సోదరీసోదరుల వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో స్పెక్యులేషన్లలో నిదానం పాటించాలి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 10, 11 తేదీల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు సఫలం అవుతాయి. 12, 13 తేదీల్లో ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి కొత్త వ్యూహాలు అమలు చేస్తారు. పెట్టుబడులకు సంబంధించిన చర్చలు ఫలిస్తాయి. రుణాలు మంజూరవుతాయి. 14న వృత్తి, వ్యాపారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం లభిస్తుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 10, 11 తేదీల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. 12, 13 తేదీల్లో వేడుకలు, సంస్మరణల్లో పాల్గొంటారు. వైద్యం కోసం అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. 14న ఒక సమాచారం మనస్తాపం కలిగిస్తుంది. చర్చల్లో, సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, ప్రయాణాలు, కీలక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 10, 11 తేదీల్లో ఆరోగ్యం పట్ల దృష్టి సారించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. 12, 13 తేదీల్లో బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం. కొత్త పరిచయాలు లాభిస్తాయి. 14న ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపాలి. ఆర్థిక విషయాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆంతరంగిక విషయాలు చర్చకు వస్తాయి.






## విలన్‌గా శ్రీకాంత్

కొన్ని సంవత్సరాల క్రితం వరకూ శ్రీకాంత్ హీరో! ఆ తరువాత నెమ్మదిగా క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా మారాడు. ఇప్పుడు విలన్ అవతారం ఎత్తబోతున్నాడు. కాకపోతే టాలీవుడ్‌లో బోలెడంత మంది విలన్లు ఇప్పటికే ఉన్నారు కనుక మాలీవుడ్‌కి వెడుతున్నాడు. మోహన్ లాల్ సినిమాలో విలన్‌గా చేయబోతున్నాడు. ఇంతమంది విలన్లు ఉండగా శ్రీకాంత్‌ని తీసుకోవడంలో ఓ మెలిక ఉంది అంటున్నారు సినీజనాలు. ఈ సినిమాను టాలీవుడ్‌లో డబ్ చేసే అవకాశాలు ఉన్నాయట! ఆల్‌రెడీ ఉన్న విలన్లు తెర మీద బోలెడన్ని సార్లు కనిపించి బోర్ కొట్టించేశారు. శ్రీకాంత్ అయితే ఫ్రెష్‌గా కనిపిస్తాడని మాలీవుడ్ దర్శకనిర్మాతలు భావిస్తున్నారట! టాలీవుడ్‌లో శ్రీకాంత్ విలన్‌గా సక్సెస్ సాధిస్తే మరో మంచి విలన్ దొరికినట్టే అంటున్నారు సినీజనాలు. కాకపోతే సాఫ్ట్‌గా కనిపించే శ్రీకాంత్ విలనిజం పండించ గలడా? అన్నదే కొందరి అనుమానం.

## 'బాహుబలి-2'లో బాలీవుడ్ బాద్‌షా!



ఈ సినిమా మీద అంచనాలు రోజురోజుకీ పెరిగిపోతున్నాయి. ఓ వైపు మార్కెట్ కూడా అలాగే జరుగుతోంది. దీని గురించి ఎంత చిన్న వార్త బయటకొచ్చినా అదో పెద్ద సెన్సేషన్ అన్నట్టు చెప్పుకుంటున్నారు. ఎప్పుడెప్పుడు ఈ సినిమా చూద్దామా? అన్న ఉత్సాహంతో ఉన్న సినీ అభిమానులకు మరింత కనువిందు చేసే పనిలో పడ్డాడు జక్కన్న. ఉన్నవారు చాలరన్నట్టు ఈ సినిమాలో స్టార్ హీరోల చేత గెస్ట్ రోల్ చేయిస్తే ఎలా ఉంటుంది? అన్న ఆలోచన వచ్చిందట! అదీ బాలీవుడ్ వారయితే మరీ మంచిది అనుకున్నాడట! వెంటనే ఒకే ఒక్క హీరో పేరు గుర్తొచ్చిందట! ఆ హీరో మరెవరో కాదు. బాలీవుడ్ బాద్‌షా షారూఖ్ ఖాన్. ఈ బాద్‌షా దక్షిణాది వారికి కూడా బాగా తెలుసు కనుక అటు ఉత్తరాదిన, ఇటు దక్షిణాదిన అందరికీ తెలిసిన, అందరూ మెచ్చిన షారూఖ్ చేత ఓ గెస్ట్ రోల్ చేయించబోతున్నారట! కాకపోతే దీని గురించిన పూర్తి సమాచారం ఇంకా తెలియడం లేదు.



## మాజీ భార్యకు నో

హృతిక్ రోషన్ భార్య సుసానేకు విడాకులు ఇచ్చినా తరచూ కలుసుకుంటూనే ఉన్నాడు. పిల్లల కోసమో, తన సినిమాలు చూపించడానికో ఇలా ఏదో ఒక సందర్భంలో భార్యాబిడ్డలతో గడుపుతున్నాడు హృతిక్. వారిని కలుసుకున్నప్పుడల్లా ప్రేమగా దగ్గరకి తీసుకోవడం, తన కొత్త సినిమాను వారికి చూపడం చేస్తున్నాడు. ఇవన్నీ చూసిన బాలీవుడ్ జనాలకు పెద్ద అనుమానం వచ్చింది! తిరిగి వీరిద్దరూ కలిసిపోయారా? అని. అయితే భార్యతో కలిసి జీవించే అవకాశం ఎంత మాత్రం లేదనీ, తామిద్దరం విడిపోయినా, పిల్లల బాధ్యత ఇద్దరి మీదా ఉండడంతో వారికోసం, వారి ఆనందం కోసం అప్పుడప్పుడు కలుస్తున్నామనీ స్పష్టం చేశాడు. తిరిగి కలిసి జీవించే ఆలోచన తనకు కానీ, సుసానేకు కానీ లేదనీ అంటున్నాడు.

## నూరవ సినిమాకు సుమన్ రెడీ



సుమన్ నూరవ సినిమా చేయడం ఏమిటి? అన్న అనుమానం అక్కర్లేదు. హీరోగా నూరవ సినిమా కాదు. అసలు సుమన్ హీరో నుంచి క్యారెక్టర్ ఆర్టిస్టుగా మారిన తరువాత దక్షిణాదిన అన్ని భాషలలో కలిపి దాదాపు 500 సినిమాలు చేశాడు. కాకపోతే తెలుగులో ఇప్పటి వరకూ 99 సినిమాలు చేశాడు. ఇప్పుడు వందవ సినిమాకు రెడీ అవుతున్నాడట! తెలుగులో తన నూరవ సినిమా స్పెషల్‌గా ఉండాలన్న ఉద్దేశంతో కథల విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకుంటున్నాడట! అందుకే తెలుగులో ఇటీవలి కాలంలో ఏ సినిమా ఒప్పుకోలేదని చెబుతున్నాడు. మంచి కథతో ఎవరైనా వస్తే రెమ్యునరేషన్ గురించి ఆలోచించనని బంపర్ ఆఫర్ ఇచ్చాడు కూడా!



## రాజకీయం చేయడట!

తమిళనాడులో జల్లికట్టు ఇష్యూమీద కోలీవుడ్ హీరోలే కాదు. టాలీవుడ్ హీరోలూ బాగానే స్పందించారు. టాలీవుడ్‌కీ, జల్లికట్టుకీ ఎలాంటి సంబంధం లేకపోయినా, మానవతా దృక్పథంతో మన వాళ్లు వ్యవహరించారు. ఇదంతా పక్కన పెడితే ఆ సంఘటన గురించి లారెన్స్ స్పందనే అందరి దృష్టినీ ఆకర్షించింది. అతని స్పందన చూసిన చాలా మంది లారెన్స్ త్వరలోనే రాజకీయాల్లోకి రావచ్చని ఊహించారు. కానీ, అలాంటిదేమీలేదనీ, తనకు రాజకీయాలు పడవనీ, రాజకీయం చేయననీ స్పష్టం చేశాడు. తన పరిధిలో మాత్రమే ప్రజాసేవ చేస్తానని చెబుతున్నాడు. కాకపోతే భవిష్యత్తు గురించి ఇప్పుడే చెప్పలేను కదా! అనడం కొసమెరుపు. ఈ మాటే అందరి ఊహలకు ఊతం ఇస్తోంది.





# దుమ్ము రేపిన దంగల్ సిస్టర్స్

**'దంగల్' సినిమా గురించి తెలియని సినీ ప్రేక్షకులు ఉండరు అంటే అతిశయోక్తి కాదేమో! ఈ సినిమా సృష్టించిన, సృష్టిస్తున్న ప్రభంజనం అలాంటిది. ఆటల నేపథ్యంలో గతంలో వివిధ భాషలలో చాలా సినిమాలు వచ్చినా ఈ సినిమాకు మాత్రం ప్రేక్షకులు బ్రహ్మరథం పడుతున్నారు. ఉత్కంఠ కలిగించే పోరాటాలు, కథా కథనంతో పాటు ఆ సినిమాలో నటించిన వారి ప్రతిభ ముఖ్య కారణం. ఈ సినిమాలో అక్కాచెల్లెళ్లుగా నటించిన ఫాతిమా సనా షేక్, సాన్యా మల్హోత్రా గురించి ఎవరికీ పెద్దగా తెలియదు. ఒక్కసారిగా అందరి దృష్టి తమమీద పడడానికి సినిమానే కారణం అంటున్న 'దంగల్' సిస్టర్స్‌తో....**

**ఇంతకు ముందు వెండితెర మీద చేశారా?**

**ఫాతిమా:** గత మూడు నాలుగు సంవత్సరాలుగా సినిమాల్లో అవకాశాల కోసం ప్రయత్నిస్తూనే ఉన్నాను. సరైన బ్రేక్ ఈ సినిమాతోనే వచ్చింది. ఎప్పుడో చిన్నతనంలో కమల్‌హాసన్ గారితో 'చాచీ 420'లో చేశాను. ఆ సినిమా గుర్తు కూడా లేదు.

**సాన్యా:** ఇంకా ట్రయల్స్‌లోనే ఉన్నా. కొన్ని యాడ్స్‌లో చేసిన అనుభవం తప్ప వెండితెర మీద పెద్దగా అనుభవం లేదు.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

**సాన్యా:** చిన్నతనం నుంచీ డ్యాన్స్ నేర్చుకున్నాను. గ్రాడ్యుయేషన్ అయిపోగానే నాట్యాన్ని వృత్తిగా చేసుకోవాలనుకున్నాను. ముంబయిలో ఓ టీవి వారు నిర్వహించిన డ్యాన్సింగ్ రియాల్టీ షోకి ఆడిషన్‌లో టాప్ 100లో నిలిచాను గానీ ఆ ప్రోగ్రామ్‌లో పాల్గొనే అవకాశం మాత్రం దక్కలేదు. ఓ నాలుగైదు నెలలు ఏంచెయ్యాలా? అనే ఆలోచనతోనే గడిపాను. ఆ సమయంలోనే యాడ్స్ చేసే అవకాశం వచ్చింది. అవి చేస్తుండగానే కాస్టింగ్ డైరెక్టర్ ముఖేష్ ఛబ్రాస్‌గారి నుంచి పిలుపు వచ్చింది. వెళ్లాను. అంతే నెల దాకా వారి నుంచి ఎలాంటి కాల్ రాలేదు. మధ్యలో ఆ సినిమా కంగనారనౌత్ చేస్తున్నారని తెలిసింది. అనుకోకుండా ముఖేష్ గారి నుంచి కాల్ వచ్చింది, అమీర్‌సార్ నన్ను కలవాలనుకుంటున్నారని. వెంటనే వెళ్లి కలిశాను. అక్కడినుంచి నా వెండితెర ప్రయాణం మొదలైంది.

**ఫాతిమా:** గత మూడు నాలుగు సంవత్సరాలుగా ఈ ఫీల్డులో ఉన్నా పెద్దగా అవకాశాలు రాలేదు. ఈ సినిమాకి ముందు ఆరునెలల పాటు నా ఫోటోలు పట్టుకొని స్టూడియోల చుట్టూ తిరుగుతూనే ఉన్నాను. నటిగా అవకాశాలు రావడం కష్టంగా ఉంది కనుక సినీ ఫోటోగ్రఫీ నేర్చుకుందామని అనుకున్నాను. ఆ సమయంలోనే ముఖేష్ గారి అసిస్టెంట్ ద్వారా నాకు ఈ అవకాశం వచ్చింది. ఆడిషన్‌కి అటెండ్ అయిన నెల రోజుల వరకూ సినిమాలో అవకాశం వస్తుందా? రాదా? అనే టెన్షన్‌తోనే గడిపాను. నెల రోజుల నిరీక్షణ అనంతరం ఛాన్స్ వచ్చిందని తెలిసింది. ఆ ఆనందం మాటల్లో చెప్పలేను. ఈ పాత్ర చేసే ముందు గీత ఫోగట్ గురించి నాకు అస్సలు ఏం తెలియదు. అది ఎంత అవమానంగా అనిపించిందో మాటల్లో చెప్పలేను.

## సున్నితంగా ఉండే మీకు రెజ్లింగ్ కష్టమనిపించ లేదా?

**ఫాతిమా:** రెజ్లింగ్ కోసం రెండు వారాల పాటు ఆడిషన్‌కి వెళ్లాల్సి వచ్చింది. ఎంత కష్టం అనిపించేదో! ఆ రోజులన్నీ శరీరం పచ్చిపుండులా అయిపోయింది. ప్రతిరోజూ ఉదయం ఏడుపు వచ్చేది. ట్రైనింగ్ మొదలయ్యాక పెద్దగా కష్టం అనిపించలేదు.

**సాన్యా:** రెజ్లింగ్ నిజంగా చాలా కష్టమైంది. కానీ మా కోచ్ ఎక్కువగా ఆ కష్టం తెలియ కుండా ఆడుతూపాడుతూ నేర్చుకునేలా చేశారు. చాలా తక్కువ సమయంలో రెజ్లింగ్ నేర్చుకోగలి గామంటే అదంతా కోచ్ గొప్పతనమే!

## శిక్షణా సమయం ఎలా ఉండేది?

**ఫాతిమా:** ఉదయం ఆరున్నరకే ప్రాక్టీస్‌కి బయలుదేరేవాళ్లం. మేముండే ప్రాంతం నుంచి శిక్షణాస్థలికి చేరుకోవడానికి సుమారు గంట న్నర పట్టేది. మూడు నాలుగు గంటల ప్రాక్టీసు తరువాత తిరిగి ఇంటికి వచ్చేవాళ్లం. తినేసి కొంతసేపు నిద్రపోయి తిరిగి ప్రాక్టీసు కోసం వెళ్లేవాళ్లం. అక్కడ కొంతసేపు ప్రాక్టీసు చేసిన తరువాత జిమ్‌కి వెళ్లి వీలయినంత ఎక్కువ సమయం గడిపేవాళ్లం.

**సాన్యా:** మేమేదో సినిమా కోసం ప్రాక్టీసు చేస్తున్నట్టు ఎప్పుడూ అనిపించలేదు. నిజంగా రెజ్లింగ్ నేర్చుకునేవారు ఎలాంటివి ఫాలో అవు తారో మేం కూడా వాటినే ఫాలో అయ్యేవాళ్లం. వాళ్లు తీసుకునే ఆహారాన్నే తినేవాళ్లం. మేం నిజ మైన స్టూడెంట్స్‌లాగా మారిపోయాం. రాత్రి తొమ్మిదిగంటలకల్లా నిద్రపోయేవాళ్లం. ఒక్క మాటలో చెప్పాలంటే నిజం రెజ్లర్స్‌లాగా మారి పోయాం.

## రెజ్లర్స్ శరీరం చాలా దృఢంగా ఉంటుంది కదా? ఆ శరీరాకృతిని ఎలా మేనేజ్ చేయగలిగారు?

**ఫాతిమా:** ఓ ఐదారునెలల్లో శరీరం అంత దృఢంగా మారడం సాధ్యం కాదు. శిక్షణ సమయంలో గీతా, బబితలను కలిశాము. వారి శరీరం ఎంత దృఢంగా ఉందో చెప్పడం కష్టం. చిన్నతనం నుంచి ప్రాక్టీసు వలన వాళ్ల శరీరం అలా తయారైంది. కాకపోతే సినిమాకు ఎంత అవసరమో ఆ మేరకు మా శరీరాలను కొంత వరకూ మార్చుకో గలిగాం.

**సాన్యా:** ఆ శిక్షణాకాలంలో మా కండరాలు దృఢంగా మారాయి. ఆ తరువాత నెమ్మదిగా మామూలు స్థితికి వచ్చేశాయి.

## పాత్ర కోసం జుత్తు కత్తిరించుకోవా లంటే బాధగా అనిపించలేదా?

**ఫాతిమా:** చాలా బాధ కలిగింది. జుత్తు కత్తిరిస్తుంటే ఏడుపు వచ్చే సింది. ఎంత కత్తిరించినా తిరిగి పెరుగుతుందని అందరూ నచ్చ చెప్పారు. అది నిజమైంది కూడా!

**సాన్యా:** నాకు ఎలాంటి బాధా కలగలేదు. హ్యాపీగా అనిపించింది కూడా! కొత్త హెయిర్ స్టయిల్ నాకు బాగుందని చాలా మంది కాంప్లి మెంట్ ఇచ్చారు.

## శిక్షణా సమయంలో గానీ, పాత్రల పరంగా కానీ గీతా, బబిత ఎలాంటి సలహాలు, సూచనలు ఇచ్చారు?

**సాన్యా:** ఒకసారి వాళ్లిద్దరూ మహూరత్‌లో శిక్షణ తీసుకుంటున్న సమయంలో వచ్చారు. గీతా పెళ్లికి ఇద్దరం వెళ్లి వచ్చాం.

**ఫాతిమా:** పాత్రల పరంగా వాళ్లేమీ కల్పించుకోలేదు. కాక పోతే రెజ్లింగ్ పరంగా కొన్ని చిట్కాలు చెప్పారు అంతే! పాత్ర ఎలా ఉండాలి? మేం ఎలా నటించాలి? అన్నది అంతా డైరెక్టర్‌గారే చూసు కున్నారు.

## అమీర్‌ఖాన్ గురించి...

**ఫాతిమా, సాన్యా:** ఆయన నడిచే డిక్షనరీ లాంటివారు. ఒక్కరోజు ఆయనతో గడిపితే చాలు ఎన్నో విషయాలు నేర్చుకోవచ్చు. సినిమాకు సంబంధించి ప్రతి విషయం లోనూ ఆయన జోక్యం ఉంది. షూటింగ్ సమయంలోనూ, అయిపోయిన తరువాత బ్యాక్ గ్రౌండ్ మిక్సింగ్, సబ్‌టైటిల్స్ ఎలా ఉండాలి? అన్న విషయాలను కూడా ఆయన దగ్గరుండి చూసుకున్నారు. గతంలో మా ఫేవరెట్ హీరో వేరేవాళ్లు. ఇప్పుడు మాత్రం మా ఫేవరెట్ హీరో అమీర్ సారే! ఆయన మీద అభిమానం ఎప్ప టికీ అలానే ఉంటుంది.





## ఈ సినిమా షూటింగ్ దీర్ఘకాలం జరిగింది కదా? కుటుంబాన్ని మిస్ అయినట్టు అనిపించ లేదా?

**సాన్యా:** మా ఫ్యామిలీ, ఫ్రెండ్స్ అందరూ ఢిల్లీలోనే ఉంటారు. షూటింగ్ సమయంలో ప్రతి రోజూ వారితో ఫోన్‌లో మాట్లాడేదాన్ని. దాంతో పెద్దగా మిస్ అయినట్టు అనిపించలేదు.

**ఫాతిమా:** నా స్నేహితులందరూ విదేశాల్లో ఉన్నారు. చాలాకాలం నుంచి ఒంటరిగానే ఉంటు న్నాను. దాంతో ఎవరినీ మిస్ అయ్యానన్న బాధ కలగలేదు.

## ఒక వేళ ఈ సినిమాలో అవకాశం రాక పోయుంటే....

**సాన్యా:** ఏముందీ...ఆడిషన్స్‌కి అటెండ్ అవుతూ ఉండేదాన్ని.

**ఫాతిమా:** చెప్పానుగా ఫోటోగ్రఫీలో ట్రైనింగ్ తీసు కొని ఆ రంగంలో స్థిరపడేదాన్ని. ఇప్పుడు ఆ ఉద్దేశం లేదు.

## బాలీవుడ్‌లో చేయబోతున్న సినిమాలు?

**సాన్యా, ఫాతిమా:** ఇంకా ఏవీ ఒప్పుకోలేదు. 'దంగల్' సక్సెస్‌ను ఎంజాయ్ చేస్తున్నాం.

-చిన్ని

# చిత్ర పరిశ్రమ నాకు జీవితాన్నిచ్చింది

## -శరత్‌బాబు

**విలక్షణ నటుడు, మితభాషి శరత్‌బాబు. సహజనటుడు, సహజత్వం ఉట్టిపడే మనిషి. వేలమందిలో నిలబడినా తన ప్రత్యేకత నిలబెట్టుకుంటాడాయన. నాలుగు దశాబ్దాలుగా బహుభాషల్లో తనదైన ప్రత్యేకశైలితో నటజీవితం సాగిస్తున్నారు. చిత్రపరిశ్రమ నాకు జీవితాన్నిచ్చిందంటున్న శరత్‌బాబు ఇంటర్వ్యూ...**

శ్రీకాకుళంజిల్లా ఆముదాలవలస నా జన్మస్థలం. మా నాన్నగారు విజయశంకర దీక్షితులు. అమ్మ సుశీలాదేవిదీక్షితులు. మేం పదమూడుమంది సంతానం. ఎనిమిదిమంది అన్నదమ్ములం, ఐదుగురు అక్క-చెల్లెళ్ళు. అమ్మానాన్న ముద్దుగా నన్ను సత్యంబాబు అని పిలిచేవారు.

### చదువు, నాటకరంగం

పి.యు.సి వరకు ఆముదాలవలసలో చదువుకున్నాను. శ్రీకాకుళం ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీలో బిఎస్సీ చదివాను. కాలేజీలో చదువుతోపాటు ఆటలు కూడా ఆడేవాణ్ణి. హయ్యర్ సెకండరీలో ఉన్నప్పుడే భమిడిపాటి రాధాకృష్ణగారి 'దొంగాటకం' నాటికలో నటించాను. నీలో ఒక నటుణ్ణి చూశాను అని మా మాస్టారు కొండలరావుగారు అభినందించడం నాకు ఇప్పటికీ గుర్తే.

### కల్లోకూడా ఊహించలేదు

ప్రతి సంవత్సరం కాలేజీ నాటకాల్లో నటించేవాణ్ణి. గొల్లపూడి మారుతీరావుగారి 'రెండురెళ్ళు ఆరు' సీనియర్ విద్యార్థి రచించిన 'తెరతొలగింది' నాటిక ఎన్నోసార్లు ప్రదర్శించాం. తెరతొలగింది నాటిక కాలేజీ మ్యాగ్‌జైన్‌లో కూడా ప్రచురితమైంది. మేం ప్రదర్శించినప్పుడలా అందరూ ఆ నాటికను ఎంతో ఎంజాయ్‌చేసేవారు. 'నువ్వు ఉండాల్సింది కాలేజీలో కాదు, మద్రాసులో' అని మా ఇంగ్లీషు లెక్చరర్ పి.ఎస్.ఎన్ పదే పదే అనేవారు. నేను సీరియస్‌గా తీసుకునేవాణ్ణి కాదుగానీ చివరకు అదే నా వృత్తి అవుతుందని ఊహించలేదు.

ఆముదాలవలసలో మాకు 'గౌరీశంకర్' అని ఒక హోటల్ ఉండేది. మా ఊళ్ళో అదే మంచి హోటల్. టిఫిన్లు పరిశుభ్రంగా ఉండేవి. అందరూ అక్కడికే వచ్చేవారు. మా నాన్నగారు మాత్రం రైల్వే క్యాంటీన్ కాంట్రాక్టు తీసుకుని నడిపేవారు. నేనూ మా చిన్నన్నయ్య ఈ హోటల్ చూసుకునేవాళ్ళం. పాకెట్‌మనీ అవసరమైనప్పుడు మాత్రం ఆ హోటల్‌లో కూర్చుంటూ ఉండేవాణ్ణి. ఎక్కువగా మా చిన్నన్నయ్యే హోటల్ చూసుకునేవాడు. నేను కాలేజీకి వెళ్ళేవాణ్ణి.

### స్నేహితుల పోరు

హైస్కూల్లో ఉండగా విజయనగరంలో 'తేనెమనసులు' సినిమా చూశాను. ఆ ఆర్టిస్టులంతా ఆ సినిమా హాలుకు వస్తున్నారని తెలిసి వెళ్ళాను. ఆ తర్వాత రామారావుగారు, నాగేశ్వరరావుగారి సినిమాలు క్లాస్‌మేట్స్‌తో కలిసి చూసేవాణ్ణి. మాతృదేవత, శ్రీకృష్ణ పాండవీయం, మూగమనసులు ఇలా ఎన్నో చిత్రాలు చూశానుగానీ సినిమాల్లో నటించాలనే కోరిక ఏ కోశానా ఉండేదికాదు. స్నేహితులు మాత్రం సినిమాల్లో ట్రై చెయ్యమని వెంటపడేవారు. నీ పర్సనాలిటీ బాగుంది, మద్రాసు వెళితే తప్పక సెలక్ట్ అవుతావు అనేవారు. నాకుమాత్రం పోలీసాఫీసర్ కావాలనే బలీయమైన కోరిక ఉండేది. కానీ అనివార్య పరిస్థితులవల్ల నేనూ చిన్నన్నయ్య ఇద్దరం గౌరీశంకర్ హోటల్ చూసుకునేవాళ్ళం. పెద్దన్నయ్యా ట్రాన్స్‌పోర్ట్ చూసుకునేవాడు. మధ్యమధ్యలో నాన్నగారు వచ్చి సూపర్‌వైజ్ చేసి వెళ్ళేవారు.

### ఆదుర్తి సుబ్బారావుగారి అభిమానిని

ప్రముఖ దర్శకుడు ఆదుర్తి సుబ్బారావుగారికి నేను అభిమానిని. కాలేజీ చదువు పూర్తికాగానే, అన్నయ్యకు తోడుగా, మధ్యాహ్నం నుంచి రాత్రివరకు హోటల్‌లో ఉండాలని నిర్ణయించుకున్నాను. ఆ సమయంలోనే నా స్నేహితులు మద్రాసు వెళ్ళమని బలవంతం చేయడం మొదలెట్టారు. నాకేమో మద్రాసు తెలియదు. ఎలా నెగ్గుకురావాలనే భయం. ఆదుర్తి సుబ్బారావుగారు కొత్త నటుల్ని తన సినిమాల్లో పరిచయం చేసేవారు. అందుకే ఆయనకు నా ఫొటోలు పంపించాను. ఆయన స్పందించి ఇంటర్వ్యూకి పిలిచారు. వెళ్ళాను. చాలాసేపు ఆయనకోసం వెయిట్ చేశాను. తర్వాత నన్ను కిందినుంచి పైదాకాచూసి, నేను ఇప్పుడు ఒక హిందీ సినిమా షూటింగ్‌లో ఉన్నాను, మళ్ళీ పిలుస్తాను అప్పుడు వచ్చి కలవండి అని చెప్పి వెళ్ళిపోయారు ఆదుర్తి. నా మిత్రుడు ప్రభాకర్

ఉద్యోగ ప్రయత్నాల్లో మా ఊరునుంచి మద్రాసు వచ్చాడు. అతని తమ్ముడు కూడా అక్కడే ఉద్యోగం చేస్తున్నాడు. ఆదుర్తిగారు ఎలాగూ మళ్ళీ రమ్మన్నారు కదా అని ఈ లోపు నటులందరినీ చూద్దాం అనే కోరికతో నేను, ప్రభాకర్ తమ్ముడు కలిసి ఒక రూమ్‌లో సెటిలయ్యాం.



### హేమాహేమీలతో తొలిచిత్రం

రామావిజేత ప్రొడక్షన్స్‌వారు కొత్త హీరో కావాలని ప్రకటన ఇచ్చారు. నా స్నేహితుడు ప్రభాకర్ ఆ ప్రకటన నాకు చూపించి ఇంటర్వ్యూకి వెళ్ళమని ప్రోత్సహించాడు. ఆ చిత్ర దర్శకుడు బాబూరావు, నిర్మాత ప్రభాకర్. ఇంటర్వ్యూకి చాలామంది వచ్చారు. చివరకు ముగ్గురం మిగిలాం. స్క్రీన్ టెస్ట్ చేసి ఆ ముగ్గురిలో నన్ను సెలక్ట్ చేసుకున్నారు. అప్పటికప్పుడే, 'యూ ఆర్ ద హీరో ఆఫ్ మై పిక్చర్' అన్నారు బాబూరావు. ఇది కలా నిజమా? అనిపించింది. ఒక్క సెకను రియాక్షన్ లేకుండా నిలబడిపోయాను. హీరో అనేమాట వినడం స్కూల్లో నాకు మొదటి నుంచీ అలవాటే. కానీ ఒక దర్శకుడు అలా చెప్పడం గ్రేట్ అనిపించింది.

ఆ విధంగా నేను హీరోనయ్యాను. అలా రామ రాజ్యం చిత్రంలో చంద్రకళ, నేను నటించాం. జగ్గయ్య గారు నాకు అన్నయ్య. ఎస్.వి.రంగారావుగారి కుమార్తెగా చంద్రకళ, అల్లుడుగా నేను, మహానటి సావిత్రి నాకు వదినగా నటించారు. ఇలా నా మొదటి చిత్రంలోనే హేమాహేమీలుండటం నా అదృష్టం. రోజారమణి, చంద్రమోహన్ కూడా చిత్రంలో ఉన్నారు. నా మొదటిచిత్రం కుటుంబకథా చిత్రం కావడంతో అందరూ నా పాత్రను హీరోపాత్రగా అభి నందించారు. అదినాకు ప్లస్ పాయింట్ అయింది. ఆర్టిస్టుగా నిలదొక్కుకున్నాననే ధైర్యం వచ్చింది. 1973లో ఈ చిత్రం విడుదలైంది. ఆ తర్వాత రక రకాల పాత్రలు ధరిస్తూ వచ్చాను.

### నోము

నోము చిత్రంలో కొంతవరకు నెగెటివ్ ఛాయ లున్న ముఖ్యమైన పాత్రలో చేశాను. రామకృష్ణ, చంద్రకళ, జయసుధ, కె.వి.చలం లీడ్‌రోల్స్. తమిళ దర్శకుడు పట్టు దర్శకత్వంలో 1974లో ఈ చిత్రం విడుదలై విజయవంతంగా ప్రదర్శితమైంది.

డూండీగారి దర్శకత్వంలో 'అభిమానవతి' లో నటించాను. కృష్ణగారు, వాణిశ్రీ హీరోహీరోయిన్లు. ఇందులో కూడా నాది నెగెటివ్ ఛాయలున్న పాత్ర.



1975లో వచ్చిన ఈ చిత్రం కూడా విజయవంతం కావడం, ముఖ్యంగా నా పాత్ర అందరినీ ఆకట్టుకో వడంతో ఇక నా సినీయాత్ర అదేకోవలో కొనసాగిం చాను. కానీ నెగెటివ్ రోల్స్ రావడంవల్ల కొంత అసౌ కర్యంగా ఉండేవాణ్ణి.

### బాలచందర్ చిత్రం

ఒక ఫంక్షన్‌లో మా స్నేహితులందరం కబుర్లు చెప్పుకుంటున్నాం. అక్కడే మరోచోట సింగీతం శ్రీనివాస రావుగారు, బాలచందర్‌గారు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. సింగీతంగారు నన్ను పిలిచి బాల చందర్‌గారికి పరిచయం చేశారు. తమిళ్ వచ్చా? అని ఆయన అడిగారు. కొంచెం కొంచెం అని చెప్పాను. రేపువచ్చి కలు అన్నారాయన. అలా 'నిళిల్ నిజమా గిరదు' తమిళచిత్రంలో నన్ను హీరోగా ఎంపిక చేశారు బాలచందర్. ఇందులో కమల్‌హాసన్, అనంత్, నేను ముగ్గురు హీరోలం. తమిళంలో ఇది సూపర్ హిట్‌చిత్రం. ఆ విధంగా తమిళంలో కూడా నాపైన మంచి ముద్రపడటంతో బాలచందర్‌గారు దర్శకత్వం వహించిన తెలుగుచిత్రాలన్నింటిలో నటించాను. ఇది కథకాదు, గుప్పెడుమనసు చిత్రాలు హిట్ కావడంతో తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ చిత్రాల దర్శకు లందరినుంచి ఆఫర్స్ రావడం ప్రారంభమైంది.

హిందీ చిత్రాల్లో కూడా నటించాను. నాగార్జున క్రిమినల్ చిత్రం తర్వాత రాఖీ-3, 'వేకింగ్ డ్రీమ్స్' ఆంగ్లచిత్రంలో కూడా నటించాను. ఒక ఎన్నారై ఈ చిత్రం నిర్మించారు. అదేవిధంగా సీతాకోకచిలుక, సితార, సాగరసంగమం, స్వాతిముత్యం, బాపూ గారి రాధాకల్యాణం, పెళ్ళీడు పిల్లలు, రేలంగి నర సింహారావుగారి శిక్ష, అశోక్‌కుమార్‌గారి అభి నందన, అయ్యప్పస్వామి మహాత్మ్యం... వంటి చిత్రాలు ప్రేక్షకులు బాగా మెచ్చిన చిత్రాలు, నాకు నచ్చిన చిత్రాలు. మగధీర, నాగార్జున 'షిర్డీసాయి బాబా', నాగవల్లి చిత్రాలన్నీ విజయవంతమైనవే.

### గురుతుల్యులు

ఎంతోమంది దర్శకుల దగ్గర నటుడుగా ఎన్నో మెళకువలు నేర్చుకున్నాను. వారంతా నాకు గురు తుల్యులే. ముఖ్యంగా కె.బాలచందర్, విశ్వనాథ్, బాపు వంటి దిగ్గజాలు, భారతీరాజా, మహేంద్రన్, మణిరత్నం లాంటి చేయితిరిగిన దర్శకుల చిత్రాల్లో నటించడం నా అదృష్టం.

కోట్లాదిమంది ప్రేక్షక హృదయాల్లో స్థానం సంపాదించుకున్నాను. దక్షిణభారతదేశ భాషల్లో నటుడుగా పాపులర్ అయ్యాను. దాదాపు పాతిక ముప్పైకోట్లమంది ప్రజల హృదయాల్లో నాకు చిర స్థానం దొరికింది. నా జీవితంలో ఇంతకంటే గొప్ప విషయం, మరపురాని సంఘటన మరొకటి ఏం ఉంటుంది చెప్పండి. ఒక కళాకారుడుగా నాకొక ప్రత్యేకస్థానం ఇచ్చిన దక్షిణాది ప్రజలకు ఎల్లప్పుడూ ఋణపడి ఉంటాను.

### జీవితాన్నిచ్చిన సినీ పరిశ్రమ

జన్మనిచ్చింది తల్లిదండ్రులైతే, నాకు జీవితాన్ని చ్చింది చిత్ర పరిశ్రమ. ఈ పరిశ్రమలో నా కంటికి ఎప్పుడూ మంచే కనిపిస్తుంది. ఈ ఇండస్ట్రీ ఎల్ల ప్పుడూ అభివృద్ధి చెందుతూ, నూతనత్వాన్ని సంత రించుకుంటూ, పురోబాటలో నడుస్తూనే ఉంది. టెక్నాలజీ ఎంతో పెరిగింది. నటులు, సాంకేతిక నిపు ణులు, నిర్మాతలు ఎవరికివారు కృషితో పైకివచ్చి నిలదొక్కుకున్నవారే. కనుక వీళ్ళంతా అన్ని విధా లుగా శిక్షణపొంది రాటుదేలినవారే. కృషి చేసేవారే పరి శ్రమలో నిలబడుతున్నారు. అప్పటికీ ఇప్పటికీ పరి శ్రమలో నేను చూసిన తేడా, గొప్ప దర్శకులు, సాంకే తిక నిపుణులతో పనిచేస్తూ నిరంతరం నేర్చుకుంటూ వాళ్ళవాళ్ళ వృత్తుల్లో పైకివచ్చి అందరూ ముందుకు సాగిపోతున్నారు. ఇప్పటి జనరేషన్ నటుల్లోగానీ, సాంకేతిక నిపుణుల్లోగానీ అన్నిరకాల విద్యలూ నేర్చుకున్నతర్వాతే సినీరంగ ప్రవేశం చేస్తున్నారు. నిలదొక్కుకుంటున్నారు.

### సీరియల్

టీవీ సీరియల్స్‌లో చేస్తున్నాను. వాటిల్లో నాకు బాగా పేరు వచ్చిన సీరియల్ అంతరంగాలు. ప్రస్తుతం సింగం-3 తమిళచిత్రంలో నటిస్తున్నాను. కోడి రామ కృష్ణగారి దర్శకత్వంలో పుట్టపర్తి సాయిబాబా, మరికొన్ని చిత్రాల్లో నా పాత్రలకు సంబంధించి చర్చలు జరుగుతున్నాయి.

### నంది అవార్డులు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుంచి నంది అవార్డులు, తమిళనాడు ప్రభుత్వం నుండి ఉత్తమ నటుడు అవార్డు, కర్నాటక ప్రభుత్వ ఉత్తమ నటుడు అవా ర్డులు అందుకున్నాను. నాకు వచ్చిన వాటిల్లో ఈ అవా ర్డులు కూడా ఉన్నందుకు నేను ఎంతో గర్వపడతాను.

### ఆధ్యాత్మికత

నా దృష్టిలో పనే దేవుడు. పని లేకుంటే దేవుడే పని. ఈ సృష్టిలో ఎవరూ సర్వస్వతంత్రులుకారు. ఏదీ ఇండిపెండెంట్ కాదు. సృష్టిలో ప్రతీదీ పరస్పర ఆధారితాలే. భార్య, భర్త, తల్లిదండ్రులు, పిల్లలు అందరూ పరస్పర ఆధారితాలే. స్నేహితులు, గురు శిష్యులు, ఇంటర్‌డిపెండెంట్స్. పంచభూతాలు, జీవులు ఇంటర్ డిపెండెంట్స్ సృష్టిలో ఏదీ సర్వస్వతంత్రం కాదు.

### వదంతులు

ప్రపంచానికి తెలియని నిజాలు కూడా కొంద

